## —∗ పీఠిక ∗—

పూజ్యులగు చదువరులారా!

నాటక రచనయందుఁగాని, పాండిత్యవిశేషంబునఁగాని యే నొక్కింతయు సమర్థుఁడఁ గాకయుండినను నే నప్పుడప్పుడు వ్రాయుచువచ్చిన సంగీతసాహిత్యసంబంధములగు చాటుధారాకవిత్వంబున కానందించుచువచ్చిన నామిత్రులలో నొక్కరియు, వారిలో ముఖ్యముగా మ. రా. వేమవరపు రామదాసుపంతులు బి. యే., బి. యల్. గారియొక్కయు ప్రోత్సాహమువలన నిట్టి గ్రంథరచనకుఁ బూనితి. మదుద్యమంబు కథాగౌరవంబునం జేసియైన బుధజనాదరణీయంబగునని యు, భగవద్గుణానుభవబోధకంబుగ నుండుటచేతనైన సార్థకంబగునని యు నెంచి యందుల కనుకూలంబగు రుక్మాంగదచరిత్రంబును జేకొని యిట్లు నాటకంబుగ నొనరించితి.

దీనికిఁ గథానాయకుఁడు రుక్మాంగదమహారాజు. ఈయనకు నూర్వురు భార్యలు కలరు. వీరిలోఁ బట్టపుదేవియగు సంధ్యావళిని మఱియొద్దఱను మాత్రము దీనియందుఁ బాత్రలుగాఁ జేకొంటిని. రుక్మాంగదుఁడు మోహినిని వరించుట, శయ్యాగృహమునుండి వెలువడి వ్రతాచరణంబున వేగ నుద్యమించుట, వ్రతార్థము పుత్రుని ఖండింపఁబోవుట, యిత్యాది స్థలములయందు రంగస్థలసౌకర్యార్థంబును సునీతిబోధనానుకూలంబుగను మూలకథ నొక్కింత మార్చితి.

ఈకాలపు నాటకసామాజికుల యుత్సాహానుసరణంబుగ రంగస్థలమం దిచ్చటచ్చటఁ బాడుకొనుటకుఁ గొన్ని పాటలు మొదలగువానిని వ్రాసి వానికొఱకై గ్రంథమందు సూచనలిచ్చి గ్రంథాంతమందు వానిని వేఱుగఁ బీఠికతో ముద్రింపించితి

బెజవాడ,
19—9—'06

బుధజన విధేయుఁడు,
జెత్తిపూడి భగవంతరావు,



# ద్వితీయముద్రణమునకు పీఠిక.

పూజ్యులగు చదువరులారా!

ప్రథమ ప్రయత్నముగ నేను పొలుత రచియించిన యీ రుక్మాంగదనాటకమును విద్యాధికులగు వారు ప్రశంసాపత్రికల నొసంగుటచేతను, బహునాటకసమాజముల వారు జనరంజకముగఁ బ్రదర్శించుటచేతను, భక్తులగు వారు ఏకాదశీ శివరాత్రము మొదలగు నియమదినములయందు కాలక్షేపముకొఱకు దీని లోని కొన్ని పుటలను బఠించుచుండుటచేతను, సుజనులగు వారు దీని యందలి గుణలేశముల కొనియాడుటచేతను నాకుఁ గల్గించిన ప్రోత్సాహమునకు వారియెడఁ గృతజ్ఞుఁడనగుచు వారలకు నా వందనశతంబు లర్పించుచున్నాఁడను.

ఈ కథ యొక్క నాటకప్రదర్శనమున కించుక పెద్దదిగ నుండెనని కొందఱభిప్రాయపడుచున్నారు. ఇది యేకాదశి మొదలగు పర్వదినములయందు జాగరణముకొఱకు రాత్రియంతయుఁ బ్రదర్శించుటకు సరిపోవునట్లు సరిగా వ్రాయఁబడినది. ఇతరదినములలోఁ బ్రదర్శించు వారు కొందఱు నాలుగవయంకమును విడిచియు, మఱికొందఱు ప్రస్తావన నుండి మొదలిడియుఁ బ్రదర్శించి సరిపుచ్చుకొనుచున్నారు. అట్లు చేసికొనవచ్చును. భక్తులగు స్త్రీపురుషాదుల కిందలి ఘట్టము లన్నియు సంతోషదాయకము లగుచుండఁగాఁ బ్రదర్శకులకై తగ్గించుట సహేతుకముగఁ దోఁచలేదు. కావుననే యిప్పుడును తగ్గింపఁబడలేదు. క్రొత్తపాటలను గొన్నిటిని జేర్చినాఁడను. వెనుకటి దోషముల మన్నింతురుగాక.

బెజవాడ,
1—1—16.

ఇట్లు విధేయుఁడు,
బేతపూడి భగవంతరావు,
మంజువాణీముద్రణశాలాధిపతి

## ఈ నాటకమందలి ముఖ్యపాత్రములు. తత్ప్రవేశస్థలములు.

### పురుషులు.

రుక్మాంగదుఁడు—విదిశాపురాధీశుఁడు. కథానాయకుఁడు.
ప్రవేశము. అంకము 1, 3, 4, 5 6.

శుకుఁడు... ... ... ప్ర. అం. 1, రం. 1—వ్రతమును బోధించు ఋషి.
సేవకుఁడు ... ... ప్ర. అం. 1, 3, 5, 6.
జాంఘికుఁడు ... ... ప్ర. అం. 1, రం. 2. అం. 5—చాటించువాఁడు.
బ్రాహ్మణులు ... ప్ర. అం. 2, 6 రం, 2.
యముఁడు ... ... ప్ర. అం. 2 రం. 1, 2
కింకరులు (ఇద్దఱు) ... ప్ర. అం. 2, రం. 1,
చిత్రగుప్తుఁడు... ... ప్ర. అం. 2. రం. 1.
నారదుఁడు ... ... ప్ర. అం. 2. రం. 1.
పాపులు (ముగ్గురు).. ప్ర. అం. 2. రం. 1.
బ్రహ్మ ... ... ... ప్ర. అం. 2. రం. 2.
గుణనిధి (మంత్రి) ... ప్ర. అం. 3. రం. 1.
కాఁపులు... ... ... ప్ర. అం. 3. రం. 1.
విదూషకుఁడు ... ప్ర. అం. 3 రం. 2.
దౌవారికుఁడు... ... ప్ర. అం. 5.
విద్యార్థులు (ముగ్గురు) ప్ర అం. 6. రం. 1.
ధర్మాంగదుఁడు ... ప్ర. అం. 6. రం. 1, 2—రాజకుమారుఁడు.
శ్రీమహావిష్ణువు ... ప్ర. అం 6. రం. 1.

### స్త్రీలు.

సంధ్యావళి ... ... ప్ర. అం. 1. రం. 1. అం. 4, 6. రం. 1, 2.
రుక్మాంగదుని పట్టపుదేవి. కథానాయిక.
చకోరాక్షి, పద్మగంధి. ప్ర. అం. 4, 6. రం. 2.
రుక్మాంగదుని భార్యలలోనివారు.
మోహిని... ... ... ప్ర. అం. 2. రం. 2. అం. 3. రం. 2. అ. 5, 6. ర. 1, 2.
బ్రహ్మమానసపుత్రి.
పుష్పమాల ... ... ప్ర. అం 5. మోహిని యొక్క చెలికత్తె.

## ఈ నాటకమునందలి ప్రత్యేక యంకమునను వచ్చు పాత్రముల వివరము.

### ప్రథమాంకము.

1 సంధ్యావళి.
2 రుక్మాంగదుఁడు.
3 సేవకుఁడు.
4 శుకుఁడు.
5 జాంఘికుఁడు.

### ద్వితీయాంకము.

1, 2, బ్రాహ్మణులు.
3, 4, బ్రాహ్మణబాలురు.
5 యముఁడు.
6 చిత్రగుప్తుఁడు.
7 వక్రదంతుఁడు.
8 దీర్ఘబాహువు.
9 నారదుఁడు.
10,11,12 పాపులు.
13 బ్రహ్మ.
14 మోహిని.

### తృతీయాంకము.

1, 2, 3 కాఁపులు.
4 రుక్మాంగదుఁడు.
5 గుణనిధి (మంత్రి.)
6 సేవకుఁడు.
7 విదూషకుఁడు.
8 మోహిని.
9 మన్మథుఁడు (తెరలో.)

### చతుర్థాంకము.

1 సంధ్యావళి.
2 చకోరాక్షి.
3 పద్మగంధి.
4 రుక్మాంగదుఁడు.

### పంచమాంకము.

1 మోహిని.
2 పుష్పమాల.
3 రుక్మాంగదుఁడు.
4 [illegible]

### షష్ఠాంకము.

1, 2, 3 విద్యార్థులు.
4 రుక్మాంగదుఁడు.
5 మోహిని.
6 ధర్మాంగదుఁడు.
7 దౌవారికుఁడు.
8 సంధ్యావళి.
9 శ్రీవిష్ణుమూర్తి.
10 గుణనిధి.
11 చకోరాక్షి.
12 పద్మగంధి.
13 బ్రాహ్మణులు.



నటి—ఏమీ! నాటకవిశేషమా? ఆనందపఱుచుటకా? ఇదెట్టిగానము?

సూత్ర—ప్రియురాలా! అట్లనెదవేల?

నటి—ఏలయా? గానవిద్యనే ప్రధానముగాఁగలది నాటకము. అట్టి గానము దుష్ట మనియు, గాయకులు గర్హ్యులనియుఁ బెక్కండ్రు వచింపఁగా నేను బలుమాఱు వినఁగలిగితిని. అట్టి నాటకముచేతనా మన యీ సభాసదుల నానందపఱుచుట?

సూత్ర—ఎంతటివెఱ్ఱిదానవు! గానవిద్యనే సహజాలంకారముగఁ గలిగిన సహస్వతిని బ్రహ్మ వాక్కున ధరించెననియు, విష్ణు గానలోలబిరుదాంకితుఁడనియు, శివుఁడు మహానటుండను సార్థక నామధేయుం డనియు నెన్నఁడును వినలేవా? మఱియును

సీ. కచ్ఛపి యనువీణఁ ♦ గరమున ధరియించి
యానంద మందదే ♦ యజునిరాణి?
మహతియన్ వీణియ ♦ రహిని ధరింపఁడే
జ్ఞానపూర్ణుండగు ♦ నారదుండు?
శ్రీకళావతివీణ ♦ చెల్వుగఁ దాల్చి ము
దంబు నందఁడె మేటి ♦ తుంబురుండు
బృహతియన్ వీణియఁ ♦ బ్రేమ ధరింపఁడే
పావనుండైన వి ♦ శ్వావసుండు
గీ. నిరత గీతామృతాప్తిత ♦ త్వరత నిట్లు
వీణియలఁ దాల్చి యొక్కింత ♦ విసువులేక
వరలు చుండరె వాదన ♦ నిరతులౌచు
నరయవే వీరు బ్రహ్మణ్యు ♦ లంచు నహహా? 3

ఇదిగాక

మ. వర కాత్యాయన, శార్ఙ్గదేవ భరతో ♦ పాధ్యాయ, శ్రీనందికే
శ్వర, శ్రీకోహళ, దత్తిలాదులు భువిన్ ♦ సంగీతమున్ బేర్మిచే
స్థిరతన్ నిల్వఁగ లక్ష్యలక్షణములన్ ♦ సిద్ధాంతముల్ వ్రాయరే?
భరతాచార్యులటంచుఁ బేర్వడయరే? ♦ బ్రహ్మత్వమున్ గాంచరే?

గానవిద్యయే దూష్యమైనయెడ నిట్టి మహానుభావులెల్లరును దీని నింతగాఁ బ్రేమింతురా? ఆదరింతురా? కాఁబట్టి యెవ్వరోపల్కిన యేదోవాక్యమును విని దాని పూర్వాపరములనయిన నెఱింగి సమన్వయపఱుచుకొనఁజాలక నీవిట్లు మోసపోయితివి సుమా. ఇదియునుగాక

సీ. శ్రీ భారతీ విపం ♦ చీభూమి జన్మించి,
నారదమౌని పే ♦ ణారవాల
వాలమందినఁ బ్రాఁకి, ♦ పదఁపడి గాంధర్వ
మృదు కంఠనాద దో ♦ హదముఁ గాంచి,
రహిమీరఁ ద్రిభువన ♦ ప్రపయందు వ్యాపించి,
నవరస పుష్ప సం ♦ తానమంది,
సరస కీరాశ్రిత ♦ స్థానమై యొప్పారు
చారు గానలతఁ బ్ర ♦ శస్త సుఖఫ
గీ. లంబు పొడసూపె; నశ్రాంత ♦ లలితసార
భరిత మీయది; శిశుపశు ♦ ఫణులకైన
భోజ్య మగుచుండు; నిట్టి య ♦ పూర్వఫలర
సానుభవ మర్థ్యమనుటకు ♦ నడ్డు కలదె? 5

నటి—అవునవును పొరఁబడితిని. ఇట్టి మహనీయు లెల్లరచే నాదరింపఁబడిన యీ గానవిద్య దూష్య మెట్టులగును? అయినను ఆర్యపుత్రా! వీరల నానందపఱుచుటకు వివిధములగు వినోదములు వేనవేలుగ నుండలేదా? నాటక మేల? గానవిద్య దూష్యముకాకయుండినను వేషధారణము దూష్యమేకదా? వేషధారియగు వాని మోమైననుం జూడఁ గూడ దందురే.

సూత్ర—"వీరల నానందపఱుచుటకు వివిధములగువినోదములు వేనవేలుగనుండలేదా" యని యనుచుంటివి. కేవలవినోదంబు లానందజనకంబులైనను జ్ఞానబోధకంబులు కావు. కావ్యంబులన్ననో కాంతాసమ్మితంబులు; జ్ఞానానంద దాయకంబులు. అందు నాటకంబులు వేషభాషలచేత నప్రత్యక్షవస్తుప్రత్యక్షీకరణ సమర్థంబులై మహానంద జనకంబు లగుటను "కావ్యేషు నాటకా రమ్యాః" అను లోకోక్తియే

చాటుచున్నది. కావున నాటకవినోదంబు బంగరుగిన్నెలోని పాయసముంబోలె నప్రతిమానంబని వేఱుగఁ జెప్పనేల?

మఱియును వేషధారులు వర్జనీయు లనుచుంటివి. సత్యము. సత్యము. వేషధారులు వర్జనీయులే. కాని యెట్టివేషధారులు?

ఉ. ఎంచఁగరాని లంచము ల ♦ నేకముగా గడించి, కొంపలన్
ముంచి, వచించరాని నయ ♦ ముం బచరించెడు వేషధారులన్
గొంచెపుబుద్ధి సాక్షులుగఁ ♦ గూళతనంబునఁ గల్ల లెన్నియో
కొంచక ప్రేలునట్టియల ♦ క్రూర దురాత్మక వేషధారులన్. 6

మఱియును కేవలస్వార్థపరులైన పొట్టకూటి వేషధారులును, అట్టులు వర్జనీయు లగుదురు. కాని లోకోపకారార్థముగ భక్తిజ్ఞానవైరాగ్యంబు ల[illegible] మూర్తీభవించినట్టు లీ దృశ్యప్రబంధమూలమున నగపఱుచుటచే వానినెల్ల నా సభాసదుల హృదయపీఠంబుల నెలకొల్పుతలంపున వేషధారులై, తదనుగుణంబు లగు గ్రంథముల సేకరించుకొని, పఠియించి, అందలి కష్టనిష్ఠురములకోర్చి, ప్రదర్శించు లోకోపకార పరాయణులగు వేషధారు లెవ్వరైన వంద్యులగుదురు గాని నింద్యులగుదురా?

నటి—బాగు బాగు. ఆర్యపుత్రా మన్నింపుఁడు. స్వోదరపోషణార్థమై కాక లోకోపకారార్థముగ ధరింపఁబడిన యెట్టివేషమైనను గణనీయ మనుటకు సందియము లేదు; కాని మఱియొక్క సందియము కలదు.

సూత్ర—ఇంకేమి సందియము?

నటి—ఈసభాసదుల నానంద పఱుపఁదగు నట్టిభక్తిజ్ఞానవైరాగ్యాది బోధకంబగు నే సచ్చరిత్రంబును మన మిచ్చటఁ బ్రదర్శింపఁ గలుగుదుమా యని.

సూత్ర—ఈసందేహముచేతనే నేనును మిగులఁ గలవరపడుచున్నాను. (అని మింటివైపు చూచుచు నాలోచించి) ప్రేయసీ! నీవే యిందున కనుకూలంబగు నొక్క సచ్చరిత్రంబును బేర్కొనుము. నీవునుం బురావృత్తంబులఁ బెక్కులుగ వినినదానవే కదా.

నటి—ఆర్యపుత్రు లనురాగవిశేషంబున నట్టు లానతిచ్చుటయే కాని మీ కెఱింగింప నేనెంతటిదానను? విద్యావిశేష సంపన్నురాలగు నా సంధ్యావళీదేవిని గాను గదా?

సూత్ర—(సంతోషముతో) హాహాహాహా! ప్రియురాలా! "సంధ్యావళీదేవి" యనుట
చేత నొక్క దివ్యచరిత్రంబును జ్ఞప్తికిఁ దెచ్చితివి.

గీ. శ్రీకరంబగు నేకాద ♦ శీమహత్వ
బోధకంబును సురనర ♦ పూజితంబు
నైన రుక్మాంగదాఖ్య ధ ♦ రాధినాథు
సచ్చరిత్రంబు పురుషార్థ ♦ సాధకంబు. 7

ఆ చరిత్రం బిచటఁ బ్రదర్శింపఁబడుటకు సర్వవిధంబులం దగియున్నది. ఆ రుక్మాంగదుని భార్యయే సంధ్యావళీదేవి. నీ విప్పు డామె పేర్కొంటివి.

నటి—ఆర్యపుత్రా! దీనిచేత నేను ధన్యురాలనైతి. ఈ చరిత్రంబును నాటకముగా నెవరు రచించిరి?

సూత్ర—ఇంకను నీ వెఱుంగవా?

సీ. భూసురుం డనుపమ ♦ పూజితవిమల చా
రిత్రుండు, శ్రీవత్స ♦ గోత్రజుండు
పర వేతపూడి స ♦ ద్వంశాబ్ధిసోముఁ డ
త్యధిక శివార్చనా ♦ తత్పరుండు
నగు లక్ష్మయామాత్యు ♦ నాత్మజులందుఁ గ
నిష్ఠుఁడు, సతత ప ♦ టిష్ఠ నయుఁడు
సంగీత సాహిత్య ♦ సరసకవిత్వాది
వివిధ విద్యామర్మ ♦ విద్వరుండు
గీ. సర్వ శుభదంబు బుధజన ♦ సన్నుతంబు
నైన రుక్మాంగదాఖ్య భూ ♦ జానిచరిత
నవ రసంబుల వెలయించె ♦ నాటకముగ

నటి—ఇదంతయుం బల్కి పూర్తి చేయుచుంటిరి; ఆ కవి నామధేయ మేమి?

సూత్ర—ప్రియురాలా! తొందరయేల? చెప్పఁబోవుచునే యుంటిని.

గీ. అఖిల జనములు ☞ భగవంతుఁ ♦ డందురతని. 8

నటి—అట్టిచరిత్రమునుఁ బ్రదర్శింపఁగలుగుటచేత నేఁ డొక [illegible] చున్నాను. నా కిప్పు డేమియాజ్ఞ నొసంగెదరు?

సూత్ర—నీ గానకళాకౌశలంబున నీ సభ్యుల నెల్లర నానందపఱుచుచు నేదైన నొక్క ఋతువును వర్ణింపుము.

నటి—ఏ ఋతువును వర్ణింపు మనెదరు?

సూత్ర—నూతన శృంగార భరితమైన యీ వసంతఋతువునే వర్ణింపుము.

నటి—చిత్తము (అని పాడుచున్నది.)

ద్విపద—ఖమాచి—రూపక తాళము—త్రిశ్రజాతి.

మంజులంబగు మధు ♦ మాసంబు లెస్స - రంజిల్లఁగా వృక్ష ♦ రాజి పేరమున
పచ్చని యాకుదు ♦ ప్పటము శోభిల్ల - హెచ్చుగాఁ గీరద్వి ♦ జేశు లాశీస్సు
లను బల్కఁ, బరభృత ♦ లలితగాయకులు - ననువొందఁగాఁ బాడ ♦ నళిబర్హిబంది
మాగధుల్ పొంగి వే ♦ మఱుజయవెట్ట - బాగుగ స్వర్ణాభ ♦ పణ్యపాత్రమున
నరుణ పల్లవదీప ♦ మలరఁ, గోరక ని - కరము దీవనబ్రాలు ♦ గాఁగ, నివాళిఁ
బొనరించి వనలక్ష్మి ♦ పూలఁ బూజింపఁ - దనరె వసంతుండు ♦ దగు వేడ్క నేఁడు 9

సూత్ర—ప్రియురాలా నీపాట కడు రమణీయముగ నున్నది.

గీ. నీదుపాటకు, ఫణితికి ♦ నీ స్వరమున
కెంత యేనియు నామది ♦ సంతసించె
పొంగుచును నాఁడు మేటి రు ♦ క్మాంగదీశుఁ
డల్ల సంధ్యావళీవిద్య ♦ కలరి నట్లు. 10

(మింటిపై చెవియొగ్గి వినుట నభినయించి) ఎచ్చటనో మృదుగానము విన వచ్చుచున్నదే! రుక్మాంగదవిభుని కంఠస్వరముగా నున్నది. (మరల వినుట నభినయించి, దూరముగా దృష్టి సారించి, చూచి) ఓహో. అవునవును. రుక్మాంగదవిభుండే. సంతోషముగ నేమో పాడుకొనుచు సంధ్యావళీదేవియంతఃపురంబునకుఁ బోవుచున్నాఁడు. ఈదారినే రావచ్చును. మన మిట నుండఁజనదు. పోవుదము రమ్ము. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

(ఇది ప్రస్తావన.)

రంగము—సంధ్యావళీదేవి యంతఃపురము.

(సంధ్యావళీ దేవి గ్రంథావలోకనఁ జేయుచుఁ గూరుచుండి యుండఁగా రుక్మాంగదమహారాజు చేత నొక పుష్పముఁ దీసికొని ప్రవేశించుచున్నాఁడు.)

రుక్మా—[4] హా! యీ కుసుమం బెంత రమణీయముగ నున్నది!

చ. పరిమళ మద్దిరే! సొగసు ♦ బాగు! మృదుత్వ మయారె! రంగువ
హ్వారె! యిది మెచ్చఁగాఁదగిన ♦ వారలు లే రిది నాదుప్రేయసీ
కర మలరింపఁ జేసెడిది ♦ కావున నాపెకు దీని నిచ్చి య
బ్బురపడఁ జేతు; నిట్టి సుమ ♦ ముఁ వృథగా నొనరింపఁ జెల్లునే? 11

(అనుచుఁ బ్రవేశించి యంతఃపురమువంకఁ జూచి) ఓహో నా పట్టపుదేవి గ్రంథావలోకన తత్పరయై కనవచ్చుచున్నదే! మంచిది. మంచిది. విద్యాధనము సకలార్థదాయకము కదా.

సీ. పొత్తంబులందలి ♦ పూర్వవృత్తాంతముల్
దెలియంగ నీ విద్య ♦ దివ్యదృష్టి
శాస్త్రగుప్తంబులౌ ♦ సర్వమర్మంబుల
నరయంగ నీవిద్య ♦ యంజనంబు
సార విహీన సం ♦ సార మహాంబుధి
దాఁటంగ నీవిద్య ♦ దండి తరణి
పరలోక సామ్రాజ్య ♦ పట్టాభిషేక సం
ప్రాప్తికి నీవిద్య ♦ పట్టుగొమ్మ
గీ. విద్య విజ్ఞానభూజంపు ♦ బీజ మరయ
విద్యయే బ్రహ్మరూపంబు ♦ విమలమూర్తి
యిట్టి విద్యామహత్వంబు ♦ నెఱుఁగ కున్నఁ
గాల మక్కట వ్యర్థమై ♦ కడచుఁ గాదె? 12

ఇప్పు డీమె యేమిచదువుచుండెనో యాలకించెద. (అని వినుచున్నాఁడు).

సంధ్యా—మత్తకోకిల. పూర్వీకల్యాణి- త్రిపుటతాళము. త్రిశ్రజాతి

పంచభూతవికారమైన ప్ర ♦ పంచముం గడఁ ద్రోయుచుం
జంచలత్వము వీడి సద్గురు ♦ సన్నిధిం మదిఁ జేర్చి, తా
నెంచ శక్యము కాని యా జగ ♦ దీశు దివ్య సు తేజముం
గాంచి భక్తిని మ్రొక్కి పొంగఁగఁ ♦ గల్గు నాతఁడె ధన్యుఁడౌ. 13

రక్షా—ఔరా! దేవి మంచివిషయమునే చదువుచున్నదే!

చ. బడిబడి వాడ వాడలకుఁ ♦ బాఱుచు, నెల్లగ వాదులాటలం
సుడివడఁ జేసి, యింట బలు ♦ పోరులు పెట్టె, తమకాలముం వృథా
గడపఁగఁ జూచు దుష్ట కలి ♦ కాలపు మానినులట్లు గాక, తాఁ
గడువడి జ్ఞానదంబులగు ♦ గ్రంథములం బఠియించు నెప్పుడుం. 14

చెంత కేగుట కిదియే యుత్తమసమయము. (అని చెంత కేగి కూరుచుండి
ప్రాణనాయికా! యీ కుసుమం బెంతగఁ బరిమళించుచున్నది చూడుము.(అని
యిచ్చుచున్నాఁడు.)

సంధ్యా—నిక్కము నాథా! మిక్కిలిగఁ బరిమళించుచున్నది. మహానందదాయకంబుగ
నుండినది. ఇట్టి దానిని దేవర యనుగ్రహించుటచేత నేను ధన్యరాల నయితి.

రక్షా—ఇది యెల్లప్పు డిట్టులే యుండిన మేలగు నని తోఁచెడిని. కాని మఱికొంత
సేపటికి వాడిపోవునుగదా.

సంధ్యా—ఈ పుష్పమే యననేల? ఐహికానందము లెల్ల నిట్టివియేకదా.

రక్షా—సత్యము. సత్యము. చక్కఁగాఁ జెప్పితివి. మనోహారిణీ! నీ విప్పు డేమో
చదువుచుంటివి?

సంధ్యా—చిత్తము. ఒంటిగనున్న సమయమగుటచేత కాలమును వ్యర్థపుచ్చనేల
యని పుస్తకమును జూచుకొనుచుంటిని.

రక్షా—అది యేమి గ్రంథము?

సంధ్యా—ధర్మబోధిని.

రక్షా—ఔరా! ధర్మబోధినిం జదువుచుంటివా? దానిలో నీ విప్పుడు చదువుచుండిన
భాగమును గొంచెము చదువుము.

సంధ్యా—చిత్తము ఆలాగే చదివెదను.

ఉ. ఎవ్వని చిత్తవృత్తి భువ ♦ నైక పరాత్పరుఁ జేరి చొక్కునో
యెవ్వని పల్కు లెప్డుఁ బర ♦ మేశు చరిత్రల వెల్లికొల్పునో
యెవ్వని సేఁత లెల్ల జగ ♦ దీశున కర్పణమౌచు నొప్పునో
యవ్విమలాత్ముఁడా సరసుఁ ♦ డా కృతకృత్యుఁడె ధన్యుఁడెన్నఁగన్.

రుక్మా—ప్రాణనాయికా! మఱికొంచెము చదువుము.

సంధ్యా—చిత్తము.

చ. పుడమి జనింప నేమి? బహు ♦ భోగము లందుచుఁ బొంగ నేమి? తా
నడుగటు వెట్టకుండఁగ మ ♦ హాధనధాన్యము లుండ నేమి? యం
ధుఁడుగొనుదివ్వెగన్ మఱియు ♦ ధూళినిఁబోసినయాజ్యమున్గటా
యడవినిగాయు వెన్నెలయు ♦ నౌజుమి చిత్తవిశుద్ధి లేనిచోన్. 16

రుక్మా—మనోహారిణీ! ఈపద్యములు రెండును నామనంబునం దొక్క పరితాపంబును గలిగించుచున్నవి.

సంధ్యా—పరితాపమేల నాథా!

రుక్మా—"మానవుఁడు మనోవాక్కాయములచేత నా పరాత్పరు సేవింపుచుఁ బరిశుద్ధచిత్తుఁడై యుండవలయు" నని యీ పద్యములు బోధించుచున్నవి. కాని

క. ఉదయాద్యస్తమయాంతము
ముదమున మనచేయు కార్య ♦ ములవెల్లను సం
పదల గృహారామాదుల
నధికముగాఁ గూర్చుటందె ♦ యరుగుచునుండెన్. 17

ఆ. సతియుఁ, బతియు, సుతులు ♦ సకల జనంబులు
దేహబంధు లంచుఁ ♦ దెలియ లేక
వారి ప్రేమ లందుఁ ♦ బడి పొరలుటతోనె
కాల మెల్ల వృథగఁ ♦ గడచు చుండె. 18

కాని యీ శరీరాంతంబున మన కెట్టిగతి కలుగఁగలదో, అట్టి గతియందు

మనకు కలయున దెద్దేని యిచట సంపాదింపఁదగి యుండెనేమో అను సంగతిని గూర్చి విచారింపమైతిమి కదా.

సంధ్యా—అవును! ఈ విషయంబు నామనంబునందును మిక్కిలిగాఁ బరితాపంబును గలిగించుచున్నది. పరేచ్ఛాప్రారబ్ధవశంబున దేవర సమ్ముఖంబున కప్పుడప్పుడరుదెంచుచుండు శుక శౌనక వశిష్ఠ వాలఖిల్యాది తపోధనులవలన నీ పరితాప నివృత్తి కాఁదగి యున్నది.

రుక్మా—అవునవును. ఈశ్వరా! దయామయా! మా కట్టి తరుణంబు నెప్పటికి లభింపఁ జేసెదవో కదా.

ఉత్సాహ. దీనపోషకా! కృపాబ్ధి! ♦ దివ్యలోక నాయకా!
[5] మానవాధినాథవంద్య! ♦ మానిలోకపాలకా!
పూని నీదు భక్తజనుల ♦ పొందు మాకొసంగి, మా
మానసంబు లెప్డు నిన్ను ♦ మఱవకుండఁ జేయుమా. 19

(సేవకుఁడు ప్రవేశించి నమస్కరించుచు)

సేవ—దేవా! నీకు జయమగుఁగాక.

రుక్మా—ఏమిరా సమాచారము?

సేవ—అయ్యా! శుకయోగీంద్రులు వచ్చియున్నారండి.

రుక్మా—వచ్చియుండిరా! (తనలో) ఔరా నేఁడుకదా సుదినము! (ప్రకాశముగా) సేవకా! వారలను శీఘ్రముగా లోపలకుఁ దోడుకొని రమ్ము.

సంధ్యా—మునీంద్రు లరుదెంచుచుండిరి. కాన సంకల్పసిద్ధులగు దేవరవారి యభీష్ట సిద్ధి యిప్పుడే కాఁగలదు.

గీ. తాఁ దలంచుట యొక్కటి ♦ దైవగతిని
దారసిల్లుట యొకటి యౌ ♦ ధరణి నరయఁ;
దాను దైవంబు నొకటిగఁ ♦ దలఁచు చుంట
తొలుత నోఁచిన సువ్రత ♦ ఫలము కాదె? 20

రుక్మా—ప్రాణేశ్వరీ! చక్కఁగాఁ బల్కితివి. నీవు “సువ్రతఫలము” అనుటచేత నొక్కసువ్రత మాచరింపవలయునని బహుకాలమునుండి నా హృదయమందుఁగల

కోరిక యిప్పుడు జ్ఞప్తికివచ్చుచున్నది.

సంధ్యా—అట్లొనర్చుట మహాభాగ్యము కదా.

(శుకమహర్షి నారాయణస్మరణ సేయుచుఁ బ్రవేశించుచున్నాఁడు. [6])

రుక్మాం—శుకమునివరా! నమస్కరించుచున్నాఁడ.

సంధ్యా—మునిచంద్రమా నమస్కారము.

శుక—మీకు శుభమగుఁ గాక.

రుక్మాం—మునీంద్రా! ఈ యుచితాసనంబునం గూర్చుండుఁడు.

గీ. అటవి నివసించి, మది సదా ♦ హరి భజించి,
కాయ గసురులు తిని, ప్రొద్దుఁ ♦ గడపు చుండు
తారు మముఁ జేరు టెల్ల ద ♦ యారసమునఁ
బావనులఁ జేయుటకె కాదె ♦ భవ్య చరిత? 21

తమ పాదరజంబు సోకినమాత్రంబున నా గృహంబెల్లఁ బావనమయ్యె. తమ దర్శనం బబ్బినమాత్రంబున మజ్ఞానంబెల్ల నిష్కలుష్యంబయ్యె. ఇది యంతయు మహాభాగ్యంబు కదా.

శుక—ఓహో రాజేంద్రా! ప్రీతిపూర్వకమైన నీ వచనామృతము నాకెంతయు శ్రోత్రపేయంబుగా నున్నయది. నీ వచోధోరణి చూడ భక్తిరసావేశసూచకంబుగా నున్నయది. మిక్కిలి యానందించితి.

ఉ. రక్తిఁ గలట్టి పాట శ్రుతి ♦ రాగ లయాది నిబద్ధమైననున్
భక్తుఁడు పాడఁ జిత్త మల ♦ భావమునందె రమించు నట్లుగన్
వ్యక్తుఁడు దార పుత్ర హిత ♦ పాశనిబద్ధ మనస్కుఁడయ్యు బల్
యుక్తిని జిత్త మీశ్వర గు ♦ ణోన్ముఖమౌగతిఁ జేయఁగా నగున్.

ఇట్టివాఁ డెల్లప్పుడు నానందమయుండై కోటిభానుసమతేజుండై ప్రకాశించుచుండును.

రుక్మాం—చిత్తము సంయమివరా. అందునకు సందేహమా? అట్టి పురుషుఁడు కలిగియుండు శాంత శమ దమాది వృత్తుల వర్ణింప నలవియగునా?

చ. సతి నెడఁబాయఁగల్గినను, ♦ సర్వసుఖంబుల రోయఁగల్గినన్,
సుతుని వధింపఁగల్గినను, ♦ శూన్యగృహంబుల నుండనైనఁ, దా
నతులితభక్తి నీశ్వర స ♦ మర్పిత శుద్ధమనస్కుఁ డైనచో
నతనికిఁ జీమకుట్టినటు ♦ లైన స్ఫురింప వివెల్ల నెన్నఁడున్. 23

శుక—ఇట్టిభక్తియే ముక్తికి సాధనంబని చెప్పఁదగియున్నది. మఱియొకటి వినుము. ఎట్టి భక్తునకైన ధర్మాచరణం బత్యంతావశ్యకంబు. ధర్మవర్తనుండగు ప్రభువునకు సమస్త సౌఖ్యంబులు కరతలామలకంబులై యుండును. రాజచంద్రమా! ఇంతయేల?

గీ. హరియు, సిరియును, శంకరుఁ ♦ డాదిశక్తి
విధియు, వాణియు, మఱికల్గు ♦ విబుధవరులు
ధర్మపరులౌట, నద్దానిఁ ♦ దలఁగవేని
వార లెల్లరు నీవంక ♦ వారె, నిజము. 24

అయినను ధర్మవర్తనుండై యుండవలయునన్న నాటంకంబులు పెక్కులు కలవు.

గీ. ధరణి నుద్యోగ యౌవన ♦ ధన మదముల
నొక్కటొకటి దుష్కృతములఁ ♦ బెక్కు గతుల
నొనర జేయింపఁ దగియుండ ♦ నొక్కచోట
నిట్టి మూఁడును గుమిగూడ ♦ నింకఁ గలదె? 25

రాజేంద్రా! ఇప్పుడు నీయందట్టి యౌవనోద్యోగధనావస్థలు మూఁడునుం జేరియున్నను వాని దోషంబులను మాత్రము చేరనీయక మహా సత్వగుణప్రధానుండవును, భక్తజనస్తవనీయచరిత్రుండవును, మాబోటి యోగిజనులకు విశ్వాసపాత్రుండవునై యొప్పియున్నవాఁడవు. నీవింక మావలన ధర్మసూక్ష్మంబు లెవ్వియైన వినవలతువేని యడుగుము. ఎఱింగించెద. నీవంటి సన్మార్గవర్తనున కెఱింగించుటచేత వాని నెల్ల సార్థకంబులుగఁ జేయఁ గుతూహలం బయ్యెడిని. కాన నీ వింక సంశయింపక యడుగుము.

రుక్మా—ఓహో మునీంద్రా! మీ వాక్యంబు లన్నియు మాయెడ మీకుఁ గల వాత్సల్యసూచకంబులు కదా. బహుకాలంబునుండి నా మనంబున నొక్క కోర్కి కలదు. అదెద్దియంటిరేని యెఱింగింతు.

గీ. రాజయోగంబునం దెల్ల ♦ రకును నెపుడు
నియమ మొక్కటి ముఖ్యమై ♦ నెగడు కతన
నందులకు నొక్కసువ్రత ♦ మాచరింప
వలయు నని యేను సతతంబుఁ ♦ దలఁచు చుందు. 26

తాము సర్వజ్ఞులరు. శ్రుతి స్మృతి పురాణంబులనెల్లఁ జక్కఁగాఁ బరికించి శ్రీవిష్ణు ప్రీతికరంబగు నొక్క వ్రతరాజంబు నా కనుగ్రహించి ధన్యుం జేయ వేఁడెద. ఇదియే మీవలన నే నెఱుంగఁ దలఁచిన ధర్మసూక్ష్మంబు.

శుక — రాజేంద్రా! నీవు కోరినదానికి మిక్కిలి యానందించితి. నీ మనం బెల్లప్పుడును శ్రీ విష్ణు సేవా పరతంత్రమై యున్నట్లు కనవచ్చుచున్నది.

గీ. శ్వపచుఁడైనను హరిభక్తి ♦ సహితుఁ డైన
నృపుని కన్నను మిన్నయై ♦ నెగడు చుండు;
రాజరాజైన హరిభక్తి ♦ రహితుఁ డైన
నల శ్వపచుకన్న గడు నధ ♦ మాధముండు. 27

అని పెద్దలు చెప్పుదురు. కావున నీవు విష్ణువ్రతాచరణాసక్తుండ వగుట యెంతయు శ్లాఘనీయంబ. అయినను శ్రుతి స్మృతి పురాణంబు లెల్లఁ బరికించి వక్కాణింపుమంటివి. ఈ వ్రతంబునకై యంత వెదుకఁ బనిలేదు.

క. అరచేతి ఫలము రీతిని
వరలుచును త్రిలోకముల శు ♦ భప్రదమగు నా
హరివాసర వ్రతంబన
ధర వ్రతములనెల్ల శ్రేష్ఠ ♦ తమము నృపాలా! 28

ఇట్టి యేకాదశీవ్రతంబు నీ వాచరింపఁదగును. ఇది విష్ణువ్రతంబులలో నెల్ల శ్రేష్ఠంబు. సకలాభీష్ట ప్రదంబు. సమస్తకలుష నాశంబు.

చ. గొనములయందుశాంతమును, ♦ గోటిసువాక్యములందుసూనృతం
బనువగు ధర్మసూక్ష్మముల ♦ యందునహింసయు, నెల్లమోక్షసా
ధనములయందు భక్తియు, ము ♦ దంబిడురీతిని, సద్వ్రతంబులన్
గనుఁగొన శ్రేష్ఠమయ్యె నన ♦ ఘా! హరివాసర సువ్రతం బిలన్.

ఈ వ్రతంబు నీ కవశ్యాచరణీయంబు. కావున నెఱింగించితి.

సంధ్యా—మునివరా! ఏమి మీ సౌజన్యంబు. ఏమి మీ వాఙ్మాధుర్యంబు! ఏమి మీ కరుణా తరంగి తాంతరంగంబు! మా ప్రాకృతఫలంబెల్ల నొక్క సారిగ ఫలించెనా యనునట్లు నేఁటిదినంబునఁ దా మిచ్చటికి విచ్చేసి సర్వశుభదాయకంబగు నీ వ్రతశ్రేష్ఠంబు మా కుపదేశించితిరి. మా జన్మంబుల ధన్యత నొందించితిరి. మా భాగ్యం బేమనవచ్చు! కావున నే

శా. ఈ విశ్వంబునుగ్రమ్ము చీఁకటుల నెం ♦ తే భానుఁ డత్యుగ్రతన్
బోవన్ ద్రోచి ముదంబు నించుకరణిం ♦ బో, సాధుసాంగత్యమున్
ఠీవిన్ బాపవినాశ హేతువగు టిం ♦ తే కాక ముమ్మాటికిన్
జీవన్ముక్తిదమంచు నెంచి విబుధుల్ ♦ చేమోస్తు రత్యంతమున్. 30

అయిన మహానుభావా! ఈ వ్రతం బెట్లాచరింపవలయునో, దీనికి వలయు విధులెవ్వియో సానుగ్రహులరై యెఱింగించి మమ్ముఁ గృతార్థులం జేయుఁడు.

శుక—ఎఱిఁగింతు. సావధానచిత్తులరై యాలకింపుఁడు.

గీ. ఒనర దశమిని నొక్కప్రొ ♦ ద్దుండిఁ మఱియు
భక్తి నేకాదశిని నుప ♦ వాస ముండి,
నాఁటి రేయెల్ల జాగర ♦ ణంబు సేయ
వలయు హరిహరభజనల ♦ వలన భూప! 31

గీ. వేగ మఱునాఁడు ద్వాదశీ ♦ వేళ యందు
నరసి దధి ఘృత భక్ష్య భో ♦ జ్యములతోడ
షడ్రసోపేతముగ ద్విజ ♦ సంతతులకు
భోజనం బిడవలయును ♦ భూవరేణ్య! 32

మఱియు దక్షిణతాంబూలంబు లొసంగి వారలఁ దృప్తులంజేసి యనుప వలయు. పిమ్మటఁదాను బంధుమిత్రాదులఁగూడి యామిషాది క్షుద్రశాకవర్జితంబుగా ద్వాదశీపారణంబుఁజేసి యాదినంబంతయు నిదురమాని యుండవలయు. ఇందు మఱియొక్క ధర్మసూక్ష్మంబు కలదు. అదియు నీ వెఱుంగవలయు.

చ. ఘనులనుదన్ను టద్దియు సు ♦ కార్యమెకాని, కృశించి యార్తులై
కనులు పదాలు కర్ణములు ♦ కల్గమి నొక్కెడఁ గూరుచుండి, నా
యన!దొర! బాబు!తండ్రి! యని ♦ యార్చునశక్తుల నెవ్వఁడోర్మి దా
పునఁ గని బ్రోవఁడో యతని ♦ పున్నె ములేటికి? పూజలేటికిన్. 33

క. మాకే సుఖమును సొంపును
మాకే ధనధాన్యవృద్ధి ♦ మాకే ఘనముల్
మాకు ధనము మీకు ఋణము
మా కడుపే స్వర్గమనుట ♦ మహిఁ దగ వగునే?. 34

చ. పరమకృపామయుం డగుచు ♦ బాటనుబోవు నశక్తుఁజూచి, తా
నరమరలేక డాయఁజని, ♦ యక్కట మిత్రమ! అయ్యొ పేద! దు
ష్కర పరితాప మగ్నతను ♦ గాసిలి తంచును నాదరించు నా
సరసుని కాలిగోరునకుఁ ♦ జాలుదురే పదివేల దాంభికుల్?35

కావున నట్టు లాతురులగువారి యార్తిఁ దీర్చుట పరమధర్మ మని యెఱింగి
వారలఁ దనుపవలయు. కాని కొందఱు మూఢులు

ఉ. ఆఁకట సోలువారి కడు ♦ హైనను గాల్చి, ధనంబుఁ గూర్చి, య
స్తోక మనీషులట్లు కడుఁ ♦ జోద్యముగాఁ బలు ధర్మకార్యముల్
వీఁక నొనర్చుచుందు రిది ♦ వెఱ్ఱియుకాక ముదంబుఁ గూర్చునే?
కాకులఁగొట్టి గ్రద్దల సు ♦ ఖంబుగఁ దన్పినఁ బున్నె మబ్బునే?

కావున నీవు ధనార్జనమందు న్యాయైక రతుండవై యుండవలయు. ఈ
ప్రకారంబుగ నీవు వ్రతం బాచరింపఁదగును.

గీ. ఇదియె సద్వ్రోత్తమంబగు ♦ విధము సుమ్ము
కలుగఁజన దిందు లోప మే ♦ కాలమునను;
గలిగినను మఱి తెలియు మే ♦ కాదసులను
జనదు స్వేచ్ఛావిహారంబు ♦ సలుప నెపుడు! 37

ఈ ప్రకారంబుగ వ్రతంబొనర్చిన మీకు శ్రేయంబగును. అట్లొనర్పుఁడు.

రుక్మా—చిత్తము. తాపసోత్తమా! తమ వాక్యంబులెల్ల వేదవాక్యంబులుగ శిరసున వహించి యట్లే యొనరింతుము.

శుక—కాని రాజకులావతంసమా! ఒక్క విశేషంబు కలదు.

ఉ. న్యాయపథానువర్తుల మ ♦ నఃపరిశోధన సేయ, నీశ్వరుం
డే యిడుమల్ ఘటించి, యల ♦యించి, కలంపఁ దలంచుఁజుమ్మువా
ధ్యాయుఁడు శిష్యులక్ష శతవి ♦ ధమ్ముల శోధనఁజేసి కాదె, వి
ద్యాయుతు నేరి పండిత ప ♦ దమ్మున నిల్పును, మాన వేశ్వరా?

భక్తులగువారలు తా మొనరించు సుకృతమ్ముల కంతరాయమ్ములు కల్గునప్పుడవి యెల్ల నీశ్వర ప్రేరితంబులకా నెఱింగి, నిశ్చలచిత్తులై, స్వధర్మానుష్ఠాననిష్ఠాగరిష్ఠులై యుండవలయు. కాని తత్తర మొందఁ జనదు.

రుక్మా—అట్టిసమయములందెల్ల దేవరవారి యాశీర్వచనబలమే మాకుఁదోడైయుండుఁ.

శుక—మంచిది. నాకుఁ దడవగుచున్నది. శిష్యులు నాకై వేచియుందురు. నేనరిగెద.

రుక్మా—, సంధ్యా— } చిత్తము మునికులచంద్రమా! నమస్కారము.
(అని మ్రొక్కుచున్నారు.)

శుక—సుఖీభవ. సుఖీభవ. నారాయణ. (అనుచు వెళ్ళుచున్నాఁడు.) [7]

రుక్మా—ప్రాణేశ్వరీ! ఈ మునీంద్రుని యమృతతుల్య వచనంబులు నీవును వినుచుంటివి కదా.

గీ. ఇట్టి స్తవనీయమగు వ్రత ♦ మే నొనర్చి
యొక్కఁడన దాని ఫలమును ♦ నొందుకన్న
సకలజనములు భక్తిచే ♦ సలిపి దీన
మేలుఁ గనఁజేయు టది మఱి ♦ మేలుకాదె? 39

ఇందుకు నీ యభిప్రాయం బెఱింగింపుము.

సంధ్యా—నాథా! ఈ వ్రతంబు భక్తిరస ప్రధానంబై భగవన్నామ స్మరణంబును అన్నదానంబులను విశేషింపఁజేయ సమర్థమై కన్పట్టుచున్నది.

క. ఈ వ్రతరాజము మనపురిఁ
బావన చేతస్కులైన ♦ ప్రజ లెల్లరచే
ఠీవి నొనరింపఁజేసిన
దేవర యిహపరసుఖాబ్ధి ♦ దేలుట యరుదే? 40

కావున న ట్లొనరింపఁ బురజనులఁ బురికొల్పుట యవశ్యకర్తవ్యంబని నాకుఁ దోఁచుచున్నది.

రక్షా—అట్లే యొనర్చెదను. నాకు సంధ్యావందనకాలమగుచున్నది. పోయివచ్చెద.

సంధ్యా—చిత్తము. నేనును బోయివచ్చెద. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయరంగము. పురవీధి.

(ప్రవేశము-జాంఘికుఁడు.)

(చాటింపు) ఇదిగో యినండి, యినండి. రాజుగారి శెలవయ్యింది. రేపు యాకాశెంట. అందరూ యాకాశి రతం శెయ్యాలంట. యీరేత్రి బోజినం శేయిరాదు. రేపంతా వుపాసం వుండాల. అంటే వణ్ణం తినరాదు. రేపంతా దేవుడి సంగీతకం చేసుకోవాల. రేపు రేత్తిరి నిద్దర పోరా దోహో యి.

ఎల్లుండి దోదశ్శంట. ఆయాల పొద్దున్నే భ్యామ్మర్లకి బాగా బోంచెయిబెట్టి ఆనిక పారాయిణం చేసుకోవాల. అంటే వణ్ణంతినాల. ఆయాళ్ళ పగలంతా నిద్దరపోరా దోహో యి.

మఱిగల్తె రేపు పిల్లలికి పాలియిరాదు. ముశిలోల్లకి వణ్ణంపెట్టరాదు. గొడ్లకి మ్యాతెయిరాదు. దూడల్ని పాల కిడవరాదు. యిట్టా శేస్తే మీకు మేలవుతుందంట. యీ పఖారంగా అంతా వుపాసం సెయ్యాలని యిట్టా రాజుగారి శెలవయ్యిం దోహో యి.

మరిన్నీ రేపు రాజుగారింటికాడ యాకాశిపూజశాస్తారు. గనక యిష్టంవున్న వాళ్ళు సూడ్డానికి రావాలిసిం దోహో యి. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

( ఇది ప్రథమాంకము. )




శ్రీ

# రుక్మాంగదనాటకము.

## ద్వితీయాంకము.

రంగము-పురవీధి.

(తాంబూలము వేసికొనుచు నొయ్యారము వేంకట్రావుగారును, ఆయాసముతో బొజ్జనిమురుకొనుచుఁ బప్పు రామావధానులును ఒకరికొకరు ఎదురుగాఁ బ్రవేశించుచున్నారు.)

రామా—ఓహో! ఒయ్యారము వేంకట్రావుగారా? వ్రతభోజనశాలనుండియేనా రావడము?

వేంక—అవును రామావధానులుగారూ. ఈ దినమందు దొరగారిలోపల వ్రతమే బాగుగ నుండినదనుకొంటే వ్రతమునకంటె భోజనము మఱింత బాగుగనుండినది చూచినారా?

రామా—(ఆయాసముతో) అవును నాయనా. ఆ భోజనమే నా కొంప తీసినది.

వేంక—అదేమయ్యా అలాగునంటావు? భోజన మెక్కువైనదా యేమి? (అని మోమువంక పరీక్షగాఁ జూచి) ఏమో ఆయాసముగా మాట్లాడుచున్నావే?

రామా—ఆయాసమేమిటినాయనా. ఊపిరి ఆడడము లేదు. అయ్యో! అయ్యో!

క. ఆ పప్పును బరమాన్నము
లా పూర్ణపుబూరెగారె ♦ లన్నిగుఁ దినఁగన్
నా పొట్ట చాలదాయెను;
ఈ పొట్టకుఁ దోడికొక్క ♦ పొట్ట కలుగదో?

వేంక—ఈ పొట్ట యుబ్బి బాధపడుచుండి మఱియొక పొట్టకూడా కావలెనంటా వేమయ్యా? అంతగా నాయాసముగా నుంటే తాంబూలము వేసుకో. జీర్ణకారి. కొంచెము సేపటికే తేలికగా నుంటుంది.

రామా—అయ్యో! తాంబూలము పట్టేపాటి సందుంటే అక్కడ మఱియొడు గారెముక్కలనే యిరికించనఁటయ్యా?

వేంక—అంత యెక్కువగాఁ బుచ్చుకొన్నావటయ్యా?

రామా—ఎక్కువేమిటి! గొంతులో వ్రేలు పెట్టితే అందుచున్నవయ్యా గారెముక్కలు!

వేంక—దొరగారిసొమ్ము తేరగా తినఁగానే సరియా? హరించుకొనవద్దూ?

రామా—చూస్తే వదిలిపెట్టబుద్ధియవుతుందీ? గారెముక్కలను విఱిచేపాటి యవకాశము లేక నేతిలోముంచుకొని, గుటుక్కుగుటుక్కని మ్రింగుచూవుంటే, గుభాలున క్షీరాన్నపుగుండిగ వచ్చినదయ్యా! ఇంకా నాలుగుగారెముక్కలు విస్తరిలోనుండఁగా వాని నవతలకుఁ ద్రోసి క్షీరాన్నముమీఁదఁ బడినాను. అది రుచిగానుండడముచేత—(అని యేమో చెప్ప బోవుచుండఁగా)

వేంక—అవునవును. క్షీరాన్నము రుచిగానున్నది.

రామా—రుచియేమిటయ్యా! స్వర్గమునకు బెత్తె డెడముగా నున్నది. నా మాట కడ్డము రాకు. ఆలాగు రుచిగానుండడముచేత మజ్జిగైనా మానివేసుకుందామని యా క్షీరాన్నమే మళ్ళీవడ్డించుకొని, పూర్తిగా భోజనముచేసినాను. అంతటితో నూరకుంటే బాగుగానే యుండేది.

వేంక—ఊరకుండక మళ్ళీయేమిచేసినావు?

రామా—నా ప్రాణానకు శత్రువులాగున మీఁగడ ముద్దలతోఁ గూడ గడ్డపెరుఁగు వచ్చిపడినదయ్యా! (అని ఆయాసముతోఁ గూలఁబడుచున్నాఁడు.)

వేంక—అదుగో! అదే నీ ప్రాణము తీసినది.

రామా—ఆ పెరుఁగును జూడఁగానే నా యొడలు పెటేఁగినది. మనసు కరిఁగినది. వివేకము తలఁగినది. అంతట నేమియుఁ బోచక యొక గొప్ప పని చేసినాను.

వేంక—ఏమి పని?

రామా—ఒళ్ళు ఆటూయిటూ సాఁగదీసుకొని యిద్దుముజస్తాకు దించినట్లు ఒక్కసారి యెగిరి కూలఁబడినాను. దీనిచేత లోపల గొంచెము సందిచ్చినట్లు కనబడినది. అప్పుడొక్కవాయి పెరుఁగు అన్నము కలిపి నాలుగు ముద్దలుగాఁ జేసి పందికొక్కుకన్నము మెత్తినట్లు గొంతులోఁ బడవేసినాను.

వేంక—సమర్థుఁడవుగాన నంత పని చేసినావు. కనుకనే సార్థకమయినది. అయితే మాత్రమేమితే? ఏకులు పెట్టితే బుట్టలు చిరుగుతవా?

రామా—అంతటితో నూరకున్నను కొంత బాగుగనే యుండునయ్యా.

వేంక—ఊరకుండక మళ్ళీ యేమిచేసినావయ్యా?

రామా—మొదటఁ బరిహరించితినంటినే మావచక్రములు, అంటే తెలుసునా గాఁగ ముక్కలు, అప్పుడు మళ్ళీ కండ్లకగుపించినవి. వానిని వదలిపెట్టుటకు మనసొప్పక, ఈగారెలు రేపు మళ్ళీ దొరకుతవాఅని, దగ్గర నేయి లేకపోయినందున పెరుగులోనే ముంచి, అవికూడా గొంతులోఁ బడవేసినాను.

వేంక—ఓయి అఘాయిత్యుఁడా! ఎంతపని చేసినావయ్యా!

రామా—ఆపైన గుక్కెఁడు నీళ్ళు త్రాగవలెనంటే సందులేక మానివేసినాను. ప్రాణము పోతూవున్నది. ఏమిచేసేది? అయ్యో! అయ్యో! ఓ యబ్బో!

అయితే నాయనా! మా పేరిగాఁడు కుఱ్ఱకుంక. ఎక్కడఁ గూర్చున్నాఁడో నాకుఁ గనబడ లేదు. వాఁడికి ముఖభిడియము. తిన్నగా భోజనము చేసినాఁడో లేదో. నీ కెక్కడనయినా కనబడినాఁడా బాబూ?

వేంక—ఇప్పుడే ప్రక్కవీధిలోఁ గనబడినాఁడు. భోజనము చేసి వస్తూవున్నాఁడు. (అని) పేరయ్యా! పేరయ్యా! (అని పిలిచి) అరుగరుగో! నీ మనమఁడు పేరిగాఁడున్ను, నీ మేనల్లుఁడు సుబ్బిగాఁడున్ను కూడా వచ్చుచున్నారు.

(పేరయ్య, సుబ్బయ్య ప్రవేశించుచున్నారు.)

సుబ్బ—ఏమి మామయ్యా, యిక్కడ కూర్చున్నావు?

రామా—నాయనా, సుబ్బిగా! పేరిగాఁ డేఁడిరా?

పేర—తాతయ్యా! యిక్కడనే యున్నాను.

రామా—సంతర్పణలోకివచ్చి తిన్నగా భోజనముచేసినావు నాయనా?

సుబ్బ—భోజనముదగ్గిర వెనుకఁదీస్తామా మామయ్యా?

రామా—ఏమోలే; కుఱ్ఱకుంకలు గనుక వడ్డన తిన్నగా అందినదో లేదో అని.

సుబ్బ—మేము కుఱ్ఱవాళ్ళమైతే మాత్రము? నేను నీ మేనల్లుఁడనని యెవ్వరెఱుఁగరా? వీఁడు నీ మనమఁడని యెఱుఁగరా? వడ్డించవచ్చే ప్రతివాఁడున్ను నా దగ్గిరకు రాఁగానే "నీవు పప్పు రామావధానుల మేనల్లుఁడవు కావఁటయ్యా?" అని యంటూనే యున్నాఁడు.

రామా—ఎట్లాగైనా నీకు భయంలేదుగాని పేరిగాఁడు నోరులేనివాఁడురా.

పేర—తాతయ్యా! నేనున్ను, సుబ్బిగాఁడున్ను ఒక్కచోటనే కూరుచున్నాము. బాగానే భోజనము చేసినానులే.

రామా—ఆఁ. అయితే సంతోషము. సంతోషము. అంతే నాకుఁ గావలిసినది.

వేంక—ఎంతసేపైన భోజనవిశేషములేనా? వ్రతవిశేషము లేమైన నున్నవా? రామావధానులుగారూ! వ్రత ప్రదేశములో మీ రేమి కనిపెట్టినారో చెప్పండి.

రామా—నేనా? అక్కడఁ గూర్చుండి వ్రతమందిరమువైపుచూడఁగా, ఒకచోటఁ బురాణకాలక్షేపము, ఒకచోట గీతాపారాయణము, ఒకచోటఁబూజావిధానము మఱియొకచోట భజన మొదలైనవన్నియు గోలగాఁ గనబడితే యేమీ తోఁచక యిటుతిరిగి వంటశాలలోనికిఁ బోవుచున్న పెరుఁగు కావళ్ళు, నేతి కావళ్ళు లెక్కపెట్టుచుఁ గూరుచున్నాను.

వేంక—మంచిపనిచేసినావు! సుబ్బయ్యశాస్త్రీ! నీ వేమి చూచినావోయి?

సుబ్బ—పురాణము చదివే చోటఁ గూర్చుండి ధర్మరాజ రాజసూయ యాగకథను విన్నాను. వ్యాఖ్యాతరాగయుక్తముగ బోధించుటచే మహానందజనకముగనున్నది

వేంక—పేరయ్యా! నీవేమిచూచినావోయి?

పేర—నేనా? ప్రభువుగారున్ను, దేవిగారున్ను, భక్తితత్పరులై పూజ సేయుచుండుట, తక్కినవార లందఱు జపహోమ గీత వాద్య నృత్యాదులచేత నానందించుచుండుట చూడఁగా నిది శుకశౌనకాదుల సభవలెఁ గనుపించినది. నేనచ్చటనే కూరుచుండి యానందముగఁ బ్రొద్దుఁ గడపినాను.

వేంక—ఇదంతయు సరేకాని సంగీతసభయొద్దకు మీ గన్నాయను గారై తిరికదా. ఆ పాట యెంత బాగుగ నున్నది!

సీ. శృతిలయ రాగ ప ♦ ద్ధతులెల్ల శోధించి
పటుత రానుభవ సం ♦ పత్తిఁ గల్గి
గమక భేదంబుల ♦ గ్రామమర్మంబుల
మూర్ఛనాదులను స ♦ మూల మెఱిఁగి
వాది వివాది సం ♦ వాద్యనువాది క
ల్పనలఁ గలట్టి సం ♦ బంధ మరసి
కమనీయ రూపంబు ♦ కంఠ మాధుర్యంబు
భావార్థ బోధక ♦ ప్రౌఢిఁ గాంచి

గీ. యఖిల జనములు మెచ్చి హా ♦ హా! యనంగ
మోడు లడ్డపై చిగిరించి ♦ మోసు లెత్త
మించి హరిభక్తి మూర్తిభ ♦ వించినట్లు
గానరస మట్లె వర్షించె ♦ ఘనుఁడౌకండు. 2

ఆతఁడు మన ప్రభువుగారి యాస్థాన విద్వాంసుఁడఁట. మంచి సమర్థుఁడు సుమా. అయినను ఆతఁ డెంతటి సమర్థుఁడైన నేమి? కొదువ సౌకర్యము లన్నియుఁ జక్కఁగ లేకయుండిన నాతని యాట యేమి సాగును?

ఆ. తాళ మైన లేక ♦ తంబురయును లేక
జంత్ర వాద్య గాని ♦ జంట లేక
విద్దె నరయఁ గల్గు ♦ వేత్తయు లేకయె
పాడు పాడు నాఁగఁ ♦ బాడు కాదె? 3

ఇన్ని సౌకర్యము లుండినను కమ్మికయగు స్థలము లేకయుండిన వ్యర్థమే సుమా.

ఉ. ఇమ్మహి మ్మానుషంబు సెడ ♦ నిమ్ము; మహాత్ములు నవ్వనిమ్ము; మో
క్షమ్ముఁ దొరంగనిమ్ము; మఱి ♦ సభ్యులు హుల్లులుకొట్టనిమ్ము; మేల్

సౌమ్యగఁబెట్టనిమ్ము; విర ♦ సుండని యెల్లరు దూఱనిమ్ము; ఛీ
కమ్మికలేనిచోట మృదు ♦ గానము కష్టము కష్ట మేరికిన్. 4

మన ప్రభువుగారు మంచి రసజ్ఞులగుటచేత నిట్టి సౌకర్యము లన్నియుఁ జక్కఁగ సమర్పఁబడినవి. కావుననే యచటి గానము సర్వజనరంజకముగ నుండినది.

సుబ్బ—(గర్వముతో) నేను వినిన దంతకంటె రంజకముగ నుండినది.

పేర—(గర్వముతో) నేను చూచినది అన్నిటి కంటె బాగుగనున్నది.

వేంక— ఇప్పుడు ఎవరుచూచినదానిని వారు మెచ్చుకొనుటవలనఁ గార్యమేమి? దీనికంటె ఇప్పుడొకరుచూచినదానిని ముందుయేకాదశినాఁడు మఱియొకరు చూతము. అప్పుడు నిజము తెలియును. ఇప్పటికిఁ బోవుదము రండు.

రామా—ఆ నాఁడు నావంతు నేతికావళ్ళు, పెరుఁగుకావళ్ళు ఎవరుచూస్తారు?

అందఱు—ఆ పని నీవు చేయవలసినదే. మీ యింటిపేరునకును దగియుంటుంది.

రామా—పోనీలే నాయనా! నన్ను కాస్త లేవఁదీయండి; పోదాము.

(లేవఁదీయుచున్నారు.)

వేంక—రామావధానులుగారూ! మీరు బాగా క్రాఁగిన ఉడుకునీళ్లలో నొక గంట సేపు కూర్చుండండి. త్రాగిన నెయ్యి క్షీరాన్నము, మ్రింగిన గారెముక్కలు అన్నీ కరఁగి దేహము కొంచెము తేలికపడుతుంది.

రామా—అలాగే నాయనా. ఇంటికిపోయి యేదోతిప్పలు పడవలెను.

వేంక—తిప్పలు మఱేమియు లేవులే. అట్టిట్టయినను వ్రతదరిశనముఁ జేసితివిగాన యముఁడు మాత్రము నీ జోలికి రాఁజాలఁడు. ఒకవేళ వచ్చినను నీ వాతనితో దెబ్బలాడియైనను స్వస్థానముఁ జేరఁగలవాఁడవే.

రామా—నేను వ్రతదరిశనముచేసినమాత్రముచేతనే యముఁడు నా జోలికి రాఁజాలక పోతే యీవ్రతము చేసెడివారి నందఱు నేమిచేయును?

వేంక—వారి సమీపమునకే రాఁ జాలఁడు. వారందఱు స్వర్గమునకుఁ బోవలసినవారే. ఇఁకను యమలోకము పాడు పడవలసినదే.

రామా—ఆఁ!! ఆలాగా!! ఈ వ్రతమం దంత మాహాత్మ్య మున్నదిగా! (అంతలో కడుపుపట్టుకొని) అబ్బో! అబ్బో? అయాసముగానున్నది బాబో. ఈ బాధ పదరదుకాఁబోలును. ఈ గండముతప్పి బ్రతికితినా నేనుకూడా యీవ్రతము త ప్ప కు ం డా చేస్తాను. ఇఁకను పోవుదము రండి.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది వి ష్కం భ ము.

---

ప్రథమరంగము—యముని సభ.

(యముఁడు, చిత్రగుప్తుఁడు, వక్రదంతుఁడు, దీర్ఘ బాహువును ప్రవేశించుచున్నారు.)

యము—అరే దీర్ఘబాహు వక్రదంతాది కింకరులారా! పాపజనభయంకరులారా! అవిలంఘ్యంబగు మ చ్ఛాసనంబు శిరంబున ధరించి స్వస్వవ్యాపారంబుల నప్రమత్తులరై వర్తింపుచున్న వారలే?

వక్ర—నిఖిలజీవ భయంకరమూర్తీ! దేవరయాజ్ఞల శిరంబున ధరించి, స్వాప్నావస్థయందును నాలాపించుచు, నించుకేనియుఁ దొలంగక మెలంగుచున్న వారము.

యము—మంచిది. అసత్యవాదులం బట్టి, నాల్కలు వ్రక్కలుగఁ జీల్చి, బాధించుచున్న వారలే?

దీర్ఘ—అ స త్య వ చ న వి ష పూ రి తం బు లగు జిహ్వాగ్రమంబుల చండతర కరవాలంబుల ఖండఖండంబులుగఁ జెండి, తత్ఖండంబుల నండజంబులకుఁ బందువుసేయుచున్న వారము దేవా.

యము—సెబాస్! పరధన పర నారీమణులఁ గాంచి చోర జారత్వంబుల ముట్టినవారల గోలుగోలున నేడ్పింపుచు, బాధింపుచున్న వారలే?

వక్ర—పరధనాపహారుల దుస్సహాపూతిగంధ పదార్థ భక్షకులం జే యుచున్నారము. పరనారీపరాయణుల జ్వాజ్వల్యమానా య స్తంభంబుల నాలింగనంబుఁ జేయింపుచున్నారము.

యము—బహుమంచిది. అరే! కింకరులారా! స్వార్థపరులై కూటసా క్ష్యంబులచేఁ బరప్రాణ మాన ధనంబుల కపాయం బొనరించు మహాపాతకుల వలయు తెరంగున దండించుచున్నవార లే?

దీర్ఘ—అట్టి పాతకుల శరీరంబుల రుధిరమాంసపిశునంబులగు శునకం బుల కాహారంబుగ నిడుచుంటిమి దేవా.

యము—మంచిది. చిత్రగుప్తా! ఈ దినంబున మన యాలయంబున కతిథులై వచ్చిన పాపుల నిచటికి రప్పింపుము.

చిత్ర—చిత్తము. ఆలాగే రప్పించెదను. కింకరులారా! నేఁటి పాపుల నొక్క రొక్కరింగా నిటకుఁ దోడ్కొని రండు.

వక్ర—చిత్తము (అని యొకనిని దెచ్చి నిలువఁబెట్టుచున్నాఁడు.)

చిత్ర—దండధరా! ఆలింపుఁడు. ఈ జీవుండు, లోకరక్షకుండగు విరూ పాక్షుండు కలఁడేని ప్రత్యక్షుం డేల కాఁడనియుఁ, గావున లేఁడని యు, నాస్తిక వాదంబులఁ జేయుచు, వేదశాస్త్రంబుల కప్రామా ణ్యంబుఁ గల్పించి, మందమతుల డెందంబులఁ గొందలం బందఁజే యుచు, వారల భక్తిభావంబుల డిందుపఱిచిన నాలి బూతంబు.

యము—ఓరి దుర్మార్గా! దూరీకృతాపవర్గా! ఎంతచేసితివిరా! కింక రులారా! నిస్తులాస్తిక్యభావంబు ధ్వస్తంబు కావించిన యీ దు ర్మార్గుని జిహ్వాధమంబును ప్రచండకీలి కీలాకలాపంబునఁ గాల్చి హింసింపుఁడు. మఱియు నసిపత్ర వనంబున నిరంతర దురంత చింతలం బెట్టుఁడు.

వక్ర—వానిని దూరముగా నీడ్చుకొని పోవుచున్నాఁడు).

దీర్ఘ—(మరియొక పాపినిఁ దెచ్చి నిలువఁబెట్టుచున్నాఁడు.)

చిత్ర—చిత్తము ధర్మస్వరూపా! ఈతండు ధర్మవిచక్షణంబు లేక ప్రతిక్షణంబు కణంబులం గూర్చి, పేర్చి, యతుల ధనాగమంబుచే గర్వించి, స్వపరోపయోగార్థ వ్యయంబును సహింపఁజాలక దాఁచి, యవసాన కాలంబున ధనరాశిత్యాగంబు ప్రాణత్యాగంబునకన్న సంకటంబుగాఁగ దద్ద్రి వ్యక్షాళనోదకపానంబుచే నెట్టకేలకుఁ బ్రాణంబులఁ బాసిన పరమలోభి.

యము—చిత్రగుప్తా! జ్ఞానలేశంబు లేని మానవాధముల చేతం బడిన యర్థంబు ధర్మకార్యాచరణముల సార్థకంబుగాక యెంతగ వ్యర్థం బగుచున్నది! ఈనీచాత్ముని గొంపోయి ధనరాశియందుఁ బూడ్చి పెట్టుచుఁ బెల్లగింపుచు నీతని లోభత్వంబెల్ల నుడిగింపుఁడు.

దీర్ఘ—(వాని నావల కీడ్చుకొని పోవుచున్నాఁడు.)

వక్ర—(ఇంకొక పాపిని దెచ్చి నిలువఁబెట్టుచున్నాఁడు.)

చిత్ర—ధర్మాధర్మవిచక్షణదక్షా! దక్షిణాశాధ్యక్షా! చిత్తగింపుఁడు. అసహాయంబులును, నిరపాయకరంబులును అగు సాధుమృగంబులు నండజంబులును పిపాసం జెంది, జలంబానఁ గూలంబుఁ జేర, దత్ప్రాంతంబులఁ గడునిర్దయుండై వలలుపన్ని, యురులొడ్డి, వాని యసురులం బొరిఁగొన్న గండుమగం డీతండు. వీని హృదయంబునకంటె భూధరంబె మృదుతరం బనవచ్చు. ఆ మృగాండజంబుల కీతండు భూలోకయముండై యొప్పియున్నవాఁడు!

యము—ఆఁ! చిత్రగుప్తా! ఏమేమీ! భూలోకయముండే!! మంచిది. వీనిం గుదియఁగట్టి మధ్యందినాతపంబున యాతనలం బెట్టుటయ గాక, రౌరవ మహారౌరవ నరకంబులం ద్రోసి, తొల్లి వీనిచే నిష్కారణంబుగ మడిసిన మృగాదులు భీకర క్రూరాకారంబులు దాల్చి వీనిని దారుమారుచేసి కాటియవెట్టున ట్లొనర్పుఁడు.

వక్ర—(ఆ పాపి నీడ్చుకొని పోవుచున్నాఁడు.)

దీర్ఘ—(వేఱొక పాపిని దెచ్చి నిలువఁబెట్టుచున్నాఁడు.)

చిత్ర—దుష్టజన హృదయ దారణ దారుణ భాషణా!! ధర్మపోషణా! ఈదుష్టుండు మిత్రుని హితాహితంబు లరయువానింబోలి వర్తించి వాని నమ్మికం బడసి, రహస్యంబులం దెలిసి, వాని శత్రులం గలిసి, వాని మానధనంబుల కపకృతి నొనరించి, యామోదించిన వంచకుండు. మృదు మధుర వచన రచన లను జాలంబులఁ బన్ని పర హృదయ ఖగంబుల వశ్యంబులుగఁ జేసికొనంజాలు మోసకాఁడనని మీసంబులు దువ్వువాఁడు. వీనిచే ద్రోహంబుఁజెందని మిత్రుం డీ ధాత్రియం దుండుట యరిది.

యము—సద్గుణ గంధలిప్తా! చిత్రగుప్తా! బెట్టిదంబులగు నెట్టిపాపంబులకైన నట్టులేక శిక్షలం బల్కుచుంటిఁ గాని మిత్రద్రోహికి వలయు శిక్ష తడవరసి నుడువవలయుఁ గదా. అయినను వీనిని బ్రస్తుతమందు నిఖిల విష కీటక నిబిడీకృతంబగు బోనునందుఁ బడఁద్రోయుఁడు. పిమ్మట మరల విచారింతము.

దీర్ఘ—(వాని నావల కీడ్చుకొని పోవుచున్నాఁడు.)

యము—చిత్రగుప్తా! కింకరులారా! ఏనొక్క విశేషం బెఱింగింతు నాలకింపుఁడు. వేదశాస్త్రంబులు ధర్మంబుల బహుముఖంబుల బోధించి తదాచరణ పరాయణులకుఁ బుణ్యలోకప్రాప్తియు, తద్ధర్మవిముఖులయి దురాచారవర్తనులగు వారల కెల్లరకు నారక దుఃఖప్రాప్తియు విశదీకరించుచున్నవి. ఇట్లుండ మహాపాతకులు కామక్రోధాదులకు వశంగతులై, దుష్కృతంబుల మహోత్సాహంబునం జేసి, ధర్మవర్ధకాధర్మనాశకంబయిన మచ్ఛాసనంబుం దూషించుచు నన్నుం ద్వేషించుచు నదరిపడి, తుదకు మల్లోకంబున కరుదెంచి తల్లడిల్లుచుందురు. వీరిం గరుణింప నధర్మంబగుగాక ధర్మంబగునే? పరమేశ్వరప్రీతికరంబగునే? కావున మద్భక్తులారా! యించుకేనియుఁ గరుణింపక యీ వంచకుల

శిక్షింపుచుండుఁడు. ఇదియె పరమేశ్వర శాసనంబు.

చిత్ర }
కింక } —దేవర యాజ్ఞను శిరసావహించి యట్లే యొనర్తుము.

యము—బహుసంతోషము. ఇంక శిక్షింపఁబడవలసిన పాపులం దీసికొని రండు.

కింకరులు—ఇంక నెవ్వరును లేరు దేవా.

యము—ఆఁ! ఏమీ! ఇం కెవ్వరును లేరా?

కింకరులు—చిత్తము. లేరండి మహాప్రభూ!

యము—మంత్రివరా! చిత్రగుప్తా! ఏమి యీచిత్రము!

ఉ. నాఁటికినాఁడు మత్పురము ♦ నం గల పాపులసంఖ్యఁ జూడఁ బె
క్కేటికిఁ బాటునంబడిన ♦ యేటిజలంబుల మాడ్కినాయెఁ; గ
న్గొట మరాట లాట మళ! ♦ యాళవిశిష్టసమస్తదేశముల్
దీటుగ దాఁటి పాపు లరు ♦ దెంచుచు నుండినవారె నిచ్చలున్?.

చిత్ర—వచ్చుచునే యుండిరి. కాని విదిశాపురంబునుండియు దాని సమీపమందలి మఱికొన్ని పట్టణములు, గ్రామములు, పల్లెలు మొదలగు వానినుండియు మాత్రము కొన్ని మాసములనుండి పాపులు వచ్చుచుంట లేదు.

యము—అరే! యేమీ! వచ్చుచుంట లేదా? ఒక్కరును వచ్చుచుంట లేదా?

చిత్ర—లేదండి మహాప్రభూ!

యము—ఏమీ? వారందఱును స్వర్గమునకే పోవుచుండిరా? ఏమి యాశ్చర్యము! వారందఱును దోషమన్న దెఱుఁగక ధర్మవర్తనులయ్యే యుండిరా యేమి? లేక యందఱు నొక్కసారిగఁ బావనులైరా? సాధారణంబుగాఁ బ్రతిపురమందును

క. కొందఱు పతితులుగను మఱి
కొందఱు పావనులుగాఁగఁ ♦ గూడుదు; రటుగా
కెందైన నంద ఱనఘులె
యుందురె? యిటువంటి చిత్ర ♦ ముండునె ధరపై?

దీని కేమైనఁ గారణం బుండితీరవలయు. అది మన మెట్లెఱుంగఁగలము?
(నారాయణ స్మరణ సేయుచు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు. [8])

యము—నారదమునీంద్రా! నమస్కారము. ఈయుచితాసనంబునఁ గూర్చుండుఁడు.

నార—సుఖీభవ. శమనా! నీవునుఁ గూర్చుండుము.

యము—తాపసేంద్రా!

క. మీరు త్రిలోకములందును
గూరిమిఁ జరియించుచుంద్రు; ♦ కువలయమున నే
తీరునను మీ రెఱుంగఁగ
నేరని కత లెంతఁ గలుగ ♦ నేరవు సదయా! 7

ఏ నిప్పు డొక్కయంశంబుఁ దమవలన వినఁగోరియున్నవాఁడ. అ దెద్దియనిన

గీ. దుష్టచిత్తులు, మఱి గురు ♦ ద్రోహు లమిత
పాపకర్ములు, బహు సురా ♦ పాన పరులు,
కప[illegible]వర్తనులును, మిత్ర ♦ ఘాతుకులును,
నడలుచుందురు రిటఁ బడి ♦ యనుదినంబు. 8

అట్టి వార లిప్పు డేమికారణంబుననో కొంత కాలంబునుండి వచ్చుట తగ్గినది. ముఖ్యముగా విదిశా పురప్రాంత ప్రదేశములనుండి వచ్చుట కానఁబడదయ్యె. దీని కేమైనఁ గారణం బుండితీరవలయు. అది యేమై యుండును?

నార—దండధరా! ఎఱిఁగింతు వినుము. ఈవిషయంబు నేనును మొన్ననె నూతనంబుగ వినియుంటిని. దీని నీ కెఱింగింపఁ దలఁచియే యిచటి కరుదెంచితి.

ఉ. ఆ విదిశాపురంబును ధ ♦ రాధిపుఁ డొక్కఁడు భక్తగణ్యుఁడై
పావనమూర్తి నాఁ జెలఁగి ♦ పాలనసేయుచు, విష్ణుప్రీతికై
సేవ లొనర్ప నెంచి, యల ♦ శ్రీహరివాసరసువ్రతంబు నెం
తే విమలాత్మతన్ సలుపు; ♦ నేమని చెప్పుదు వాని చిత్రమున్.

—* పంచచామర వృత్తము *—త్రిశ్రగతి.

నిరంతరంబు శయ్యనుండి ♦ నిద్రలేచు నప్పుడే,
పరాత్పరా! కృపాబ్ధి! పాప ♦ భంజనా! నిరంజనా!

పరేశ! నిర్మలాత్మ! యంచు ♦ భక్తియుక్తుఁడై కేశవుఁ
స్మరించుచుండుఁ గాని వేఱు ♦ మాటఁ బల్కఁ డెన్నఁడుఁ. 10

ఆ వ్రతప్రదేశం బెట్టులుండు ననుకొంటివి?

పాదపవృత్తము.

ఒక్కెడఁ బత్రియు ♦ నొక్కెడఁ బూలిం
కొక్కెడఁ బాటయు ♦ నొక్కెడ నృత్యం
బొక్కెడ స్వస్తి, మ ♦ ఱొక్కెడ గీతల్
లెక్కకు మించును ♦ లేదటు లెంచుఁ. 11

యము—ఏమీ! అంతటి భక్తితో వ్రతం బాచరించుచుండెను గా!

నార—ఇంతేనా! మఱియు వినుము.

గీ. తా నొనర్చిన మన కేమి ♦ తఱుఁగఁ బోదు;
కాని పురజను లెల్లరఁ ♦ గలయఁ గూర్చి
యా వ్రతంబును భక్తిచే ♦ నాచరింపఁ
జేసి నీ పురి కీరీతిఁ ♦ జేటుఁ దెచ్చె. 12

గీ. వార లెల్లరుఁ గలుషత ♦ వాసి తుదను
స్వర్గమున కేగ సాగిరి ♦ సరభసమున;
కాలు కల్గినవానికిఁ ♦ గాశి కేగు
టనఁగ మూఁ డంజ లనెడు సా ♦ మ్యముగ శమన. 13

కావున నీలోకమందలి పాపుల సంఖ్య తక్కువగుచున్నది. ఆ రాజేంద్రుని పేరు రుక్మాంగదుఁడు.

యము—ఏమి యాశ్చర్యము! ఈ వ్రత మహాత్మ్యంబున వార లెల్లరును గలుషరహితు లగుచుండిరిగా! దీనిచేతనా యిచటి పాపుల సంఖ్య తక్కువగుట!

నార—తక్కువగుట మాత్రమేనా?

గీ. ఈ వ్రతమె యింక యిసుమంత ♦ యితరదేశ
వాసులందును వ్యాపించి ♦ ప్రబలె నేని

నీ బలంబులు నీపురు ♦ నీ నరకము
తరలి యేమూల నైనను ♦ దాఁగ వలదె! 14

అటు పిమ్మట నీ వుండి ప్రయోజనమేమి? నీ వెవ్వరిని శిక్షింతువు? క్రమక్రమంబుగ నీ యధికారంబునకును నీ లోకంబునకును గూడ హాని తటస్థింపఁబోవుచున్నది. కాన నెఱింగించితి. పిమ్మట నీయిష్టము.

యము—ఓహో నారదమునీంద్రా! నీ వాక్యంబులు వినినంతనే నాగుండె లదరుచున్నవి. దీని కేమి యుపాయము? ఈ వ్రతంబేమి! ఈ తం డాచరించుట యేమి! నాలోకంబు పాడగుటయేమి! దీనికి నే నేమిచేయుదును?

నార—ఏమిచేయుదువు? పాపులు వచ్చునప్పుడు శిక్షింపుము. రానప్పుడు మెదలక కూర్చుండుము.

యము—అట్టులనెదవేల మునీంద్రా! ఎట్టులైన నీవే కరుణించి నా లోకంబుఁ గాపాడవలయును.

నార—(చిఱునవ్వుతో) నే నూరక పాడఁగలను గాని కాపాడఁగలనా?

యము—దీనికిఁ దగిన వెఱ వొక్కటి యోజింపఁజాలవా?

నార—భక్తుల కిచ్చుటకై మంచి మంచి ధోవతుల చాపులను జక్కఁగాఁ జింపఁగలనుగాని వే ఱొద్ది యోజింపఁజాల.

యము—ఎట్టులైన నా లోకవ్యవహారంబు ముడివడునట్లు చేయుము.

నార—ఈ వ్యవహారము చూడ విడఁబడునట్టులున్నది. కాని ముడివడునట్లు నాకుఁ దోఁచుట లేదు.

యము—నీ వాక్యంబులు విన విన నాకు మఱింత భయము కలుగుచున్నది. ఈ మహాదుఃఖ సముద్రము నే నెట్టు లీదఁగలను?

నార—ఓశ్. అ దెంతపని? దీని కుపాయము నేను చెప్పఁగలను.

యము—ఏమిచెప్పెదవు?

నార—నా తంబురబుఱ్ఱవంటి మంచి బుఱ్ఱ యొకటి సంపాదించుకొని దాని గట్టిగాఁ గౌఁగిలించుకొమ్ము. ఎట్టి మహాసముద్రమందైనను మునుఁగకుండ నీఁదవచ్చును.

యము—నేను కార్యావసరమ్మున నిట్టులు ప్రార్థించుచుండ నాయెడఁ బరిహాసంబుఁ గావించెదవా?

నార — నాకు నేమియుం దోఁచక పల్కిన వాక్యంబులు కాని పరిహాసవాక్యంబులు (కొంచెము సేపూరకుండి) అయినను దండధరా! యింత వెఱ్ఱివాఁడ నేమి?

ఉ. ఏటికి యీ వృథావ్యసన ♦ మే దెటుఁబోయినఁ బోవనిమ్ము; నీ
కేటికి లేనిగోడు? సుఖి ♦ యింపఁగ నేరవె హాయినుండి? నీ
కూటికి గుడ్డకున్ భయముఁ ♦ గొంటివె? లోపము లేదు నమ్ము; నా
మాట నిజమ్ము; ధాత తగు ♦ మాత్రము పెట్టకయున్నె యేరికిన్?

యము — సంయమివరా! నాకన్నవస్త్రములకు లోపము కలుగదని యీపల్కు లంటివి

నార — మఱేమి కావలయును?

యము — చిరకాలము నాచేఁ బాలితంబగు రాజ్య మిప్పుడు వ్యర్థమగుచుండెఁగదా.

నార — రాజ్యమునకై నీ వేల యింత శ్రమపడెదవు?

గీ. ఇంత శ్రమపడితంచు నీ ♦ కెవ్వరైనఁ
ద్రవ్వి తలకెత్తుదురె మహా ♦ ద్రవ్యమెల్ల?
ఒక్క మూలను గూర్చుండి ♦ యుచిత గతిని
ప్రొద్దుపుచ్చుచు నీ దారిఁ ♦ బోవరాదె? 16

యము — నారదా! నిన్నింతగ వేఁడినందు కిదియా నీవు నాకుఁ జూపు త్రోవ?

నార — ఇంతగ వగచుట కిప్పుడు నీ పుట్టిమునిఁగినది?

యము — అయ్యో నారదా! అట్లనెదవేమి?

ఉ. ఆరక భగ్గుభగ్గున మ ♦ హానలకీలలఁ గ్రక్కుచుండు మ
న్నారకవహ్ని యారి కడు ♦ సల్లగుచుండుటఁ గాంచి, నెత్తిపై
నోరెడికొంచు, నూరక ని ♦ నున్ వినువేఁడుచునుండ నాకిదే
తారకమయ్యె; నేమిగతి ♦ దైవమ! దైవమ! యంచు నుండితిన్.

నార — (తనలో) నా యత్నమువలన నిప్పటి కీతఁడు మహాతురుండై యున్నవాఁడు. కలహకారణబీజం బొక్కటి యిపుడు చక్కఁగ వీని హృదయభూమియందు నాటవచ్చును. దీని ఫలమును నేను హాయిగఁ గొంతకాల మనుభవింప వచ్చును. (ప్రకాశముగా) దండధరా! నీవు మిక్కిలిగ వడుగుచుంటివి కాన నాకుఁ దోఁచిన యొక్క యుపాయం బెఱింగింతు వినుము.

క. నీ కీ ప్రభుత యొసంగిన
దా కమలజుఁ డతనిఁ జేరి ♦ యాద్యంతముగా
నీ కథఁ దెల్పి మహాత్మా
నాకొక దరిఁ జూపు మంచు ♦ నతి యొనరుపుమీ. 18

గీ. అతనిఁ బ్రార్థించి, ధ్యానించి, ♦ యాశ్రయించి,
వ్రతము నెల్లని మాన్పింప ♦ వలయు శమన;
తగని కార్యం బటంచును ♦ దలఁతు వేమొ;
యాత్మరక్షణకన్నఁ గా ♦ ర్యంబు కలదె?

ఇంతకన్న నుపాయాంతరం బేమియు నాకుఁ దోఁచుట లేదు. ఇట్లుకానిచో నే నీ యమాధికారంబు నొల్లనని యా నలువతో గట్టిగా మొఱఁబెట్టుకొనుము. ఇఁక నాకుఁ దడవగుచున్నది. శమనా! నేను బోయివచ్చెద.

యము—చిత్తము మునికులచంద్రమా! నమస్కారము.

నార—సుఖీభవ. సుఖీభవ. నారాయణ. [9](అనుచు నిష్క్రమించుచున్నాఁడు.)

యము—వింటిరే కింకరులారా? దీని కేమిచేయుదును?

కింక—నారదమునీంద్రుని యుపాయమే బహుబాగుగ నుండినది మహాప్రభూ.
(ఇంతలోఁ జాటుననుండి యొకపాపియు, గింకరుఁడును బెనఁగులాడుచు ప్రవేశించుచున్నారు.)

పాపి—అయ్యా! అయ్యా! యమధర్మరాజా! చూడండి. ఈ కింకరుఁడు నన్ను మీయొద్దకు రానీయక బాధించుచున్నాఁడు. ఇంతవఱకు బహుకాలమునుండి నేను మీ లోకంబున నరకబాధ లనుభవించుచున్నాను. ఇప్పుడు భూలోకంబున నామనమఁడు ఏకాదశీవ్రతం బాచరించినాఁడు. ఈవ్రతమువలన పై మూడు తరములవారును, దిగువ మూడుతరములవారునుఁ గూడఁ బావను లగుదు రని వైష్ణవపురాణంబులు మొఱఁ బెట్టుచున్నవి. కావున నిఁక నాకుఁ బాతకంబు లెక్కడనున్నవి? నామనమఁడు వ్రతమొనర్చుటచేత నేను పావనుఁడనైనాను. ఇఁక నన్ను బాధించుటకు మీకుఁగాని మీ కింకరులకుఁగాని యెంతమాత్ర మధికారము లేదు. కాఁబట్టి నన్ను స్వర్గలోకమునకుఁ బంపి వేయుడు.

యము—సరే, వీనిని స్వర్గమునకుఁ బంపుఁడు. (అనికింకరులకాజ్ఞాపించుచున్నాఁడు.
(చాటుననుండి యొకపాపాత్మురాలును గింకరుఁడును బ్రవేశించుచున్నారు.)

పాపి—అయ్యా! నన్నీ కింకరచాయన కొట్టొస్తున్నాఁడండి. నా కూఁతురుబిడ్డే భూలోకంలోనే, యాకాశీవ్రతమే, చేశాఁడండి. అందుకని నా పాపాలన్నీ పోయినాయి. నేను సొర్గానికి పోవాలండి. పంపించండి.

యము—ఈ స్త్రీని కూడా స్వర్గమునకుఁ బంపివేయుఁడు.

(ఇద్దఱు బంధువులతో నింకొక వైశ్యపాపియుఁ, గింకరుఁడును బ్రవేశించుచున్నారు.)

పాపి—రాజుగారండీ! రాజుగారండీ! మాపెద్దయ్య మనమఁడే మా వూళ్ళోనే మొన్న యాకాశిరతం చేశాఁడండి. నేను సొర్గానికెళ్ళాలండి. ఈఁడే మాపెద్దమ్మ తమ్ముఁడండి. ఈఁడుకూడా మావోఁడేనండి. (అని వాండ్ర నిద్దఱను దగ్గఱఁగా దీసికొని) మేము ముగ్గురముకూడా సొర్గాని కెల్లాలండి.

యము—ఏమీ! మీరు ముగ్గురును స్వర్గమునకుఁ బోవలయునా! ఔరా! స్వర్గమెంత చౌకాయె! సరే. వీరినిగూడఁ బంపివేయుఁడు. (అని యాలోచించి) అహో సభాసదులారా! చూచితిరాయీవిపరీతము.[10] ఆ రుక్మాంగదుండొనర్చు నేకాదశీ వ్రతంబుచే నూతనులు నా లోకంబునకు రాకపోవుటయగాక యిచటి పురాతనులుకూడఁ బాపరహితులై తిమని స్వర్గంబునకుఁ జనుచుండిరి. దీని నింకను పేక్షింపఁ జనదు. లోకంబు పాడువడుచున్నది. కావున నారదుండు తెల్పిన ప్రకార మీక్షణమే నేను బ్రహ్మలోకంబున కరిగి యా నలువతో నిందుకుఁ దగిన ప్రతీకారంబుం డాలోచించెద. మీరెల్లరు మీ మీ కార్యంబులయందు జాగరూకతతో నుండుఁడు. (అందఱును నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయ రంగము—బ్రహ్మలోకము.

(బ్రహ్మదేవుఁడు కూర్చుండి యుండఁగా యముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

యము—దేవా! పరమేష్ఠీ! వాణీమనోహరా! నమస్కారము.

బ్రహ్మ—సుఖీభవ. సుఖీభవ. ఏమోయి? సూర్యనందనా! ఏమిసమాచారము? నీ లోకంబును ధర్మంబుఁదప్పక పాలించుచున్నవాఁడవే?

యము — ఏమిచెప్పుదును దేవా! ఇంక నే నేడ! నా లోక మేడ! నేను పాలించుట యేడ! భూలోకంబున విదిశాపురంబను నొక్క పురంబు కలదు కదా.

ఉ. ఆ విదిశాపురంబును ధ ♦ రాధిపుఁ డొక్కఁడు భక్తగణ్యుఁడై
పావమూర్తినాఁ జెలఁగి ♦ పాలనసేయుచు, విష్ణుప్రీతికై
సేవలొనర్ప నెంచి, యల ♦ శ్రీహరివాసర సువ్రతంబు నెం
తే విమలాత్మతన్ సలుపు, ♦ నేమనిచెప్పుదు వానిచిత్రమున్. 20

అత డంతటితో నూరకుండెనా?

గీ. తా నొనర్చిన నా కేమి ♦ తలఁగఁ బోదు.
కాని పురజను లెల్లరఁ ♦ గలయఁ గూర్చి
యా వ్రతంబును భక్తిచే ♦ నాచరింపఁ
జేసి నా పురి కక్కటా ♦ చేటుఁ దెచ్చె. 21

ఈ వ్రత మాహాత్మ్యము చేత

గీ. వార లెల్లరుఁ గలుషముఁ ♦ బాసి తుదను
స్వర్గమున కేగసాగిరి ♦ సరభసమున
కాలు కల్గినవానికిఁ ♦ గాశి కేగు
టనఁగ మూఁడంజల నెపు సా ♦ మ్యమగ నకటా. 22

దీనిచే నా లోకంబునకు వచ్చువాఁ డొక్కండును గానరాఁడయ్యె. ఇది కాక నాలోకంబునం దిదివఱకు నరకబాధ లనుభవించువా రందఱును ఇప్పుడు భూలోకమునందుఁ దమ పుత్రపౌత్రాదులొనర్చు వ్రతమహాత్మ్యంబునంజేసి తాముఁ బవిత్రుల మయితిమని స్వర్గంబున కరుగసాగిరి. ఔరా!

గీ. ఇంక నే నేల? నారాజ్య ♦ మేల? యిట్టి
లోక మేటికి? కింకరా ♦ నీక మేల?
యగ్నిగుండంబు లేల? యా ♦ యాస మేల?
వట్టిపెండ్లికి వాద్యంబు ♦ వలెనె ధాతా!

వృథగా నిట్టి రాజు నుంచి యేమి ప్రయోజనము? నీవు నాకిచ్చిన యీ

యధికారమును నీవే కైకొమ్ము. ఇదిగో నీవు నాకిచ్చిన కాలదండము; సగము త్రుప్పు పట్టి యున్నది. ఇదిగో నీవు నా కిచ్చిన కాలపాశము. పురి విడిపోవు చున్నది. ఇవిగో నా తక్కిన యాయుధంబులు. కైకొనుము. ఇంక నే నరిగెద.

బ్రహ్మ—శమనా! తొందరనొందకుము.

యము—తొందరయేల? [11] నాకు సెలవొసంగి పంపుము. అంతియచాలు.

బ్రహ్మ—శమనా! ఏల నీ వీ లీల నేఁడు తాలిమిఁదూలి బేలవై మాటలాడుచుంటివి? ఆపదలు వాటిల్లుతఱి ధైర్యం బవలంబించి తప్పించుకొను వెరవు యోచింపవలయుఁ గాని యూరక తొందరనొందవచ్చునా? ఆపదలయందు విస్మయంబును సభా మధ్యంబునఁ దొట్రుపాటును, స్త్రీలయెడ నతి లోలత్వంబును, సామాన్యపురుష లక్షణంబు లని యెఱుంగవే?

యము—వాణీమనోహరా! నీ పల్కిన వాక్యంబులు నిక్కంబులే కాని నీ వొక్క తూరి నా లోకంబున కరుదెంచి చూచునెడ నింత శాంతహృదయుండవై మాటలాడఁజాల వని తలంచెద.

సీ. కటకటా! పరకాంతఁ ♦ గాంచి కన్ గీటెడు
దుష్టాత్ము మిడిగ్రుడ్లు ♦ తోఁడలేదు
సాధుల దూషించు ♦ చండాలురను బట్టి
కుత్తుకల్ పరపర ♦ కోయలేదు
పతిఁబాసి పరుచెంతఁ ♦ బవ్వళించెడుకాంత
పెళపెళ గుండానఁ ♦ బేల్చలేదు
కులగురుద్రోహులఁ ♦ గ్రూర దుష్కర్ముల
గోలుగోలున నేడ్వఁ ♦ గొట్టలేదు

గీ. బాపురే! ధాత! యిదియెట్టి ♦ వ్రతము కాని
యఖిల దోషంబులకును బ్ర ♦ హ్మాస్త్ర మగుచు
బాధొనర్చెనుమ్మల్లోక ♦ భాగ్య మెల్ల
నేమి తెల్పుదు నీమహి ♦ మెట్టు లోర్తు?

చ. పలుకుట లొక్కరీతిగను ♦ భావములోన మఱొక్కరీతిగన్
సలుపుట లొక్కరీతిగనె ♦ సంగెడు దుష్టులఁ బట్టి తెచ్చి, హా
పెళపెళ యగ్ని గుండమునఁ ♦ బేల్చఁగఁ జాలక పోతి; నింక నేఁ
గలిగిన కార్యమేమి? వృథ ♦ కాదె? మహాత్మ! తలంచిచూడుమా.

ఏమి చెల్పుదు వాణీమనోహరా? నాకింకరులెల్ల నిర్వ్యాపారులై, బలశౌర్యంబులువాసి సోమరితనంబునఁ జెల్లాచెదరై తిరుగుచున్నవారు. అగ్నిగుండంబులు చల్లారిపోయె. ఉక్కుస్తంభమునఁ ద్రుప్పుపట్టుచుండె. ఆయుధంబులెల్ల వాయిసెడుచుండె. పాపుల బాధించు శునకంబులును, వాయసంబులును, ఆహారార్థమై నలుకెలంకులకుఁ బోసాగె. అనుదినంబును నరకబాధ లనుభవించు పాపుల రోదన ధ్వనులచేతఁ బ్రతిధ్వను లిచ్చుచుండు నా లోకంబెల్ల నిప్పుడు దివారాత్రంబులు నిశ్శబ్దంబుగా నిద్రించుచున్నట్లే యున్నది. ఇట్టి దురవస్థం జూచినఁ దొందరగాక శాంతం బెట్లు కలుఁగ నేర్చు? ఈ వ్రతంబున కింతటి మాహాత్మ్యం బెట్టుకలిగెనో నాకుఁ దోఁచకున్నయది. దీని కేదైన మార్గం బుండెనేని నాకుఁ దెలియఁజెప్పుము. లేకున్న నా యమాధికారంబును గైకొని యింతటితో సెలవిచ్చి పంపివేయుము.

బ్రహ్మ—ఓహో శమనా! నేనెఱింగింతువినుము. ఆ రుక్మాంగదుం డొనర్చు నేకాదశీవ్రతంబు నేనెఱుఁగనిదికాదు. అది వ్రతంబులలో నెల్ల శ్రేష్ఠంబు. దాని మాహాత్మ్యం బింత యని వర్ణింప నలవికాదు.

చ. హరికిని సాటి దేవతయు ♦ నా హరిభక్తులఁ బోలు పుణ్యులున్
హరికథబోలుసత్కథయు ♦ నాహరినామముఁబోలుమంత్రమున్
హరిచరితంబుఁ బోలు కృతి ♦ యా హరివాసరతుల్యమౌవ్రతం
బరయగ నీత్రిలోకముల ♦ యందును గానఁగనౌనె యంతకా? 26

క. హరివాసర సద్వ్రతమున
హరియించు ననంతకోటి ♦ యఘ సంఘంబుల్
హరినామ మనిన దానికి
సరి వేఱిఁకఁ గలదె? జన్మ ♦ సార్థక మనఘా! 27

ఆ రాజేంద్రుండు మహాభక్తుండై యిట్టి మహావ్రతంబు నాచరించుచున్న వాఁడు (అనుమానముతో) ఎట్లయిన నాతని వ్రతంబునకు భంగముకల్గినఁ గాని నీలోకంబు బాగుపడ నేరదు.

యమ—(త్వరగా మాటల కడ్డము వచ్చి) అవును మహానుభావా అంతే. వాని వ్రతంబున కెబ్భంగినైన భంగంబు వాటిల్లదేని నా లోకంబు బాగుపడుట యరిది. ఇట్టిది యేమైన నీవే చేయవలయు.

శా. పొంకంబా హరినాభిసీమ జననం ♦ బున్ వింతగాఁ గాంచి, ని
శ్శంకన్ మేటి చరాచరాత్మకప్రపం ♦ చంబెల్లఁ గల్పించి, పై
నింకన్ వేల్పులపెద్దవైతివి; బళా ♦ యీ వించుకం తాత్మలో
సంకల్పించినఁ జాలదే? జరగదే? ♦ సర్వంబు చేకూడదే?.

బ్రహ్మ—శమనా! వినుము. ఈవ్రతం బా శ్రీ మహా విష్ణువున కతిప్రీతికరంబు. రుక్మాంగదుం డాయనకుఁ బ్రియభక్తుండు. కావున

గీ. ఈ వ్రతంబున కేనియు ♦ నితని కేని
యెగ్గు నెద్దేనిఁ గావింప ♦ నెంతు మేని
యల్ల శ్రీమహావిష్ణున ♦ కది యనిష్ట
మగునుగావున వెన్కముం ♦ దరయ వలయు.

ఇందుకు సమ్మతింపక మిన్నకుండునెడ నీ లోకం బంతయుఁ బాడగును. యమలోకంబు పాడువడి యముని భయంబే లేకపోవునెడ లోకంబున ధర్మాధర్మంబులు నశించును. అనఁగా నరకభయంబు లేకపోవుటంజేసి పాపభయంబును లేకపోవును; దుష్కార్యంబులు మెండగును; విపరీతంబులు కలుగును; దాన సర్వానర్థంబులు వాటిల్లును. కావున నిట్లుభయపక్షంబులును బరికించినచో నెగఁదీసిన బ్రహ్మహత్యయు దిగఁదీసిన గోహత్యయు నన్నట్లుగా నున్నది.

యమ—అట్లయిన నే నేమిచేయుదును? నాకేమియుఁ దోఁచకున్నదే.

బ్రహ్మ—అయినను నా మనంబున కొక్క యుపాయంబు పొడకట్టుచున్నది.

యమ—(సంతోషముతో) సెలవిండు మహానుభావా!

బ్రహ్మ—సావధానంబుగ వినుము.

గీ. ఎట్టి భక్తు నైనఁ ♦ బట్టి పరీక్షించి
తరిచి నిజము నరయఁ ♦ దగును గాదె?
యెట్టి పైడి నైన ♦ గట్టిగా రాతిపై
నొరసి యొరసి విలువ ♦ నరయు కరణి. 30

కావున నీ రుక్మాంగదుని భక్తివిశేషంబును బరీక్షించు సాధనంబుగ నుండునట్టు లెద్దేని యొక్క యుపాయంబు మోక్షాసక్తులకెల్ల విఘ్నకారిగను, భక్తాగ్రేసరుల కెల్ల గళబంధంబుగను ఉండునటులు ప్రయోగించి చూచెద. దీనిచేత నాతండు వ్రతభంగంబునొంది పిమ్మట వచ్చిన నీ లోకంబునకే రావచ్చును. దానఁ గ్రమంబుగ నీ కీప్సితార్థసిద్ధి యగును.

యము—బహుసంతోషము కామితవరదా. ఎట్లయిన నాతఁడే నాలోకంబునకు రావలయు.

బ్రహ్మ—కాని శమనా!

—* మత్తకోకిల *— మిశ్రగతి.

ఇంతలింతలు సేయ నా ప్రభుఁ ♦ డెంతయున్ భ్రమఁజెందకే
శాంతచిత్తముఁ దాల్చి యింద్రియ ♦ సంగుఁ డింతయుఁ గాక ని
శ్చింత నుండి కలంగఁడేని య ♦ శేష భూవలయంబునం
దింతకంటెఁ బదింతలై సుజ ♦ నైకవంద్యుఁ డనంబడున్. 31

కావున శమనా! నీవింక నీలోకంబున కరుగుము. నేను దగు ప్రయత్నంబున నేయుండెద. నీవు తొందర నొందకుము.

యము—చిత్తము చతుర్ముఖా నమస్కారము.

బ్రహ్మ—మనోరథ సిద్ధిరస్తు.

(యముడు నిష్క్రమించుచున్నాఁడు.)[12]

బ్రహ్మ—యముండు బహు కలవర మొందుచున్నవాఁడు. ఇంకఁ దడవు సేయఁ జనదు (అనికొంచెము విభూతిని మంత్రించి యూఁదఁగా నొక్కతరుణి యుద్భవంబై.)

జనకా! నమస్కారము.

బ్రహ్మ—కల్యాణమస్తు. కల్యాణమస్తు. బిడ్డా! నిన్ను జగన్మోహనాకృతిఁ గలదానిఁగ సృజించితిఁ గాన నీకు మోహిని యను నామం బిడుచుంటి. మోహినీ! నిన్నిట్లు త్రిలోకసుందరిగా నీ క్షణమందు సృజించిన కారణ మేమో యెఱుఁగుదువా?

మోహి—సెలవిమ్ము జనకా! నీ యుత్తరవున కెదురుకలదా?

బ్రహ్మ—భూలోకంబున విదిశాపురంబును రుక్మాంగదుండను నొక్క రాజేంద్రుండు పాలించుచున్నవాఁడు.

గీ. అతఁడు నిజభక్తి భక్తజ ♦ నాఢ్యుఁ డగుచు
శ్రేష్ఠమయితగు నేకాద ♦ శీ వ్రతంబుఁ
తా నొనర్చుటకాక యం ♦ దఱనుఁ జేర్చి
యాచరింపఁగఁ జేసె మ ♦ హాత్ముఁ డగుచు. 32

క. ఈ పుణ్యవ్రత మహిమను
నా పురజనులెల్ల భవమ ♦ హాబ్ధిఁ దొరఁగుచున్
బాపరహితులై స్వర్గమె
కాపురముగఁ గొంచు నుండ్రి ♦ కాలాంతమునన్. 33

స్వామిద్రోహులును, మిత్రద్రోహులును, అనాచారవర్తనులును, అసత్యవాదులును, చౌర్యక్రియాన్వితులునుం గూడ నీవ్రతమహాత్త్వంబుచేఁ గలుషరహితులై యంతంబున స్వర్గంబునకే పోవుచుండిరి. కాని నరకలోకంబున కొక్కరుండును రాఁడయ్యె. దీనిచే యమలోకంబు పాడగుచున్నది. కావున నీవు సత్వరంబున జని యెట్లయిన నా భూపాలుని చెంతఁ జేరి

ఉ. ఎండలనైన మేను మఱ ♦ పించెడి గానరసం బొసంగుచున్
వందలు వేలు కాఁగ మృదు ♦ వాక్యఫలంబుల విందొనర్చి, నీ
యందమురక్తి నెయ్యము మ ♦ హాద్భుతమోహరసంబు, తద్వ్రతం
బందు విరక్తియున్ మఱపు ♦ నాతనికిం గలిగింపు మోహినీ. 34

మోహినీ! నీ వీ కార్యంబు సులభసాధ్యంబని యెంచకుము. ఆ రాజేంద్రుండు వ్రతనిష్ఠుండు; భక్తాగ్రేసరుండు.

ఉ. నీటులు గోటులుల్ వగలు ♦ నివ్వెఱపాటులు ముద్దుమాటలుల్
బాటలు నాటలుల్ మృదుల ♦ భావము ప్రేముడు లెల్లఁ జూపి, ము
మ్మాటికి నీదె లోకమను ♦ మూర్ఖ ధరాధిపుఁ బొంగఁజేసి, పె
క్కేటికిఁ దద్వ్రతంబు మఱ ♦ పింపు మ దెట్టులుకాని మోహినీ. 35

ఇదియే నీవు చేయవలసిన కార్యంబు.

మోహి—ఆహా! యేమిజనకా నీ వాక్యంబులు! ఇంతసేపు బోధించిన దంతయు నొక్క సామాన్య భూపాలుని వశపఱచుకొనుటకేనా? [13]

క. ఏకాలము కాననముల
నాకలములఁ దించు భ్రాంతు ♦ లడఁచితి మంచుల్
వాకొనియెడు మునిముచ్చులు
హా! కన్నెలయింట దాసు ♦ లై మన లేదే? 36

ఇంక భూపాలురా!

క. ఉండుట గృహరాజమ్ములఁ,
బండుట మృదుశయ్యలందు, ♦ భక్షించుటయా?
పండులు మధు మాంసంబులు;
నుండునె జితవిషయుఁ డిట్టి ♦ యుర్వీశులలోన్ ? 37

మునివరులే యట్లు లగుచుండ నిట్టి భూపాలురకై విచారింపఁ బూనునెడ శ్లో. మహాగజాః పలాయంతే । మశకానాంతు కాగతిః. యనునట్లుండునుగదా. ఈతం డేమో వ్రతనిష్ఠుండనియుఁ, ధీరుండనియుఁ బల్కితివి.

ఆ. అట్టి పెద్దలట్లు ♦ మిట్ట వేదాంతముల్
సభల నిల్చి పెక్కు ♦ చదువ వచ్చు;
వాని చెంత నొక్క ♦ మానిని చేరిన
నగ్ని ఘృతము చెంత ♦ నమరి నట్లు. 38

ఈతనికై నా యాటలు పాటలు వలపులు సొలపులెల్లఁ జూపుమంటివి. జనకా! గోటితో నయ్యెడు కార్యమునకై గొడ్డలిపూననేల? క్రేగంటి చూపు మాత్రం

బునసే వశవర్తి కాఁగల యీ భూపాలునకై నా నేర్పరితనంబు లెల్లఁ జూపనేల? శ్లో. వినా యంత్రేణ మంత్రేణ వంచయంతి నరం స్త్రియః. అను నార్యోక్తి వినలేదా? కాన సెలవొసంగి పంపుము. ఈక్షణంబ చని నీ యనుమతంబు చొప్పున నాతని వ్రతంబెల్ల మంటఁగలిపి వచ్చెద.

బ్రహ్మ—బిడ్డా! మోహినీ!

గీ. నీకుఁ గల్గిన యీ నేర్పు ♦ నే నెఱుఁగుదుఁ;
గాని నీనేర్పు నీ వెన్నఁ ♦ గలవొ లేవొ
యంచు నీరీతి నే ముచ్చ ♦ టించి నాఁడ;
దాని నీ మది వేఱుగఁ ♦ దలఁప కబల!. 39

అయినను

ఆ. కార్య మల్ప మంచు ♦ గర్వింపఁగారాదు
ఘనుల కైన జయము ♦ కల్గు దాఁక,
రాముఁ డల్పుఁ డంచు ♦ రావణుం డెంచఁడా?
కాన నేర్పుఁ గల్గి ♦ కడఁగు మబల! 40

సత్వరంబున నీ వీణియం గొని చని, యెట్టులైనఁ గార్యసానుకూల్యంబుఁ జేసికొని రమ్మ. నీకు శుభం బగుఁగాక.

మోహి—చిత్తము జనకా! పోయివచ్చెద. నమస్కారము.

బ్రహ్మ—కల్యాణమస్తు. కల్యాణమస్తు. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య. శ్రీమదుమారమణకరుణాకటాక్షపాత్ర శ్రీవత్ససగోత్ర బేతపూడి వంశ క్షీరపారావార రాకాసుధాకర మల్లేశ్వరామాత్యపౌత్ర, నిరంతర శివారాధనపరాయణ లక్ష్మీనారాయణామాత్య చతుర్థపుత్ర, గుణకదంబ లక్ష్మాంబాగర్భ సంభూత, సుజనవిధేయ, భగవంతాభిధేయ ప్రణీతం బైన రుక్మాంగద నాటకంబున నిది

ద్వి తీ యాం క ము.

——



శ్రీ

# రుక్మాంగదనాటకము.

## తృతీయాంకము.

ప్రవేశము:—వెట్టిగాఁడు, పిచ్చిగాఁడు మొదలగు కాఁపులు.

వెట్టి—బాబో! బతకలేము బతకలేము. యీ మెకాలతో అంతా సచ్చిపోయేలాగుండది. పానాలు పోతావుండాయి బాబో.

పిచ్చి—నీమంద మారణంగాను. నిన్న రేత్తిరి మెకాలమంద దొచ్చిపడి మా మేఁకలంటినీ మెడకాయ లిరగఁదీసి నుగ్గుసేసి పారేశినాయి. నాకూట్లో మన్నోశినాయి బాబో బతకలేము.

వెట్టి—పిచ్చిగా! యీరన్నా! పుల్లాయి! పోతా! మల్లేసు! పకీరు! యంకా అంతా బతికుండారంట్రా?

అందఱు—ఆ. ఆ. బతికుండాము. కాని యంకఁడు లేఁడు. మెకం యేసుకెల్లిందేమో

పిచ్చి—యెట్టిగా! గుడిచికా డుండాఁడేమో పిలవరా వత్తాఁడు.

వెట్టి—యంకా! యంకోయి. (అని పిలువఁగాఁ బలుకఁడు.)

పిచ్చి—గట్టిగా పిలవరా బతికుండాఁడేమో.

వెట్టి—ఓల యంక యంక యంక ఁయంక యంకోహోయి!

వెంక—(ప్రవేశించుచు) వోయ్! వోయ్! అన్నా బతికుండారంట్రా? సాఁరల మెకం నన్ను రెక్కట్టు కీడ్సుకెల్లిందిరా. యల్తావుంటే యీ సురకత్తి దీసుకొని దవడగురి కొక్కపో టేసేతల్కి రెక్క యిడిశేశి పారనూకిందిరా.

అంద—బాబో! బాబో! నీ యమ్మ కడుపు సల్లఁగా మల్లీ బతికొచ్చావంట్రా.

పిచ్చి—నీకు ఏడుకొండ లెంకన్న పేరెట్టుకున్నందుకు ఆయంకన్నే బతికిచ్చాఁడురా

అందఱు—నిజం. నిజం. యంకన్నే బతికిచ్చాడు. [14]

పిచ్చి—ఒరే! యఱ్ఱన్నా! యీ మేకాలన్నీ వొక్కపాలిగా వొచ్చిపడ్డాయేంరా?

వెఱ్ఱి—నాకూ అదే సందేయంగా వుండదిరా.

వెంక—ఒరేయి! యవరో అమ్మోరొచ్చిదిగింది సూశావంట్రా?

పిచ్చి—ఏంట్రా! మేకాలమ్మోరంట్రా?

వెఱ్ఱి—పిచ్చిగోలేంరా నీది! మేకాలమ్మోరేంట్రా?

పిచ్చి—ఓరి నీ యెటిగూల. యరగవంట్రా మశీసకాలమ్మోరుండదా లేదా? కలారా ఆమ్మోరుండదా లేదా? జగాలమ్మోరుండదా లేదా? యిది మేకాలమ్మోరు గావాసురా.

వెంక—ఒరే! మడిసిలాగే వుండదిరా.

వెఱ్ఱి—నేను కూడా సూశారా. అంకమ్మ జాత్రకాలేక ప్పెరకుండెత్తుకునే గణాశారి లాగుండదిరా. తళతళా, తళతళా కన్ను శెదిరిపోతావుండదిరా.

పిచ్చి—యంకన్నా! యక్కడుండదిరా.

వెంక—ఇట్టకామేశిరియ్య గుడి లేదంట్రా? ఆక్కడే వుండది.

పిచ్చి—ఆదారిని పోతే యంబడిఁ బడుద్దేమో. యెఱ్ఱన్నా! కొబ్బరికాయలు తీసికెళ్లి కొడదామంట్రా?

వెంక—కాదురా. మడిశిలాగే అనపడతా వుండదిరా.

పిచ్చి—(సందేహముతో) మడిసైతే మేకాలుకూడా యీ యమ్మోరొచ్చినప్పుడే రావటమేంయిరా?

వెంక—అదేమో. బెమ్మదేవుడి మాయలాగుండది.

పిచ్చి—యీ యమ్మోరు జాతర శాద్దామంట్రా?

వెఱ్ఱి—అమ్మోరు పేరు తెలవొద్దూ జాతర శెయిటానికి?

వెంక—నిన్న వొవరితోనో మాట్టాడుతావుంటే నేను కసింత యిన్నాను. పేరుమో యినమ్మంట. బెమ్మదేవుఁడి కూతుఁరంట.

పిచ్చి—(ఆశ్చర్యముతో) ఓరి! మాట్టాడుతావుండదంట్రా! యిదేయి అమ్మోరురా? గుళ్లో యిగ్గిరం యెలిశిందనుకొన్నానురా. ఓరి నీయెటిగూల. అమ్మోరు

మాట్లాడుద్దంట్రా! చరేలే. మెకాలతో మా మంద మన్నయిపోయి యేడుస్తా వుంటే అమ్మోరమ్మోరంట్రా యిదొక్క గొడవ తెచ్చిపెట్రా వేయిటిగా?

వెట్టి—మెకాల కేం శాద్దామురా?

పిచ్చి—రాజుగారి కాడి కెల్లి, శెప్పుకొందాము రండ్రా. ఆయినొస్తే యీటంటిని నుగ్గు శేశి పారేస్తాఁడు.

వెట్టి—అవునురా, తలావక దోసకాయి తీసుకోండ్రా. ఆరికిచ్చి శెప్పుకొదాం.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

(ఇది ప్రవేశకము.)

రంగము - రుక్మాంగదుని సభ.

ప్రవేశము:—రుక్మాంగదుఁడు, గుణనిధియను మంత్రి, సేవకుఁడు.

రుక్మా—మంత్రివరా! గుణనిధీ! మన పురమందలి ప్రజలెల్లరును ఎట్టికొఱంతయు లేక సౌఖ్యవంతులయి వర్ధిల్లుచున్నవారలే?

గుణ—ప్రభువరా! అందుకు సందియమేమి? వేద వేదాంత వేదాంగోపవేద శాస్త్ర పురాణేతిహాస కావ్య నాటకాలంకారాదులనెల్లఁ దా మనయం బతి శ్రద్ధా భక్తులతోఁ బఠియింపుచు వానినెల్లఁ దమ శిష్యపరంపరలకు సదాబోధింపుచుంట యందతి కుతూహల మానసులై యొప్పు బ్రాహ్మణశ్రేష్ఠులును, దమ యవక్రవిక్రమంబున నబ్బలపరాక్రమ శాలియగు కుమారునైన మాఱులేక మీఱఁగల్గు సుకుమారులగు రాకొమరులును, కృషివాణిజ్యాదులయం దోర్పునేర్పులు కలిగి ధర్మమార్గంబుఁదప్పక ధనార్జనము సేయుచు సమితైశ్వర్యసంపన్నులై చెన్నొందు వైశ్యకులాగ్రగణ్యులును, బ్రాహ్మణాది కుల త్రయమువారికి శాస్త్రోక్తముగ వలయు సపర్యల నతి వినయ భయ భక్తులతో నొనరింపుచు సదా వారల మెప్పు వడయుచుండు శూద్రకులావతంసులును, మఱియు నీ మొదలగు వార లెల్లరను సుఖంబుగ వర్ధిల్లుచున్నవారలు.

రుక్మా—మన దీనపోష కాలయంబున నశేక్తుల కెల్లరకును వలయు నుపచారంబు లనుకూలంబుగ జరగుచుండెనే?

గుణ—దేవర యాజ్ఞాను సరణంబుగ నొక్కింతయుఁ గొఱంతలేకయే జరగుచున్నవి.

వారెల్లరు దేవర యౌదార్యంబును వేనోళ్ళఁ బొగడుచు వాసందించుచున్నవారు.

రుక్మా—మన ధర్మవైద్యవిద్యాశాలలు సర్వజనోపయోగకరంబులై వెలయుచున్నవే?

గుణ—సర్వజనులకు నమిత సౌఖ్యజ్ఞానదాయకంబులై చెన్నొందుచున్నవి. వీనిచే దేవరవారు శిష్టజనాశీర్వాదపాత్రు లగుచున్నారు.

రుక్మా—మన యరణ్యమందలి పుళిందులు వనపాలురు లోనగు కాఁపు లెట్టులుండిరి?

(తెరలోపలఁ గలకలము.)

మంత్రీ! ఎచ్చటనో కలకలము వినవచ్చుచున్నదే. సేవకా! ఆ కలకలం బెచ్చటనో యరసిరమ్ము.

సేవ—చిత్తము దేవా. (అని పోయి చూచివచ్చి) దేవరను దర్శించుటకై పంటకాఁపు లరుదెంచిరి దేవా.

రుక్మా—అట్టు లయిన వారలను లోపలకు రానిమ్ము.

(పంటకాఁపులు ప్రవేశించి)

కాఁపు—మాప్రెబో! దండాలండి. దండాలండి. తమురు మాపొలాలకేశొచ్చి శానా లయింది. శేలన్నీ పాడయి పోతావుండయి. అడివి మెకాలొచ్చి పడ్డాయండి. అయ్యి పెద్దపుల్లు గావు, అయ్యి ఎలుగ్గొడ్లు గావు, అయ్యి అడివిపందులు గావు, నక్కలు గావు, సిమ్మాలు గావు, ఏమిచెప్పంబాబు! అయ్యన్నీ మా పానాలకి మిత్తువుల్లాగ వొచ్చి పడ్డాయుండి. బెమ్మదేవుఁడు యీ టంటినీ వొక్కపాలిగా మాకోసమే పుట్టించాఁడు లాగుండది ఖాబు. ఎట్టయిన తమురు ఒక్కపాలి దయశేసి ఆ టంటినీ నుగ్గుశేశి పారెయ్యాలి బాబు. లాకపోతే బతకలేము.

రుక్మా—మంత్రివరా! సింహ వ్యాఘ్ర భల్లూక వరాహ శరభ శార్దూలాది వనమృగ సముదాయంబులచేఁ దమ పంటపైరులెల్ల మంటఁగలియుచున్నవని మాటిమాటికిఁ గంటఁ దడిఁబెట్టుకొనుచు నీ పంటకాఁపులు మొఱలిడుచున్నవారు. కావున నేను సత్వరంబునఁ జని, యా మృగంబులనెల్లఁ దునుమాడి, వారల యాపద వారింపవలసి యున్నది. నేను మరలివచ్చునంతకొక్కింత తడవైనం గావచ్చును. అంతదనుక

గీ. నిఖిల భూమండలంబును ♦ నీదు బాహు
పీఠి వహియించి ప్రజలపై ♦ ప్రేమ నించి

పిన్న పెద్దల మన్నించి ♦ వన్నెఁ గాంచి
యేలుచుండుమి యెల్లరు ♦ మే లనంగ. 1

ఉ. ప్రెగ్గడవీవు, బుద్ధిగతిఁ ♦ బెద్దవు, నైన వచింతు; రాజ్యమం
దగ్గలమైన కూర్మి తన ♦ రారఁగఁ జేయుము; గౌరవంబునన్
లగ్గుగ సాదులన్ విబుధు ♦ లన్ దనియింపుము; కీర్తిఁ బెంపుమీ;
యెగ్గతినైన వారి ముద ♦ మే సకలార్థద మం చెఱుంగుమీ. 2

ఉ. ఏ నొనరించు సువ్రతము ♦ నేగతి రాజ్యమునందు నెల్లెడన్
మానుగఁ జేయుచుండిరో జ ♦ నంబులు తద్గతిఁ దప్పకుండఁగన్
బూనిక హెచ్చరించుట వి ♦ భుత్వములోని జెకాఁ దలంపుమీ;
దాననె సద్గతుల్ కలుగు; ♦ దంధనముల్ నరలోక సంపదల్. 3

మంత్రి—మహాప్రసాదము రాజేంద్రా! దేవర చిత్తంబున కెన్నండైన మాఱుకలదా?
తమ యాజ్ఞల శిరసున వహించి యట్లే చేయువాఁడ.

రుక్మా—మంచిది. కాఁపులారా! మీరు భయమునొందక పొండు. నేను వచ్చి యా
మృగంబుల నెల్లఁ దెగటార్చెద. మంత్రీ! నే నింకఁ బోయివచ్చెద.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయ రంగము - అరణ్యము.

(విల్లు నమ్ములు తీసికొని రాజును, సేవకుఁడును, కాఁపులును,
సముచిత పరివారంబును ప్రవేశించుచున్నారు.)

రుక్మా—సేవకా, యీచిత్రముఁ జూచితివా?

ఉ. ఎన్నఁడు మానవాళి నొక ♦ యింత యెఱుంగని యీకురంగముల్
కన్నులవింతగా మనలఁ ♦ గాంచిన యంతనె భీతిఁజెందుచున్
గ్రన్నన వాయువేగమునఁ ♦ గా లిల మోపనియట్లు ఱిచ్చవన్
వన్నెలుకుల్కఁగా నెటులు ♦ పాఱుచునున్న వొ చూడు మీదెసన్

సేవ—చిత్తము. చెంగు చెంగు మని యుఱుకుచున్నవండి.

రుక్మాం—సేవకా! ఈ యడవిపంది యెంత క్రొవ్వినది!

ఉ. అక్కటయీమృగంబు కడు ♦ హాయిగఁ గాఁపుల పైరుపచ్చలన్
జక్కఁగ మెక్కి క్రొవ్వి యది ♦ చాలక యల్లదె! చూడు! చూడు! నీ
మిక్కిలి నిన్ను నన్నొకట ♦ మ్రింగెడురీతిని ఛీత్కరించు; నేఁ
డొక్కశరాన దీని నిట ♦ నుక్కడఁగించెదఁ జూడు వేగమే. 5

సేవ—అవునండి. క్రొవ్విందండి. చంపెయ్యాలిసిందే. రేపు కూరకైనా వస్తుంది. నా కొక్క తొడ మాత్ర మిప్పించండి.

రుక్మా—ఛీ నీచా! యుక్తాయుక్తవిచారజ్ఞానముగల మానవజన్మం బెత్తి వ్యాఘ్రజంబుకాదివనమృగంబుల వలె జీవహింసచేత నేల పొట్ట నింపుకొనవలెను? ఆయురారోగ్యకరములగు పాలు, పండ్లు, చక్కెరలను భుజించిన మహానందజనకముగ నుండదా? ఇదికాక

గీ. శిష్టసంరక్షణంబును ♦ దుష్టనాశ
మొనరఁ గావింప నీ వేఁట ♦ యొప్పుఁ గాని
పొట్ట నిండింపఁగా నిట్లు ♦ పూనెనేని
నీచలుబ్ధుని కృత్యమై ♦ నెగడుఁ గాదె? 6

కావున దుష్టమృగసంహారంబుఁ గావించుటయే మనకుఁ గర్తవ్యంబు. సేవకా! యీమృగము పాఱిపోవ నుంకించుచున్నది. మీరందఱు నటుతిరిగి యడ్డము రండు. నేనీ వైపునుండి తఱుముకొనివచ్చెద. (అందఱును జాటునకుఁ బరుగెత్తుచున్నారు. విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విదూ—రాజుగారిని జూడఁగానే ప్రతివారును "విదూషకుండెక్కడ? విదూషకుండెక్కడ?" యనుచుందురు. ఈయనగారిప్పుడు కత్తులు కటారులు ధరించి యీ తుంటరిమృగములపై కంటగించి వెంటనంటి ముక్కంటివింటి పోటులంబలె యంటరాని మంటలెగయు దంటపోటులఁ బెక్కంటి మంటగలుపుచున్నవాఁడు. అబ్బో! ఇంటనొంటిగఁ బడియుండక యీతని వెంట నాకీ తంటలేల? యీవెంట నొక పొదరింటనుండి యీతఁడు శాంతుఁడైయుంటఁ నాకంట గాంచిన వెంటనే వచ్చెదను. (అని మఱుఁగున కరుగుచున్నాఁడు.)

(రుక్మాంగదుఁడును, సేవకుఁడును మరలఁ బ్రవేశించుచున్నారు.)

రుక్మాం—సేవకా? ఇఁక మృగంబు లెచ్చటను గనపచ్చుటలేదు. అన్నియు మడిసి నట్టులే యున్నవి.

సేవ—చిత్తము. చచ్చిపోయినవండి.

రుక్మాం—అబ్బా! యిప్పటికిఁగదా నా చిత్తమునకు విశ్రాంతిఁ గంటిని!

(విదూషకుఁడు సమీపించుచున్నాఁడు.)

రుక్మాం—మిత్రమా? విదూషకా! ఇంతసేపెచటనుంటివి?

విదూ—ఈ సమీపమందే యుంటిని. కాని యింతసేపటినుండి మీరును, మీపరిజనులును ఈచుట్టుప్రక్కల నంతటను మృగంబుల వేఁటాడుచుంటచేత ఆమృగంబులకు వెఱచియు, ఆసమయమందు మిమ్ము సమీపించుటకు వెఱచియు, మా తాతమ్మను మరలఁ జూచెడు ప్రాప్త మున్నదో లేదో యని ప్రాణములు మూట కట్టుకొని యొక పొదచాటునఁ గూర్చున్నాను. ఇప్పుడు మీచేత నామృగము లన్నియు మడియుటచేతను, మీ రిప్పుడు శాంతచిత్తులై యుండుటచేతను మెల్లఁగా బయలుదేరి వచ్చితిని.

రుక్మాం—ఆలాగా? ఎంతపిఱికివాఁడవు!

విదూ—పిఱికివాఁడనా? మొన్న తమ దివాణములో ద్వాదశీ పారణ సమయమందుఁ జూచినఁ గనఁబడియుండును నా ప్రతాపము. పంక్తిక్రిందఁ బెట్టిన గారెముక్కను మరలఁ గనఁబడనిచ్చితినా? మీ ప్రతాప మిక్కడ. నా ప్రతాప మక్కడ.

రుక్మాం—బ్రాహ్మణుఁడవు గనుక భోజనకాలమందు నీకుఁ బ్రతాప ముండవలసినదే.

విదూ—భోజనకాలమందు మాత్రమేనా? మొన్న మీ దివాణపు కుక్క తఱుము కొని వచ్చినప్పుడు నేను ఎగఁబడి పరుగెత్తుచుండఁగాఁ జూచి యందఱును ముక్కున వ్రేలు వేసికొనలేదా? కాని దానికేమైన దొరకితినా? అది మఱింత దగ్గరకు వచ్చినప్పుడు నేను కూలఁబడి లబ లబ లబో అఱచేటప్పటికి దాని గోలకన్న నాగోల యెక్కువయినదని యదరి యదే నిలువఁబడి పోయినది. నాకేమైనఁ బ్రజ్ఞలలోఁ దక్కువనుకొన్నారా యేమి!

రుక్మా—మిత్రమా! లెస్సగఁ గాచి పూచిన యీవన మెంతరమణీయముగ నున్నది!

విదూ—అయ్యోరాజా! నీవు దీనికే సంతోషించుచున్నావటయ్యా! మా యింటి

పొరుగున నొక వనముఁ జూచినాను. ఎఱ్ఱగాఁ బారాణి ముద్దలవంటి పండ్లతోను, బసుపుముద్దలవంటి పుష్పములతోను, జంధ్యాలు వడుకు కదుళ్ళవంటి దివ్యమైన ముండ్లతోను, విసనకఱ్ఱలవంటి మట్టలతోను, పేదబ్రాహ్మణ గృహమువలెఁ జూచుట కెంతరమణీయముగనున్నది? అది దొడ్డిచుట్టున నుండు నెడ దొడ్డిలోని కొక్కుపంది యైన రాఁజాలదు.

రుక్మా—దాని పేరేమి?

విదూ—దానిపేరా? రక్కసవనమని మావాళ్ళు ముద్దుముద్దుగఁ బిలుతురు.

రుక్మా—కమ్మని పుష్పాసవమ్మెల్లరయమ్మున మెక్కి, చెవులు బమ్మెరవోవ తుమ్మెద లేఁడెట్లు జుమ్మని రొదసేయుచుండెనో కాంచుము.

విదూ—నే నింతకంటె నెక్కుడుగ నేవిన్నాను. మావీధిని నిన్న రాత్రి యంతయు బుంయ్ బుంయ్ అని ప్రత్తిరాటములు మ్రోగుచుంటే యీ రొద దీనికంటె బదిరెట్లెక్కుడుగ నుండినది.

రుక్మా—మకరందాపేక్షచేత నీ తుమ్మెదసమూహ మా పద్మవనమ్ముపై నెట్టులు క్రమ్ముచున్నదో చూడుము!

విదూ—ఓ యబ్బో! మొన్న మాయూరి వనసంతర్పణమందు సరియైన పెత్తనము లోపమగుటచేత నల్పజాతులవా రెల్లరు నగ్రజాతులవారి భోజనపంక్తులమీద నింతకన్న నెక్కుడుగఁ గ్రమ్ముకొనిరి.

రుక్మా—మిత్రమా! యీ వంకఁ జూడుము.

ఉ. అల్లదొ పత్రవృంతముల ♦ నల్లన యూఁచి శ్రమంబుఁ దీర్చుచున్
గొల్లగ సత్ఫలంబు లివి ♦ కొమ్మనురీతి శిరంబు వంచుచున్
సల్లలిత ప్రసూనముల ♦ శయ్య నమర్చి మహోదరంబునన్
బెల్లుగ భృంగరావములఁ ♦ బిల్చెడు రంభను గంటె మిత్రుడా? 7

విదూ—రాజా! నీచిత్తము నేఁడు రంభాభోగము నపేక్షించుచున్నదే! సరి సరి! రంభైతే నేమి? రంభ చెల్లెలైతే నేమి? పిలిచినమాత్రముచేత నమ్మి నీవు చెంతకుఁ బోవచ్చునటయ్యా? ఆ రంభ తానే నీ యొద్దకు రారాదా?

విదూ—అస్వాభావిక మేమి? కాళ్ళు లేవా? కన్నులు లేవా?

రుక్మా—రంభ యనఁగా నేమనుకొనుచుంటివి? అరటిచెట్టు నుద్దేశించి నేను పల్కుచుంటిని సుమా.

విదూ—(నవ్వుచూ) అయ్యోరాజా! అలాగటయ్యా? నీవు రంభయనుటతోనే చెక్కపేడువంటి చక్కని మోము కలిగి, గుజ్జుప్రజాలువంటి మెత్తని కురులు కలిగి, చింతాకులవలె విశాలమయిన కండ్లు కలిగి, రంభవలె నెదురుగావచ్చు నా భార్య జ్ఞప్తికివచ్చి, యింత సేపటినుండి నామనసు కు డి తి కు ం డ లోఁ బడిన యెలుకపిల్లవలెనే తత్తరపడుచున్నది. (ఆలోచించి తలయూఁచి) ఏలయోకాని సంకల్పసిద్ధుఁడవగు నీ వాక్కున నీ దినమందు రంభయనియు, శయ్య యనియు నిత్యాది వాక్యములు వెలువడినవి. ఎట్లయినను మహారాజవయ్యా నీకేమి.

రుక్మా—చెలికాఁడా? నాకు బడలికగా నున్నది. కొంచెము నే పీయశోకంబు నీడను విశ్రమించి నేదఁ దీర్చుకొనియెద. (అని పరున్నాఁడు.)

విదూ—చిత్తము. నేనును ఈ సమీపమందే కూర్చుండియుండెదను.

(అని యెడ కలుగఁ బోవుచున్నాఁడు.)

(మోహిని ప్రవేశించుచున్నది.)

మోహి—ఆహా? నాజనకునియొద్ద నెన్నియో పంతంబు లాడి వచ్చితి. ఈ రాజేంద్రు నెట్టులు వశవర్తిఁగాఁ జేసికొనఁ గలుగుదునో. అయినను జనకుని పనుపున నరు దెంచిన మరుండొక్కరుండు మాత్రము తన బలంబులతోడ నాకు సహాయకరుండై యుండుఁగదా.

(తెరలో)

ఓహో పరివార జనంబులారా! మనప్రభుండగు రుక్మాంగదమహారాజుగారు వేటాడి యలసి యీ యశోకంబునీడను విశ్రమించియున్నారు. ఇప్పుడే మీరు పోయి మీ మీ యవశ్యకృత్యంబులఁ దీర్చుకొని మరల సత్వరంబున నరుదెందు పొండు.

మోహి—(ఆలకించి) ఏమీ? రుక్మాంగదుఁ డిచటనే యుండెనా?(అని హర్షముతో నటునిటు చూచి) ఇచట నెవ్వరో నిదురించి యున్నారు. ఈతఁడే రుక్మాంగ దుండై యుండునా? (అని కొంచెము సమీపముగా నరిగి పరీక్షించి) నా జన

కుండు తెల్పిన రూపరేఖాదులీతనియందగపడుచున్నవి. ఈతఁడు కిరీటధారియై యున్నవాఁడు. ఆవలినుండి పరిజనులు "ఈ యశోకంబునీడను నిదురించుచుండెను" అని రుక్మాంగదునిం జేరఁగోరుచున్నారు. కావున నీతఁడే రుక్మాంగదుండు. మృగయా వినోదంబున నలసి సొలసి యీ యశోకంబునీడ నశోకుండై గాఢనిద్రం జెందియున్నవాఁడు. (అని యాలోచించుచు) ఇపుడు కర్తవ్యం బేమి? నే నేమిచేయుదును? ఈతని నెట్లు సమీపింతును? ఈతండు వ్రతనిష్ఠుండనియు ధీరుండనియు నాజనకుండు ముందే తెల్పియుండె. ఇట్టి యీతండు నాకెట్లు వశుఁడగును? నా జనకునియొద్ద వారువీరనక నూరక నోరికివచ్చినట్టులు కాఱులాడివచ్చితి. ఇవ్విధంబున సాటిపువ్వుఁబోఁడులలో నేను నవ్వులపాలు కానుంటిఁ గాఁబోలు.

(తెరలో)

ఏమి యీ వింత! ఈమె నా సామర్థ్యము నింకను గుర్తెఱుఁగనట్లు కనఁబడుచున్నదే.

మోహి—(అలకించి తనలో) ఎవ్వరా భాషించువారు? (అని యాలోచించి) ఓహో, మన్మథుఁడా.

(మరలఁ దెరలో)

చ. హరుఁడొక యర్ధదేహము ద్రి ♦ యాంగన కర్పణచేసె; మేటిమందరధరుఁడుర్వహృద్బ్జమున ♦ ధాత ముఖంబునఁ దాల్చిరింతులన్;
మఱుఁడనుమాత్రనే త్రిభువ ♦ నప్రభువశ్యులె యిట్లు కాఁగ, భూవరుఁడన నెంతవాఁడు సుమ ♦ బాణపరంపర దాఁకఁజొచ్చినన్. 3

మోహి—ఔనౌను. సుమసాయకా! నీ పరాక్రమము నే నెఱుంగుదును. త్రిలోకవిజయుండను బిరుదు నీకే తగును గదా. (అని తనలో) ఔరా, మదనుఁడెంతగ నొచ్చుకొనెను! స్వప్రయోజకత్వనిరసన మెవ్వరికిని దుర్భరము కదా. అయినను నే నూరక సంశయించుటయె కాని యీ రాజేంద్రుండు వశుండు గాక యుండునా.

చ. విలు చెవిక్రంటఁనీడ్చి వెడ ♦ విల్తుఁ డురమ్మున వ్రణమ్ము సేయఁగన్
మలయుచు గాఢయౌవనత ♦ మఃపటలంబొగిఁ గన్లఁ గప్పఁగన్

గలకలనవ్వుచుఁ జెలి యొ ♦ కర్తుక చెంగట సొంపు నింపఁగన్
వలవకయుండ వీని మది ♦ వజ్రమొ, లోహమొ, రాయొ, చూచెదన్

ఈతని వశపఱుచుకొనుట కిదియే మంచిసమయమని తలంచెద. ఏలయన [15] నిచ్చటి శుకపికంబుల కలకలారావంబులును, తుమ్మెదల ఝుంకారంబులును, మలయానిలంపు సోఁకులును, కేకిగముల కేకలును, పూఁదెనెకాల్వలునుఁ జూడ నెట్టి విరాగులనైన సరాగులఁగావింప సమర్థంబులై కన్పట్టుచున్నయవి. ఇట్టి వనమధ్యంబున నీ రాజేంద్రుం డొంటరిపాటుగ నుండుతఱి నీతని దృష్టిపథంబునం బడుటకన్న నెక్కుడగు సమయం బిం కెట్లు లభింపఁగలదు? అయినను

సీ. పరుచెంతకును దాన ♦ పడఁతి పోఁగూడదు
కూడినఁ దానె మా ♦ టాడఁ జనదు
ఆడిన సరసంబు ♦ లాడఁగాఁ జెల్లదు
చెల్లిన మర్మంబుఁ ♦ జెప్పఁ దగదు
చెప్పిన నాసించి ♦ చెల్మి కోరఁగ రాదు
కోరినఁ దానె పై ♦ కొనఁగఁ జనదు
పైకొన్న నాత్మలో ♦ భ్రమఁ జెంద నొప్పదు
చెందిన వానిచేఁ ♦ జిక్కరాదు

గీ. వాని చెంతకుఁ బోనేల ♦ పలుకనేల?
భ్రాంతిపడనేల? మరియేమొ ♦ బాధ లేల?
చాన యొక్కింత క్రీఁగంట ♦ సైగ సేయఁ
బసుగు వెట్టుచు నతఁడె రా ♦ వలదె వెంట?.

నేను త్వరపడి యీతని యెదుటికిం జనఁగూడదు. ఎట్లయిన నాతనినే యిచటికి రప్పింపవలయు. కావున నీ సంపగివృక్షంబునీడం గూర్చుండి యొక్కపాటఁ బాడెద. దీనిచేత నీ రాజేంద్రునకు మెలఁకువ కలిగిన పిమ్మట నీతని మనోవ్యాపారంబు లెట్లుండునో చూచి యప్పటి కనుగుణంబగు రీతిని వర్తించెద.

(అని యొకప్రక్కగాఁ గూర్చుండి పాడుచున్నది.)

—*ద్విపద.- ఖమాచి రాగము.- ఏకతాళము.- మిశ్రజాతి*—

[16] అల్లరిమారుని ♦ యలయికలకును
బెల్లుగ వడఁకి ని ♦ న్వేఁటపాటుఁ జెంది
మల్లడిఁగొనియెడు ♦ మానినీమణుల
నల్లిబిల్లిగ నేలు ♦ నతఁడె ఘనుండు.

రుక్మాం—(సగము లేచి అటునిటు మాచి తనలో) ఎచ్చటనో వీణాగానంబు వి వచ్చుచున్నది. (అని యంతలో మరల వినఁబడకుండుటం జేసి) లేదే. కలగంటి గాఁబోలు. (అని మరలఁ బండుకొనుచున్నాఁడు.)

మోహి—(కొమ్మలచాటుననుండి చూచి, తల పంకించి, మరల)

మక్కువఁ గలచెలి ♦ మడుపు లిచ్చుచును
ప్రక్కనిలిచి ముద్దు ♦ పల్కులు పల్క
గ్రక్కునఁ బైకొని ♦ కౌఁగిట నలము
చక్కని సామియె ♦ సరసుఁ డెన్నంగ.

రుక్మాం—(ఆశ్చర్యముతో లేచి కూరుచుండి) మఱియు వినవచ్చుచున్నదే! ఇ కలకాదు. ఎవ్వరో నిజముగ నే గానము సేయుచున్నట్లు లున్నది. ఈ నిర్జనాట మధ్యంబున నెవ్వరు గానము సేయవత్తురు? అయిన నింకఁ గొంచె మాలకించి, దీ వివరం బెఱింగెద.

మోహి—ఆటపాటలను స ♦ య్యాటలఁ జూపి
నీటుకాఁ డంచును ♦ నెఱజాణ యంచు
మాటికి యువతుల ♦ మాన్యతఁ గనిన
మేటియే చర్చింప ♦ మిగుల ధన్యుండు.

రుక్మాం—ఇది యేమో స్త్రీకంఠముగా వినవచ్చుచున్నదే! ఎవ్వరో స్త్రీలు తమ శారీరంబునకు వీణియం జతచేసికొని, జంత్రగాత్రంబుల సమంబుగఁ గానంబు సేయుచున్నట్లు తోఁచెడిని. అయిన స్త్రీ లీ విపినమధ్యంబునకు రాఁ బనియేమి! దీనికి గతం బేమైయుండునో?

మోహి.—చెంతనిలుచు ముద్దు ♦ చెలుల నెవ్వేళ
వింత లొనర్చి, బల్ ♦ వేడ్కలఁ దేల్చి,
కంతురాజ్యము చూఱఁ ♦ గాఁగొన్న ఘనుఁడు
వంతమేటికి భగ ♦ వంతుఁడ తలఁప.

రుక్మా—(మహానందముతో)

ఉ. బళిరా! యీమృదుగానవైఖరులు, నీ ♦ భావార్థసందర్భముల్
బళిరా! యీపదసౌష్టవంబు, ఫణుతుల్ ♦ మర్త్యాంగనల్ నేర్తురే?
అలపద్మాక్షులగానముల్ వినమె? యీ ♦ యానందముం జెందమే?
కలదే యీసుఖ, మీ రసంబు రుచి యీ ♦ కంఠస్వరం బచ్చటన్?.

కాన దేవతాగణంబులలో నెవ్వరైన విహారార్థముగ నిటు పోవుచుఁ బాడుకొనుచుండిరేమొ.

మోహి.—(లేచి, రాజునకుఁ గొంచెముకొంచె మగపడునట్లు కొమ్మలఁ జాటుచేసికొనుచు, నొక్క ప్రక్కనుండి మఱియొక ప్రక్కకుఁ బోవుచున్నది.)

రుక్మా—ఆహా యిది యేమి! నా కన్నులయెదుట నేమొ మెఱసిన ట్లున్నదే! ఇది యేమైయుండును. అయినను గొంచెము సమీపముగా నరిగి నిజం బెఱింగెద. (అని సమీపించి చూచి యాశ్చర్యముతోఁ దనలో) ఓహో! యిది యెవ్వరో స్త్రీయైయున్నది. ఈ సుందరాంగి యెవ్వరైనను దీని రూప యౌవన సౌందర్యంబులు మాత్రము నా కనులకుఁ బండువుసేయుచున్నవి. సెబాస్! చక్కదనం బన్న నిట్టు లుండవలయు!

క. ఈ పడఁతి వగ యొయ్యారము
రూపము నవయౌవనము ని ♦ రూఢ సుతేజం
బే పురుషుఁడు కని మనసిజు
రాపులఁ బడకుండు ని ద్ధ ♦ రావలయమునన్. 16

ఉ. పాటలగంధిమోవి పరి ♦ పాటిగఁ గెంపనఁజెల్లు, మోము ము
మ్మాటికిఁ జంద్రుఁడే, తిలసు ♦ మంబగునాసిక, మిన్నకొను, పె

క్కోటికి యీ మృగాక్షి సాగ ♦ సెన్నఁగ బ్రహ్మకు నౌనె? యూరకే
మాటల కేమి? దీని సరి ♦ మానినిఁ గానఁగనౌనె? ధారుణిన్. 17

ఉ. అప్పరమేష్ఠి యేరిను కృ ♦ తార్థునిఁ జేయఁ దలంచియో, భువిన్
గొప్పతనంబుఁ జూపుకొనఁ ♦ గోరుచునో, తన సృష్టినెపుడెం
దప్పక యీ మృగాక్షిని టు ♦ తద్దయుఁ గోరి సృజించెనాఁగ, హా!
యొప్పుగఁ దీర్చి దిద్దినటు ♦ లున్నవి దీని తనూవిలాసముల్. 18

ఔరా యి దేమిచిత్రము! ఎవ్వరినో పరకాంత నిచటఁ గాంచి నేను వర్ణింపు చుంటినా! ఇది యెంత గర్హితము! చిత్తమా! ఏల నన్నీ లీలఁ దూలఁజేయుచుంటివి.

చ. జగమున నన్యకామినుల ♦ సంగతి కూడదు కూడదంచుఁ, బె
న్వగలకు మూలమంచుఁ, గడుఁ ♦ బాతకమంచు, ననర్థమంచు, నె
న్నఁగ బహుదూష్యమంచు విని ♦ నాఁడను బెద్దలు తెల్ప; నక్కటా
తగదిది; నన్ను నీ పనికిఁ ♦ దార్పకు చిత్తము! నీకు మ్రొక్కెదన్.

చ. అగడు ఘటించు లోకమున; ♦ నార్యులు మెచ్చరు; పిన్న పెద్దలున్
దగదని మందలించెదరు; ♦ తండ్రి యదల్చును; తల్లితిట్టెదున్?
బగతురు గేలిసేయుదురు; ♦ బందుగు లోర్వరు; కాన నక్కటా
తగదిది; నన్ను నీపనికి ♦ దార్పకు చిత్తము! నీకు మ్రొక్కెదన్.

(అని కొంచెము సేపాలోచించుచు నిలిచి మరలఁ దనలో) అయినను గొంచెము సమీపముగా నరిగి యీ తరుణి యెవ్వరో, ఇట్టు లొంటరితనంబున నరణ్యంబులం గ్రుమ్మర గతంబేమో విచారించెద. (అనుచు నడుచుచున్నాఁడు.)

విదూ—(ఈ పల్కులు చెట్లచాటుననుండి వినుచుఁ దనలో) శ్లో. బలవా నింద్రియ గ్రామో విద్వాంసమపి కర్షతి. అని చెప్పఁబడిన యార్యోక్తి వ్యర్థమగునా? అయినను నా కేల? నే నరిగెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

రుక్మాం—(క్రొంచెము సమీపముగాఁ జని మోహినిం గాంచి.)[17] తరుణీ నీవెవ్వరి దానవు? నీ జననిని నామం బెయ్యది? నీ వరుం డెవ్వరుండు? శరభశార్దూలాది నానావిధ దుష్టజంతుసంతానమ్ములకెల్ల నాకరమ్మయి భీకరమ్మగు నియ్యరణ్య

మధ్యమ్మున నీ వేమికతమ్మున నేకతమ్మ క్రుమ్మరుచుంటివి? అబ్జవదనా! అల చందమామ యందమ్మునైనఁ గ్రిందుపఱుపసమర్థంబగు నీ మందహాసాంచిత సుందరవదనారవిందంబు నీ వేఁడివెలుంగుల తేని వెలుంగుల కేల లోనుఁజేసితివి? నిక్కంబు వక్కాణింపుము.

మోహి—నేను బ్రహ్మమానసపుత్త్రిని. మోహిని యను నామంబునబరఁగుదాన. నాకు మగం డెవ్వరుండు లేఁడు. మజ్జనకు ననుమతంబున. నీచేరువ దేవళమందలి యిష్ట కామేశ్వరునారాధింపుచు నివ్వనప్రదేశంబున స్వేచ్ఛావిహారంబున నుండుదాన. పరపురుషుని కన్నెత్తియైనఁ జూచియెఱుఁగ.* ఇట్టి మాబోఁట్లతో మీకుఁ బ్రసంగంబులేల? మాది మందహాసాంచితవదనమైన మీకేల? యమందహాసాంచితవదనమైన మీకేల? మీర లెవ్వరో యేమి కారణంబున వచ్చితిరో విచారించుకొని మీదారిని మీరు పోవుట యుత్తమంబగు. కాని యేకాంతంబుననుండు నింతుల చెంతలఁ జేరి వింతవింతల నాడు టెంతయుఁ జనదని యెఱుంగుఁడు.

రుక్మా—(తనలో) ఈ కాంత పలుకరించినమాత్రముననే తిరస్కార భావము జూపుచున్నది. కావున నెట్లయిన నేని ధరాధీశుండ నని యిపు డెఱిఁగించుట యుక్తంబని తోఁచుచున్నది. (ప్రకాశముగా) తరుణీ! "మీర లెవ్వరో యేమి కారణంబున వచ్చితిరో" యంటివి. చక్కఁగా నడిగితివి. స్త్రీలు సమయోచిత ప్రసంగంబులందు నేర్పరులౌట జగత్ప్రసిద్ధమే కద. విధితనయా! ఎఱింగింతు వినుము.

గీ. వనమృగంబుల బారికిఁ ♦ గనలి నాడు
పురజనంబులు బెగడొంది ♦ మొరలు వెట్ట
సరగ శ్రమములఁ దొరఁగించి ♦ సాధుజనులఁ
గావ నరుదెంచినాఁడ రు ♦ క్మాంగదుండ.

మోహి—ఓహో! నీవు రుక్మాంగద భూపాలుండవా? సరి సరి.

రుక్మా—మఱికొంచె మాలకింపుము.

గీ. రమణి! మ దధీనమగు నిట్టి ♦ రాజ్య భూమి
నబల లేలయొ వెంటఁ దోఁ ♦ డెన లేక

యెంటి వనములఁ గ్రుమ్మరు ♦ చుంటఁ గాంచి,
యోర్చి, యన్యనిగతి నూర ♦ కుండఁ గలనె? 22

ఇదికాక మందయానా! ఏమికారణంబుననో కాని నిన్నుఁ జూచినదాదిగ నీయందు నా కపరిమితానురాగంబు కల్గుచున్నది. చంద్రముఖీ! నీ ముఖావలోకనంబుఁ జేసినమాత్రంబున నా బంధుమిత్రాదుల నెల్లరఁ జూచి నంతటి యానందంబు కలుగుచున్నది. చిలుకలకొలికీ! పలుకుపలుకునఁ దేనె లొలుకు నీ వచనామృత పానంబుచేఁ జొక్కి మ న్మనంబెల్లఁ బరవశత్వంబు నొందుచున్నది. ఇంతయేల? చూడఁజూడ నాశరీరంబే నీకు దాసత్వంబునకై యర్పణంబు చేసిన సార్థకం బగునని తోఁచెడిని. కురంగనేత్రీ! నీ వేల యిట్లు బెదరి బెదరి చూచుచు దూరంబున నిలిచెదవు?

గీ. అతివ! నీ విట్లు చిరకాల ♦ మట్టె నిలిచి
ముచ్చటలు సల్ప నా మేను ♦ నొచ్చు చుండె;
తరుణి! పెరవాఁడ నేఁ గాను; ♦ ధరణివిభుఁడ;
ముదముతో నిటఁ గూరుచుం ♦ డెదవు రమ్మ. 23

(అని చేయి పట్టుకొనఁ బోవుచున్నాఁడు.)

మోహి.—(కోపముతో వెనుకకుఁబోయి) ఛీ! దంభజ్ఞాన ధురంధరా! [18]

ఉ. కన్నులుకానరావ? పర ♦ కాంతలటం చనుకోవ? యెట్టి సం
పన్నులకేని యిట్లగునె, ♦ భావ్య మెఱుంగఁగ లేవ? దొడ్డ రా
జన్నునుసీవ! చాలు, ఘన ♦ మైనది రాచరికంబు; పొమ్మ, నీ
కన్నెలు సూర్య రింట నినుఁ ♦ గానక పాప మదెట్లులుండిరో.

చాలుఁజాలు రాజేంద్రా! దూరంబున నిలువుము. పరనారియటంచు వెఱ పింతయు లేక బిరబిర దరిఁజేరి కరంబు పట్టవచ్చెదవుగా! ఇవియేనా మీ రాచరికంపు మర్యాదలు? రాజ్యమదాంధకారం బేమైనఁ గన్నులఁ గప్పెనా యేమి! రాజఁట! రాజాధిరాజఁట! దినరాజ వంశజుండఁట! ధర్మాధర్మ విచారణా దక్షుండఁట! పరసతుల నొంటరిపాటునఁ గన్నతటి ని త్తెఱంగున వెంట

నంటి ముట్టవచ్చునఁట. చాలుఁజాలు. నీ రాజత్వంబున కెంతయు సంతసించితి. చెలీ యాటంచుఁ జేరవచ్చెదవుగా! బాగుబాగు. నీవు పిన్ననాఁటనుండి చదివిన చదువులెల్ల నిప్పుడొక్క యరగడియలోనఁ జెల్లుఁగ వల్లించితివి. మిక్కిలి యలసితివి కాఁబోలు. సత్వరంబున నీ పురంబునకుఁ బొమ్ము.

రుక్మాం—ముద్దుగుమ్మా! నీ వేల నన్నిట్టులు తూలనాడెదవు?

ఉ. కల్లలు కావు; నిన్గనులఁ ♦ గాంచినదాదిగఁ బుష్పబాణుఁడై
యల్లరిమన్మథుండు నను ♦ నారడివెట్టెడు నోర్వఁజాల; ను
త్ఫుల్లసరోరుహాక్షి! కడుఁ ♦ బుణ్యము నీ కగు నాదరింపవే;
చల్లకువచ్చి ముంత నిఁక ♦ చంకను దాఁపఁగ నేల? తెల్పితిన్.

అహింసా పరమో ధర్మ యను న్యాయానుసరణంబుగ నీ వొక్కింత దయం బూని నన్నుం జేపట్టి మారుఁడను వెనుభూతంబుచే నే నొందుచున్న యీ బాధ నివారింపకున్న నే నెవ్వరివాఁడనగుదు. నేను బరసతిని ముట్టితినంటివి. నీకెవ్వండు వరుండు లేఁడని ముందే తెల్పితివికదా. నీ వెట్లు పరుని సతివి కాఁగలవు?

గీ. తరుణి! దాఁపఁగనేల? గాం ♦ ధర్వ విధిని
యట్టె పరిణయమై ననుఁ ♦ జెట్టఁ బట్టి;
ఠీవి భువికెల్లఁ బట్టపు ♦ దేవి కమ్ము;
మేలుఁ గైకొమ్ము; వేగ న ♦ న్నేలుకొమ్ము. 26

మదీయ పురమందలి యేనూర్వురు పరిచారికలచేత నూడిగంబులు గైకొమ్ము. నేను నీ సొమ్మనుకొమ్ము. నిజమ్ము. నమ్ము. కొమ్మా! సమయమ్మిదె సుమ్ము.

మోహి—[19] ఓహోహో రాజేంద్రా! ఎట్టిమాటఁ బల్కితివి! నీవు రుక్మాంగదుండ ననిన మాత్రంబుననే నీ సర్వంబు నెఱింగితి. నే నింతదనుకఁ దగిన వరునికై వెదకుచుండినందుకు గాంధర్వ వివాహంబున నిన్నా చేపట్టవలయు? నీకుఁ గల నూర్వురు సతులతో నన్ను నూటొక్కటెనుఁగాఁ జేయఁబూనితివి కాఁబోలు. మంచి సంబంధంబుఁ దెచ్చితివి. ఔరా! నే నిట్టి నూర్వురు సవతుల నొక్కచో సంపాదించుకొనుటకన్న నొక్క బండ మెడఁగట్టుకొని బావిలోఁ బడిన మేలుకాదే?

—* దశరాగ సంవాద సీసమాల. *—

రు—కల్యాణి! నీ కింత ♦ కాఠిన్య మేటికే?
నీ చెంతఁ జేర్చి మ ♦ న్నింపఁ గదవె
మో—బాగాయె రాజేంద్ర! ♦ ప్రభు చెంతఁ జేరుట
యల పాము తోడి స ♦ య్యాట మయ్యె
రు—మదనుఁ డమ్ముల నాఁటి ♦ యెద నేయ నార్తిఁ గ
లంగితిఁ గావు సా ♦ రంగ నేత్రి
మో—బళి! రాజరాజ! నీ ♦ భైరవార్తి యదెల్లఁ
బాయు నీ పురిత్రోవఁ ♦ బట్టు మయ్య
రు—బుద్ధి నీ వశమాటఁ ♦ బోవంగ నామది
కేదారి తోఁచదే ♦ యెమ్మెలాడి!
మో—ఆ వసంత జయంతు ♦ లా కంతుమూర్తి ర
క్షించెద రేమొ ప్రా ♦ ర్థింపు మయ్య
రు—అలివేణి నన్ను దుః ♦ ఖాంభోధి ముంచకే
చేపట్టి యొక దరిఁ ♦ జేర్పఁ గదవె
మో—దరిఁ జేర్ప గిరిఁ జేర్పఁ ♦ దగువారు నీదు ద
ర్బారునఁ గలరయ్య ♦ బారు తీరి
రు—గీ. నమ్మి నీవాఁడనని ప్రార్థ ♦ నమ్ము సల్పఁ
గన్నడ యిటుల చేసెదే ♦ కంజ నేత్రి?
మో—అక్కటా యీవె భూపతి ♦ వాట నిచట
వీలు లేదేమొ పైని య ♦ ప్పీల టంచు.



ఈ ప్రసంగము లింకఁ జాలును పొమ్ము.

రుక్మాం—సఖీ! ఎట్లుపోఁగలను? నిన్నెడఁబాసిన నిముసంబు యుగంబై తోఁచు! సుందరవదనా! నీ పొం దెడఁబాసిన యీ జన్మంబేల? నీచెంగటఁజేరి సుఖింపని

యీ వైభవంబేల?

ఉ. కామిని! రాజ్యమొల్లఁ; దుర ♦ గంబులనొల్ల; నిజంబు భామినీ
స్తోమమునొల్ల; నాదుప్రియ ♦ సూనునినొల్ల; సుఖంబునొల్ల; నే
నీమము నొల్ల; భోగముల ♦ నే నిఁక నెన్నఁడునొల్ల; నమ్ము మో
భామిని నీవు నన్నొగిఁ గృ ♦ పామతిఁ గౌఁగిటఁ జేర్చు కొండినన్.

నా నూర్వురు సతులతోఁ బాటు నిన్నొక్కతెనుఁగా జూతునని తలఁపకుము. వారి నెల్ల నీవు నా దృష్టిపథంబునఁ బడిన నిముసంబుననే నా మనంబునం ద్యజించితి. కావున నో సుందరదనా! నీ డెందంబున నట్టి సంశయంబు దిగనాడి గాంధర్వవివాహంబున నన్నుఁ జైకొనుము. నా రాజ్యంబెల్ల నీ యధీనంబు చేసెద. ఒక్కనిముసమైన నిన్నెడఁబాయక నీ యాజ్ఞానువర్తినై మెలంగువాఁడ.

మోహి—కైతవ వచనరచనా నైపుణ్యాభరణా! భూరమణా! నీకు సమయోచిత ప్రసంగంబులయందుఁ గల నేర్పరితనంబును గూడ నిచటఁ జూపఁదలంచితివా? చాలుఁ. నీ నేర్పరితనంబు లిచటఁ జెల్లవు నడువుము.

క. మాయలు, దౌష్ట్యము, తరుణో
పాయంబులు, దంభముల్, గృ ♦ పాహీనత, య
న్యాయము, పరవంచనముం
బాయని గుణగణము కాదె ♦ మగవారలకున్?. 29

ఉ. బంగరుకుండలంచు, సిత ♦ భానుఁడటంచును, మిన్నటంచు, ము
గ్ధాంగనలెల్లరం గని సు ♦ తారముగా భ్రమపెట్టఁజూచు నీ
వెంగలి పూరుషాళిదగు ♦ వేడ్క జగద్విదితంబ కాదె? హా
దొంగకుఁ దల్పుదీయుచును ♦ తోనె గృహస్థుల లేపు మాయకుల్

ఈ మగవారల స్వకార్యఘటనోపాయ ప్రసంగంబులు జగద్విఖ్యాతంబులు. ఇఁక రాజులన్ననో, అగ్నిహోత్రంబునకు వాయువు తోడైనట్లు, వీనికిఁ దోడుగ మహదైశ్వర్యాంధకారముచేతఁ గన్నుఁ గాననివారై శ్లాఘనుందురు. అట్టి రాజులంగూర్చి యింకఁ జెప్పనేల?

మ. కరుణా? నాస్తి; కటాక్షమా? నభము; రా ♦ గంబా? హుళిక్కే; మహా
త్తరసత్కార్యములా? యబద్ధము మహా ♦ దార్యంబ? శూన్యంబికన్
బరనారీధనవాంఛయా? ప్రబల; మ ♦ న్యాయాదులా? కొల్ల; యీ
ధరణీపాలుర నమ్మఁగానగునె దు ♦ స్తంత్రక్రియాలోలురన్. 31

శా. ఏ రామామణిఁ గాంచినన్ బ్రథమమం ♦ దెంతేఁ గృపన్ జూపుచున్
జేరం జేర్తురు; కౌఁగిలింతురు; తుదన్ ♦ జింతాబ్ధిలో ముంతు; రా
సీ రాజేంద్రుల కూరిముల్ దెలుపఁబె ♦ క్కేలా వృథావాక్యముల్?
నూఱేండ్లాయువు నిత్యగండమె యగున్ ♦ సోరెత్తఁ బైపెచ్చుగన్.

ఇట్టి వాక్యంబు లెవ్వ రెఱుంగరని కాఁబోలు! తన భార్యల నొల్లఁడఁట! నిముసంబైన నన్నెడఁబాయ కుండునఁట! రాజ్యంబెల్ల ధారవోయునఁట! ఇంక నేమేమో తలకుఁ బెట్టెడునఁట కుచ్చులకుళ్ళాయి.— ఏల యిట్టి వృథాప్రసంగంబులు? ఇవన్నియుఁ గట్టిపెట్టి రాజా నీ దారిని బొమ్ము.

రుక్మాం—[20] నారీమణీ! నే నేమో కల్లలాడుచుంటిననియు, నా వాక్యంబులు విశ్వాసపాత్రంబులు కావనియుం బల్కుచుంటివి. నే నట్లు కల్లలుపల్కువాఁడఁ గాను. నీవు కోరు విధంబునఁ బ్రమాణపూర్తిగఁ బల్కువాఁడ నని నమ్ముము.

మోహి—రాజేంద్రా! నీ వంతటి సత్యవాక్యపరిపాలనా ధురీణుఁడవా? అట్లయిన నీ విప్పుడు చేయుదునని పల్కిన దంతయు నివ్వానాధీశుండగు నిష్టకామేశ్వరు పాదసాక్షిగ మఱియొక్కతూరి పల్కి నా చేతఁ జేయి యుంచుము. ఆమీఁద నీ యభీష్టం బీడేర్చెద.

రుక్మాం—ఓహో చందనగంధీ! నాయభీష్టం బీడేర్తువా! వికసితాంబురుహలోచనా! నాకోర్కిఁ దీర్తువా? ఆహా! యెంత యానందజనకంబగు పల్కు పల్కితివి!

ఉ. కొల్లలుగా సుధారసముఁ ♦ గ్రోలినయట్లు, సుఖాంబురాశిలో
నల్లనఁ దేలినట్లు, ముద ♦ మారఁగఁ బైని హిమాంబుపూరముల్
పెల్లుగఁ జల్లినట్లు, మఱి ♦ పెంబులఁజిల్కెడు నీ మృదూక్తి నా
యుల్లముఁ బొంగఁ జేసె; సఖి ♦ రో! యిఁక ధన్యుఁడనైతి నీకృపన్.

చ. కులమున వన్నె డిందినను, ♦ గూరిమి నెచ్చెలు లేవగించినన్,
వెలఁదుల నూర్వురన్ దొడరి ♦ వీడఁగఁ గల్గినఁ, గీర్తిఁ బాసినన్,
గలిమిదొరంగినన్,మఱియుఁ ♦ గష్టము లెన్నియొ చుట్టుకొన్నఁదా
వలచినకాంత చేపడెడు ♦ భాగ్యముకన్నను భాగ్యమున్నదే? 34

చందనగంధీ! నీకీ సందియంబేల? ఈశ్వరునిసాక్షిగఁ బల్కుచుంటి వినుము.

గీ. ఒల్ల నూర్వురుసతులలో ♦ నొకరి నైన;
భావ మీనెల్లఁ బట్టపు ♦ దేవి కైన;
అతివ! నీ యాజ్ఞ నే శిర ♦ సా వహించి
యొనర నెన్నఁడు నినుఁ బాయ ♦ కుండు వాఁడ. 35

మోహి—ఓహో రాజేంద్రా! ఇంతదనుక నేను బల్కిన వాక్యంబులచే నీ మనం బెంత నొచ్చెనో కదా. నీవు నాయందుఁ గలిగియున్న యిట్టి నిజమయిన యనురాగంబును గ్రహింపఁజాలక బేలనై గోలతనంబునఁ బల్కితి. అదియెల్లఁ దప్పుగఁ బట్టకుము. నన్ను నీ నిండుకౌఁగిటఁ జేర్చి మన్నింపుము. (అని హర్షముతోఁ గౌఁగిలించుకొనుచున్నది.)

రుక్మాం—(మహానందముతో) ప్రాణసఖీ! యీ నట్టువపిట్టం జూచితివా? ఇటురమ్ము.

(ఇద్దఱును బోవుచున్నారు.)

సేవ—(ప్రవేశించి) మే మీ యరణ్యముం బ్రవేశించి పెక్కుదినము లయినది. వచ్చినందుకు వేఁటకార్యము ముగిసినది. కాని పురంబునకుఁ బోవు యోచన మా ప్రభువుగా రింకను జేయకున్నారు. వారి కరణ్యమైన నేమి? పురమైన నేమి? వారి కేమి కొదువ? ఆఁకలి దప్పుల బాధ యైశ్వర్యవంతులకుఁ దెలియునా? చెంతకేగి యేమైన విన్నవించెదమన్నఁ బ్రభుచిత్తంబు లతి సున్నితంబులు. ఏమి వచింపఁ బోయిన నేమి యగునో. పరివారజనంబులెల్లరు మిగుల డస్సియున్నవారు. ఏమి చేయనగును? కానిమ్ము. నా మిత్రులతో నాలోచించెద. (అని పోవుచున్నాఁడు.) (మోహినీ రుక్మాంగదులు ప్రవేశించుచున్నారు.)

రుక్మాం—పూఁబోఁడీ! మన మీ యరణ్యమధ్యంబునం దిట్టులు కాలంబుఁ గడప నేల? మదీయ పురంబుఁ జేరి వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యాది

దివ్యమణి ఖచితంబులగు సువర్ణ సౌధంబుల యందును, వకుళ చందన పున్నాగ నారికేళ కదంబ నింబ దాడింబ కదళికాది ఫలవృక్షసంకులంబులై డెందంబున కమందానందంబుఁ బొందుఁపఱుప సమర్థంబులగు మదారామ శ్రేష్ఠంబులందును మన మిచ్చ వచ్చిన ట్లుండవచ్చును. కావున నో మచ్చకంటీ! యచ్చటికే కేగుట యుచితంబని నాకుఁ దోఁచుచున్నది. దీనికి నీ యభిమతంబేమి?

మోహి—ప్రాణేశ్వరా! ఎఱింగింతు వినుఁడు. పురంబునకుఁ బోవుట సమ్మతమే. కాని

గీ. అచట నీ బంధుమిత్రులు ♦ నాలు సుతులు
గురు పురోహితులును మంత్రి ♦ వరులు కలరు;
అకట నా రాక నీకిష్ట ♦ మైన యట్లు
వారి కేరీతి నయ్యెడుఁ ♦ బ్రాణనాథ? 36

గీ. ఇట్టి వీరలు దుర్బోధ ♦ నెట్టులైనఁ
జేసి, నిన్ గతరాగునిఁ ♦ జేయఁ గలరు;
మనల నెడఁబాపుటయె కాక ♦ మఱియు నాకు
నింక నేమైన నెగ్గుఁ గా ♦ వింపఁ గలరు. 37

కావున నచటికిఁ బోవుట యుచితంబుగ నాకుఁ దోఁచుట లేదు. అయినను

ఉ. హెచ్చగు దోర్బలంబున న ♦ హీన మహీతలమెల్ల యేలి, యా
యచ్చరకాంతలెల్ల నహ ♦ హా యనురీతి ననుగ్రహించి, నీ
యిచ్చకువచ్చినట్లు సుఖ ♦ యింపఁగ స్వేచ్ఛవహించినట్టి నీ
కెచ్చటనున్న నేమి? రయొక ♦ యింత కొఱంతయుఁ గల్గనేర్చునే?

ఎట్టులైన నిచ్చటనుంటయే మేలని నాకుఁ దోఁచుచున్నది. పిమ్మట నీయిష్టము.

రుక్మా—మనోనాయికా! ఇట్లు సంశయించుట యనావశ్యకము.

క. నా పుత్రుఁడు నా మిత్రులు
నా పట్టఁపుదేవి మఱియు ♦ నా పురజనముల్
నా పల్కు లేశమాత్రము
నే ప్రొద్దును మీఱకుందు ♦ రిందునిభాస్యా! 39

అట్టి వారలు నా కేమో బోధింతురంటివి.

గీ. కన్నులారఁగ నిన్నిటఁ ♦ గని, వరించి,
పైని శంకరు సాక్షిగఁ ♦ బరిణయంబు
పొలుపుగాఁ గాంచి, నేఁ ♦ గొని పొవ్రుచుండ
వారు వీరును బోధింప ♦ వచ్చు టెట్లు?

ఇది కాక ఆత్మబుద్ధి స్సుఖంచైవ యనునట్లు నాకు న్యాయమని తోఁచు తెఱంగున నడచువాఁడఁ గాని వారివీరి బోధనలను వినువాఁడఁ గాను. నీ వీఁక నట్లు సంశయింపకుము. పురంబునకుఁ బోవుదము లెమ్మ.

మోహి—ప్రాణేశ్వరా! అట్టులే కానిండు.

రుక్మాం—నా పరివారజనంబు లావల నాకై వేచియుండిరి. మనము బోవుదము రమ్ము

(ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య. శ్రీమదుమారమణకరుణాకటాక్షపాత్ర శ్రీవత్ససగోత్ర బేతపూడి
వంశ క్షీరపారావార రాకాసుధాకర మల్లేశ్వరామాత్యపౌత్ర,
నిరంతర శివారాధనపరాయణ లక్ష్మీనారాయణామాత్య
చతుర్థపుత్ర గుణకదంబ లక్ష్మాంబాగర్భ సంభూత,
సుజనవిధేయ, భగవంతాభిధేయ ప్రణీతం
బైన రుక్మాంగదనాటకంబున నిది
తృతీయాంకము.





శ్రీ

# రుక్మాంగద నాటకము.

## చతుర్థాంకము.

రంగము:—అంతఃపురము.

(సంధ్యావళియు, చకోరాక్షియు, పద్మగంధియుఁ గూరుచుండియుండఁగా రుక్మాంగదుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సంధ్యా—నాథా! మీరు మృగయా వినోదార్థంబుగఁ జని పెద్దకాలంబయ్యె. మీ రాక దీర్ఘంబయ్యెనని యేనును నాతోడిసతులును ప్రత్యహంబును ప్రతిక్షణంబును నెల్లెదురు చూచుచుంటిమి!

చ. అచటి మృగాళినెల్లఁ దెగ ♦ టార్చితిరే? యల కాఁపులెల్ల మీ
సుచరితఁ బాడుకొంచుఁ, దమ ♦ శోకము లెల్ల దొరంగెనంచు, మేల్
వచనము లాడుకొంచు, సుఖ ♦ వారిధి నోలలనాడుచుండిరే?
అచలితధైర్యసార! సుగు ♦ ణాకర! మాకు నెఱుంగఁ జెప్పవే! 1

రుక్మా—(తల వంచుకొని కూర్చున్నాఁడు.)

చకో—అక్కా! సంధ్యావళీ! మనము కాచుకొని యుంటిమని చెప్పుచుంటివి. మన వలెనే నాథుండును మనలఁ గాచుకొనియుండు నెడ రాజ్యవ్యవహారంబు లెట్లు నెఱవేఱునమ్మా! కాని నాథుండు కడుబడలియున్నట్లు కానిపించుచున్నవాఁడు. కాంచితివా?

గీ. కాయమెల్లను శ్రమబిందు ♦ కలిత మయ్యె;
మోము వేఁకువచందురుం ♦ బోలుచుండె;

వేఁడి నిట్టూర్పు లూరక ♦ వెడలఁ జొచ్చె;
కాంత! యరమోడ్పు లౌచుండెఁ ♦ గన్ను దోవలు. 2

పద్మ—అవునమ్మా చకోరాక్షీ! నాథుండు మిగుల డస్సియుండుటయే కాక యేమో దీర్ఘాలోచనపరుండై యున్నట్లు తోఁచుచున్నదమ్మా.

గీ. పల్కరించినఁ బ్రతిమాటఁ ♦ బల్కలేక
కోలుపోయిన చందానఁ ♦ గూరుచుండి,
క్రిందుమీఁదుల నరయుచు ♦ ముందు త్రోవ
యెద్దియో యను గతి నుండె ♦ నిందు వదన! 3

రుక్మా—పద్మగంధీ! నీవు సరియైన యోచనఁ జేసితివి. నేను నిజంబుగ దీర్ఘాలోచనపరుండనయ్యే యున్నవాఁడ. ఏను మీ కెఱింగింపవలసిన కార్యం బొకటి యావశ్యకంబగుటంజేసి యది మీ కెట్లెఱింగింతునాయని యోచించుచున్నాఁడ.

సంధ్యా—నాథా! మీకింత యోచనయేల? మమ్ము నూర్వుర భార్యలఁగా గ్రహించి యేలుచున్నను ఒక్కప్పుడైన నొక్కరియందైనఁ బరస్పరభేదంబులేక యెల్లర సమదృష్టి నేలుచు బద్ధానురాగులరై వర్తించుచుండు మీరు మాకు నే డొక్క విషయంబుఁ దెలుప నింతయోచనకావలెనే? సందియంబుమాని యెఱింగింపుఁడు.

రుక్మా—కాంతలారా! వినుఁడు.

చ. సరగునఁ గాన కేగి, మృగ ♦ సంతతు లన్నిఁటి వెంటనంటి సం
హరణ మొనర్చినంత, విధి ♦ మానసపుత్రిఁ, ద్రిలోక దివ్యసుం
దరమృదుగాత్రి, మోహినియ ♦ నందగు నోర్తుఁ దదంతికస్థలిన్
దిరుగఁగఁగాంచి, మోహ♦మెద నించి,వరించి,పురంబుఁ జేర్చితిన్.

అక్కాంతామణిని మనయంతఃపురంబున నొక్క సౌధాంతరంబున నుంచితి.

చకో—ఏమేమీ! మేము నూర్వురుకాంతలము గాక యింకొక్కకాంతామణింగాంచి, మోహించి, తెచ్చితిరా! పోనిండు. మాకు మీ యనుగ్రహం బుండినం జాలదే?

రుక్మా—ఉ. అట్లు వరించువేళ వన ♦ జానన మిమ్ముల నేరి నొల్ల కే
పట్లను నైనఁగాని తనుఁ ♦ బాసి క్షణంబును నిల్వనంచు న

న్నిట్లుగ బాసఁజేయుమన ♦ నే మదనాస్త్ర నిపీడితుండనై
యట్లె యొనర్చువాఁడ నువి ♦ దా! యని పట్టి కరంబుఁ బట్టితిన్.

కావున నో సఖులారా! మీరు నట్లు ప్రవర్తించుట నా యుద్దేశంబు.

సంధ్యా—అక్కటకక్కటా, ప్రాణేశ్వరా! ఏమి యీ యన్యాయంబు! మే మెవ్వరి వార మగుదుము? మావంటి సతుల నింక నూర్వర వివాహమైనఁ గావచ్చునుగాని యొక్కతరుణికై మ మ్మెల్లరఁ ద్యజింపఁబూనుట యెంతయుఁ బరితాపకరంబు కాదే? కావలెనన్న నా తరుణీమణియం దెక్కుడు ప్రేమంబునఁ గలసిమెలసి వర్తింపుఁడు. మాయం దెప్పటియట్లే యుండుఁడు. అంతియ చాలు.

పద్మ—కాదమ్మా సంధ్యావళీ! నాధుండు మన మనంబు లరయుటకై యిట్లు పల్కుచున్నవాఁడు. కాకయున్న నెచ్చటనైన నిట్టి విచిత్రం బుండునా?

ఉ. నమ్మకు నమ్మకమ్మ నర ♦ నాధులు దంభవిలాసు; లిట్టి మే
లమ్ములు సంతసమ్ములు నె ♦ లంతరొ వారికిఁ; గాక యివ్వి స
త్యమ్ములనంగ మున్ను మము ♦ నందఱినిన్ వరియించువేళఁ దా
నిమ్మెయిఁ దొంటివారల న ♦ దేటికి వీడకయుండె నెచ్చెలీ? 6

కాంతుఁ డెప్పటియట్ల మనయెడ బద్ధానురాగుఁడైయే యున్నవాఁడమ్మా.

చకో—ఉ. చాలును జాలు నీ వగలు ♦ చాలును కట్టుము;
పద్మ— ... ... ... కాదుకాదె, భూ
పాలుఁడు సత్యశీలుఁడు కృ ♦ పాళుఁడు కాఁడఁటె?
చకో— ... ... ... ఔనుగాని, స్త్రీ
లోలుఁడు కాఁడె? చిత్తచప ♦ లుండునుఁ గాఁడఁటె?
పద్మ— ... ... ... తాళు కోమలీ
తూలఁగనాడఁ జెల్లునె?
చకో— ... అ ♦ ధోగతిపాలిటు చేయు టొప్పునే? 7

పద్మ—[21] చెలీ! నీవు పొరఁబడుచుంటివి సుమా.

చకో—పద్మగంధీ! ఏటికమ్మా యీ ప్రసంగంబులు? నీ వేమో పూసి పెట్టి

మాటలాడవచ్చెదవు. ఈ మగవారిని నమ్మనచ్చునటమ్మా!

ఉ. ఒక్కతెఁ బల్కరింతురు; మ ♦ ఱొక్కరితోఁ సరసాల ముంతు;రిం
కొక్కతెఁ జేరఁ దీయుదు; రిఁ ♦ కొక్కతె బిగ్గఁ గౌఁగిలింత్రు;వే
ఱొక్కతెపాల దక్కుదు; ర ♦ హా! మగవారల నమ్మఁజెల్లునే?
చక్కెరపూఁతవెట్టిన వి ♦ షంబుల మాత్రలుగారె యక్కరో? 8

ఇప్పుడు నాథుం డన్యసతీలోలుండై యున్నవాఁడు. ఇంక మీవాక్యంబు లెట్లు చెవిం జొరఁగలవమ్మా?

గీ. పగలఁ బాగులఁగ మనలను ♦ దిగువఁద్రోసి,
వనిత యొక్కతె విభునకు ♦ స్వర్గ మయ్యె;
ముందు కల్గిన చెవ్రులను ♦ క్రిందుఁ జేసి,
పైకి నిక్కెడి కొమ్ముల ♦ పగిది నకట! 9

సంధ్యా—చకోరాక్షీ! మన నాథుండు లోకములోని మగవారల వంటి వాఁడు కాఁడమ్మా. ఇంతవఱ కెన్నండైన నిట్టి లోపంబుఁ గని పెట్టి యుంటిమమ్మా? జీవితేశ్వరుం డలసియుండె. చెలీ! నీవొక్కింత విసరుము. సేవకా! ప్రభువువారి కొసంగవలయు నొక్క విడెంబుఁ గొనిరమ్ము. పద్మగంధీ! నీ వొక్కపాట పాడెదవటమ్మా?

పద్మ—ఆలాగే పాడెదనమ్మా. (అని యిట్లు పాడుచున్నది.)

పా ద ప వృ త్త ము.

సామిగ నేఁడిటు ♦ జాలమి దేరా?
కామిని నేఁచుట ♦ కాదుర ధీరా!
కాముని తూపులఁ ♦ గందితి గారా
తామస మేలర ♦ తాళఁగ లేరా. 10

సంధ్యా—ప్రాణేశ్వరా? ఏల మీ రీదినంబున మాతో నిట్లు మేలమాడఁ దొడంగితిరి?

రుక్మా—కాంతలారా! మీ రేమేమో పరిపరివిధంబులఁ బలుకఁజొచ్చితిరి. నేను చెప్పినది పరిహాసంబుకాదు. నిక్కంబు. రేపటినుండి నేను మీ చెంతకు రాఁజాల.

పద్మ—హా, పరమేశ్వరా! ఇఁక నేమిగతి? మే మెవ్వరిపాలఁబడుదుము? మాకెవ్వరు దిక్కు? మమ్మింక నక్కునఁజేర్చి యాదరించువా రెవరు? హాసఖీ! యింకేమి సేయుదుమమ్మా? ప్రాణనాథుండు రేపటినుండి మన చెంతకే రాఁజాల నని చెప్పుచుండెఁగదమ్మా.

క. తన విభు మన్నన వడయని
వనితల బ్రతుకులును వారి ♦ వైభవ మెల్లన్
గన నడవిని వెన్నెల కా
సిన మాడ్కియకాదె? బ్రదుకఁ ♦ జెల్లునె ధరపై? 11

గీ. ప్రాణసముఁడగు పతిఁ బాయు ♦ బ్రతుకుకంటె
మేనుఁ బాసిన నొక్కింత ♦ మేలె సుమ్మ;
ప్రాణములు తాల్చి యపకీర్తిఁ ♦ బడుట కంటె
స్వర్గముననుండి పతిభక్తి ♦ సలుపఁ దగును. 12

[22] ఉశ్, అబ్బా, సఖీ! నా కేమియుఁ దోఁచుట లేదమ్మా.

చకో—సఖీ! యింక నెక్కడఁ దోఁచుటమ్మా? ప్రాణనాథు నెడఁబాసిన యీ బ్రతు కేటికమ్మా? లోభివానిచేతి ధనమ్మును, రణభీరునిచేతి యాయుధమ్మును, సంగీతసాహిత్యవిద్యావిహీనుని వచనంబులును, విభుని మన్నన వడయని యతివల బ్రతుకులును వ్యర్థంబులు కావటమ్మా?

ఉ. అందముగాఁగ మమ్ముల మ ♦ హాకరుణామయదృష్టి నేలి,యా
నందరసాబ్ధిఁ దేల్చు ప్రియ ♦ నాయకు చెంగట నాడుముట్ట నే
డందని మ్రానిపండుకొఱ ♦ కన్నులు చాచుటలాయె; నింక నే
మందు; నిఁ కేదిమందు; జగ ♦ మందున నేగతి మందు నక్కటా?

ఇట్టి వృథాజీవసంబునకన్న రజ్జువిషాగ్నిజలంబుల దేహంబు వాసిన మేలని తోఁచుచున్నదమ్మా. శ్లో. మానః స్త్రీణాం విభూషణం అన్నట్లు స్త్రీలకు మానమే ప్రధానముకదమ్మా. అట్టి మానంబుఁ బోగొట్టుకొని యింక నవమానకరంబగు బ్రతుకు బ్రతుకఁజాలనమ్మా. ఈ పైఁట చెఱఁగున నురివోసికొని ప్రాణంబులు దొరఁగెదనమ్మా.

పద్మ—నేనును అట్లేచేయుదునమ్మా. (అని యిద్దఱును ఉరిపోసికొనబోవఁగా సంధ్యావళి లేచి వారలఁ బట్టుకొని)

సంధ్యా—కాంతలారా! తాళుఁడు, తాళుఁడు. మీరిట్లు ప్రాణంబులఁ బాయ నుంకించుట మేరకాదు. ప్రాణనాథుం డెట్టివాఁడైనను, ఎట్టి యకృత్యంబు లొనరించినను వాని నెల్ల సహించి నాథుని యాజ్ఞాబద్ధురాలై వర్తించుట యుత్తమ స్త్రీ ధర్మంబు.

సీ. పతి యాగ్రహించిన ♦ బదులు పల్కఁగరాదు
కోపించె నని మదిఁ ♦ గుందరాదు
కఠినోక్తు లాడినఁ ♦ గంటగింపఁగ రాదు
దూషించె నని మదిఁ ♦ దూల రాదు
అలసట వెట్టిన ♦ నడ్డు చెప్పఁగరాదు
కలఁగించె నని మదిఁ ♦ దలఁప రాదు
పరిహాసించినఁగాని ♦ ప్రతి సేయఁగా రాదు
వేఱు పెట్టెనటంచు ♦ విసువరాదు

గీ. ఆటపాటలనైనను ♦ నలుక నైన
సరససల్లాపములనైన ♦ శ్రమల నైనఁ
బతియె దైవమటంచు స ♦ న్నుతి యొనర్తు
కాని యెదురాడ దుత్తమ ♦ కాంత లెపుడు. 14

ఉ. కుంటియు గ్రుడ్డియుఙ్, జడుఁడు ♦ క్రూరుఁడు, దుష్టుఁడు, పాపకర్ముఁడుఙ్ దుంటరి, వేసకాఁడు, గడు ♦ ధూర్తుఁడు, నన్యసతీప్రియుండు, వే తంటలమారివాఁడయిన ♦ దగ్గరఁజేరి, పదంబులొత్తి, వా ల్గంటిరో! దైవమంచుఁ గల ♦ కాలము నాథునిఁ గొల్వఁగావఁదగుఙ్.

క. పతి యలిఁగిన సతి యలుఁగక
నతివినయస్ఫూర్తి నతని ♦ యాజ్ఞ శిరసునఙ్.

సతతము వహించి మనుటయె
సతులకు ధర్మంబునాఁగఁ ♦ జను సఖులారా! 16

బుద్ధిపూర్వకంబుగాఁ బ్రాణంబు వాయుదుమన్నను విభునియనుజ్ఞలేక మీ రెట్లుచేయఁగలరు? ఇదిగాక రాజేంద్రుండు వనంబునకుఁ బోవకమున్న మీరెట్లు పల్కినను బాగగును. ఇప్పుడు నాథుం డాకన్యకామణిం గాంచి, మోహించి, బాసలిచ్చి, కొనివచ్చి, యతఃపురంబున నిల్పిన పిమ్మట మీ రెట్టి కఠినవాక్యంబు లాడినను, కఠినకృత్యంబు లొనరించినను విభుం డేమిచేయఁగలఁడు? మఱియుఁ గాంతలారా!

గీ. కనులు కల్వలు మేను బం ♦ గారటంచుఁ
జాన కౌఁగిలి యబ్బులే ♦ స్వర్గమంచు,
దలచి, భ్రమియించి, మించి, యీ ♦ ప్రభుఁడు సుఖము
లందఁబోయెడుఁ; గంద మా ♦ యంద మెల్ల. 17

కుడువఁబోయెడి కూరకు రుచియడుగ నేటికమ్మా? మీరుతొందరనొందకుడు. ఆ సయ్యాటలును, ఆ సరాగంబులును, ఆ చిత్రంబును మనము శీఘ్రకాలంబు లోనే చూడఁగలము.

చకో—అక్కా! నీ పల్కుల కెదురాడను గాని యెంతగఁ బ్రయత్నించినను నా మనం బూరటఁజెందకున్నది. ఏమిచేయుదును. హా! మోహినీ! దుష్టహృదయా! యెంతచేసితివి!

ఉ. ఏదెసనుండివచ్చితి? వి ♦ దేటికి మాకిటు దాపరించి మా
మోదమునెల్ల సంద్రమున ♦ ముంచితివే పతిఁబాపి; నీకు మ
ర్యాదయె? కోమలీ! తగుదు ♦ నంచును గుల్కెదొ సిగ్గులేక; హా
మా దురదృష్టదేవతవొ ♦ మా తలవ్రాఁతవొ యేమి చెప్పుదున్!

గీ. నీ విలాసంబు, హాసంబు, ♦ నీదు వగలు,
నీటు గోటులు చూపుచు ♦ నేర్పు మీఱ
సతిపతులపొందు నెడఁబాపు ♦ చాన నిన్ను
ధర సృజించుట పరమేష్ఠి ♦ తప్పు కాదె? 19

గీ. సతుల నూర్వుర నిటు దుఃఖ ♦ సాగరమున
నెక్కపెట్టిన ముంచి నీ ♦ వెక్కరితవు
పొందఁబోయెడి సౌఖ్యంబు ♦ పోల్చి చూడ
నూటయొక్కటి యౌఁ జుమ్ము ♦ మాట నమ్ము. 20

మ. జగతిన్ గాంతలు లేరె? పూరుషుల స్వే♦చ్ఛావృత్తిఁ బ్రేమింపరే?
తగురీతిన్ వలపింపరే? వలవరే? ♦ తత్సౌఖ్యముం జెందరే?
తగునే మోహిని! యిట్టులాలుమగలన్ ♦ దంత్రంబునన్ బాపఁగన్?
మగువా! మాకొఱకే జనించితె? కటా ♦ మా ప్రేమముం బాపితే?.

పద్మ—చెలీ! ఇందు మోహినిం దూషింపనేల?

మ. ప్రణతుల్ చేసి భజించెనో, యితని రా ♦ రమ్మంచుఁ బ్రార్థించెనో
వనితా! మోహినిదేమితప్పు చెపుమా? ♦ ప్రాణేశుడక్కాంత గాం
చినయంతన్ వివశాత్ముఁడై తగునె యి ♦ స్సీ! యిట్లు వాకిచ్చుటల్
మన బంగారము మంచిదైన నిఁక నే ♦ లా దూఱఁ గంసాలినిన్ 22

హా, సఖీ! చకోరాక్షీ! యీ దుఃఖసాగరం బెట్టు లీఁదనేర్తుమమ్మా? [23]

గీ. తారసిల్లిన పెరకాంతఁ ♦ దగిలి విభుఁడు
మనల విడనాడి తనదు యౌ ♦ వనము నెల్ల
బాని పాలొనరించుటఁ ♦ దలఁచు నపుడు
గుండె జల్లని ప్రాణముల్ ♦ క్రుంగ కున్నె?. 23

సంధ్యా—చెలీ! నీ విట్టు లట్టిట్టనరాక మట్టుమీఱిన శోకంబున రట్టువడుచుంటివి సుమా.

ఉ. ఆపఁగరాని ఖేదమున ♦ నయ్యొ కృశింపఁగ నేటికమ్మ? యీ
యాపద లెల్లకాల, మక ♦ టా విను, జీవుల వెంటనంటుచున్
గాపురముండఁబోనె? ప్రియ ♦ కాంతరొ! వింటివె? కష్టకాలమం
దోపిక బూనునట్టి జను ♦ లుర్వి సుధీమణు లెంచిచూడఁగన్ 24

పద్మ—నీవాక్యంబులు నిక్కంబులే కాని యక్కయొక్కటివినుము. రాజాధిరాజ

టంచు రసికాగ్రణియటంచుఁ జిరకాల మీతనిం జేరి యపరిమితసుఖంబు లనుభవించి యిప్పు డిట్టినీచత్వంబునకుఁ బాల్పడ మనం బెట్టులోర్చు? ఈరాజేంద్రుఁడు

గీ. అచటఁ గాంచిన తరుణికై ♦ యాసఁ జెంది,
చేయరానట్టి బాసలు ♦ చేసి, తుదకు
మనల నలయించి, బహుళ వే ♦ దనల నించి,
యట్టె వచించి, నట్టేటఁ ♦ బుట్టి ముంచె! 25

సంధ్యా—సఖీ! యివేటిమాటలు; ఈ రాజేంద్రుఁడు మన కొనర్చిన యపకారమేమి?

ఉ. కాలముఁబట్టి కర్మమును ♦ కర్మముఁబట్టి మనంబునుంట నీ
లీల శుభాశుభంబు లవలీలగఁ ♦ గ్గుచునుండు; కర్తలై
మేలును గీ డొనర్చుటకు ♦ మేదిని నెవ్వరు శక్తులమ్మ? భూ
పాలుఁడు కర్తయానె మన ♦ పాలిఁటి కర్మ మొనర్చుచేఁతకుఁ?

చకో—అక్కా, సంధ్యావళీ!

గీ. ఎల్లకాలంబు బతిఁబాసి ♦ యేకతమున
బ్రదుకఁ గల్గుట యేరీతి ♦ భాసురాంగి;
ప్రాణమైనను గోల్పోయి ♦ మాన ధనము
నిలుపుకొనుటయె మేలంచు ♦ నేఁ దలంతు. 27

సంధ్యా—చెలీ! చకోరాక్షీ! నా పలు కొక్కింత యాలకింపుము. ఏరికైన నిట్టి తీవ్రవైరాగ్యంబు చెల్లునా? కాలం బెప్పు డొక్కతీరుననే యుండునా? ఓడలు బండ్లగును. బం డ్లోడలగును.

మ. ఒకకాలంబున నాథుఁడే మనల క ♦ త్యుల్లాసముం గూర్చె, వే
ఱొకకాలంబున నాథుఁడే మనల న ♦ య్యో వీడఁగాఁజూచె, నిం
కొకకాలంబున నాథుఁ డెట్లనఁగ నా ♦ నో, యెట్లు మన్నించునో
యకటా యేగతి నిశ్చయింపఁదగున ♦ మ్మా? భాగ్య మెట్లుండునో

[24] కావున కాంతలారా! మీ కీ వేగిరపాటేల? కానున్నది కానిండు నాథుని యభీష్టమ్మునే జరుగనిండు.

పద్మ—అక్కా! అట్లే కానిమ్ము.

చకో—విభుని యిష్టమునే జరుగనిమ్ము.

రుక్మ—కాంతలారా! ఇంతదనుక మీ పల్కులెల్ల నాలకించితి. మీరలు పరిపరి విధంబులఁ భాషింపఁ దొడంగితిరి. కాని

ఉ. కాలమొ, కర్మమో, గతియొ ♦ కాక మఱెద్దియొ నే నెఱుంగ; వే
యేల? మృగాక్షులార, నను ♦ నేమని దూఱిన, నేమియన్న, ని
క్కాలమునందు మోహినిని ♦ గాంచి,వరించి,ప్రమాణవాక్యముల్
చాలఁగఁ బల్కినాఁడ; నిది ♦ సత్యము,తప్పదు, పోయివచ్చెదన్.

ఉ. అచ్చట మోహనాంగి తడ ♦ వయ్యెనటంచు మహోగ్రహంబునన్
హెచ్చుగ నేమిపల్కునో,మ ♦ ఱేగతిఁజూచునో,యస్వతంత్రుఁడన్
వచ్చినకార్యమయ్యెఁ, బెఱ ♦ వానినిగా ననుఁ జూడుఁ డింక; నేఁ
జెచ్చెరనేగి యా సుదఁతి ♦ చిత్తమెఱింగి మెలంగఁ జూచెదన్. 30

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య. శ్రీమదుమారమణకరుణాకటాక్షపాత్ర శ్రీవత్ససగోత్ర బేతపూడి
వంశ క్షీరపారావార రాకాసుధాకర మల్లేశ్వరామాత్యపౌత్ర,
నిరంతర శివారాధనపరాయణ లక్ష్మీనారాయణామాత్య
చతుర్థపుత్ర గుణకదంబ లక్ష్మాంబాగర్భ సంభూత,
సుజనవిధేయ, భగవంతాభిధేయ ప్రణీతం
బైన రుక్మాంగదనాటకంబున నిది
చతుర్థాంకము.





# రుక్మాంగదనాటకము.

## పంచమాంకము.

### రంగము—మోహిని యంతఃపురము.

(మోహిని ప్రవేశించుచున్నది.)

మోహి—ఈ రాజేంద్రుఁడు నన్నిచటికిఁ గొనివచ్చిన దాదిగ నాయందు బద్ధానురాగుఁడైయే యున్నవాఁడు. కాని యీతని నూర్వురభార్యలయొద్ద నేమిజరుగుచుండెనో యిప్పు డెఱుఁగవలసియున్నది. ఎవరి నడుగుదును? చెలీ, పుష్పమాలా! (అని పిలువఁగాఁ జేతిలో నొక పుష్పమాలను బటమును దీసికొని పుష్పమాల యను చెలి ప్రవేశించుచు)

పుష్ప—ఇదో వచ్చుచుంటిని. వచ్చుచుంటిని.

మోహి—చెలీ! ఎంతసేపే? ఇంతలో వత్తునని పోయి యెంతసేపు చేసితివే?

పుష్ప—మఱి యెక్కడకును బోవలేదు. నీకొఱకే పుష్పములఁ గూర్చుకొని వచ్చుచుంటిని. ఇదిగో మాల; కైకొమ్ము. (అని యిచ్చుచున్నది.)

మోహి—నీ వొక పుష్పమాలవు నాకుఁ జెలివైయుండి వేఱొక పుష్పమాలను గూడ గూర్చుకొనివచ్చితివా?

పుష్ప—అవును. తెచ్చితిని. అట్లు తేఁగూడదా?

మోహి— తేవచ్చును. కాని యిది నీకు పైపోటీ యగుచున్నదే.

పుష్ప—లోకములో నిట్లు పైపోటీలుగా వచ్చువా రెందఱులేరు?

మోహి—చెలీ! యిది నామమాత్రముచేతనే కాక సౌకుమార్యముచేఁ గూడ నిన్నుఁ బోలుచున్నది.

పుష్ప—కనుక నే నీయొద్దఁ జేరినది.

మోహి—నిన్ను మించు తలఁపుననో యనునట్లు లిది కొంచెము కొంచెముగా నొక వింతయైన వికాసమును జూపుచున్నది.

పుష్ప—అవును. అట్లుండుట నైజమే కదా.

మోహి—ఎందుచేత?

పుష్ప—దానికి నీతోడి స్నేహము నూతనముగనుక.

మోహి—ఔరా! చెలీ! నీ పల్కు లేమో చిత్రములే.

పుష్ప—ఆ చిత్ర మేమో నీకే తెలియవలెను.

మోహి—(ఆశ్చర్యముతో) అదేమే, చెలీ యట్లనెదవు?

పుష్ప—అనుభవజ్ఞానము నీ కెక్కుడుగఁ గలదని.

మోహి—(తనలో) ఇది యేమాటపల్కినను నన్ను సూచింపుచునే పల్కుచున్నది. ఈ ప్రసంగ మొక్కింత మార్చెద. (ప్రకాశముగా) చెలీ! నీ చేతిలోని దేమేయది?

పుష్ప—ఓహో, యిదియా?ముందే నీకిచ్చుట మఱచితిని. ఇది మన ప్రభువువారగు రుక్మాంగద మహారాజుగారి పటము. తీసికొమ్ము. నీకొఱకే తెచ్చితిని.. (అని యిచ్చుచున్నది.)

మోహి—ఇ దెందుకు తెచ్చితివే?

పుష్ప—నీవు చూచిన యానందింతువని.

మోహి—(తనలో) ఈ పటమునుఁ దెచ్చి యిచ్చుటఁ జూడఁగా నీ చెలి యీ విషయమై కొంత పొడుపు ప్రసంగమునుఁ గావింప నెంచిన ట్లగపడుచున్నది. కావున నీ ప్రసంగముఁగూడ మార్చివేసెద. (అని యా పటమును దూరముగా నుంచి (ప్రకాశముగా) చెలీ! యీ దినము నీ కొఱ కెంతసేపు కాచుకొని యుంటినే! ఈ పుష్పమాలను దెచ్చుట కింత సేపు కావలయునఁటే?

పుష్ప—ఆఁ. మఱచితిని. నేను వచ్చునప్పుడు దారిలో నెవరో మాట్లాడుకొనుచుండఁగా వినుచుఁ గొంచెము సేపు నిలువఁబడితిని. అందుచేఁ గొంచె మాలస్యమైయుండును.

మోహి—ఆ మాట్లాడుచుండినవా రెవరే?

పుష్ప—దారిని బోయెడువా రెవరైన మనకేలా?

మోహి—ఊరకయే యడుగుచుంటిని. వారు రహస్యపుమనుష్యులా?

పుష్ప—అయ్యో! రహస్యపు మనుష్యులు కారు. మన యంతఃపుర పరిచారికలే?

మోహి—వా రేమి చెప్పుకొనుచుండిరే?

పుష్ప—(మూతి ముడుచుకొని) ఏమో చెప్పుకొనుచుండిరి. నాకుఁ దెలియలేదు.

మోహి—నీకుఁ దెలియకయే యింతసేపు వినివచ్చితివటే?

పుష్ప—ఏమో; విన్నాను.

మోహి—చెలీ! యింత మర్మమఁటే?

పుష్ప—నే నేమియుఁ బైపోటిఁగ రాలేదుకదా. నాకు మర్మమెందుకు?

మోహి—చెలీ! ఆ ప్రసంగము లంత రహస్యములఁటే.

పుష్ప—తొలుత రహస్యములే యయినను బిదప బహిరంగములే యయినవి.

మోహి—అవి మన ప్రభువుగారి విషయములా?

పుష్ప—కనుక నే యింత సందేహించితిని.

మోహి—ఈమాత్రపుమాటను నీవు చెప్పకపోవునెడ మన స్నేహ మేమి స్నేహమే?

పుష్ప—పోనీ చెప్పెదను వినుము. మన రాజుగారు తన నూర్వురుభార్యల నొల్ల నని త్యజించిరఁట.

మోహి—ఆఁ.—ఏమీ!—త్యజించిరా!—ఎందుకొఅకు?

పుష్ప—నీకొఅకే.

మోహి—ఈయన త్యజించినమాత్రమున వార లూరకుండిరా?

పుష్ప—లేదు. వారిచేత నైనట్లు నయభయములచేఁ బ్రార్థించిచూచిరి. ఐననేమి? గూఁటఁజిక్కినపక్షి గుంపులోనికి వచ్చునా?

మోహి—చెలీ! వారల నీ నాఁడు త్యజించెనఁటే?

పుష్ప—కాదు. నీ విక్కడఁ బాదముపెట్టిన దినమందే.

మోహి—ఆ నాఁటి సంగతి కీ నాఁడు విచారణయేల?

పుష్ప—రే పేకాదశియగుటచేత నీ రాజేంద్రుఁడు వ్రతసమయంబునకుఁ బట్టపుదేవినైనఁ జెంతఁ జేరనిచ్చునో లేదో యని యెల్లరును గుబ గుబ గుబ లాడుచున్నారు.

మోహి—(తనలో) రేపీ వ్రతము సాఁగునెడఁగదా పట్టపుదేవి చెంతకేగుట. ఈ చెలి నింకఁ బంపివేసి తగిన యోజన సేయవలయును. (ప్రకాశముగా) చెలీ! బయట నెవరో వచ్చుచున్నట్లున్నది చూడుము.

పుష్ప—(అటునిటుచూచి) ఎవ్వరును లేరు. ఊరకయే యిట్లుచెప్పి నన్ను మోస గింపఁ జూచితివా?

మోహి—కాదే. మరలి చూడుము.

పుష్ప—(చూచి) మన ప్రభువువారు వచ్చుచున్నారు. కాని చాలాదూరమున నున్నారు. ఆ సడి నీ కిక్కడను వినవచ్చెనా? ఔరా! నీవు దూరదృష్టి దూర శ్రవణములు కూడఁ గలవేమో!

మోహి—ప్రభువుగారు వచ్చుచుండిరా? (కొంచె మాలోచించి) సఖీ! నీవు నా కొక మందారమాల నిత్తునంటివే; ఏదీ?

పుష్ప—అవును. ఇచ్చెదను లెమ్ము.

మోహి—ఇపుడుపోయి కూర్చుకొనివత్తువా?

పుష్ప—ఇప్పుడే కావలయునా? ఆలాగే తెచ్చెదను. పోయివచ్చెద. (అని తనలో) రాజుగారువచ్చుచుండఁగా నిచట నేనేల? (అనుచుఁ బోవుచుండఁగా)

మోహి—మరల వేగమే రావలయుఁ జుమీ.

పుష్ప—ఆలాగే వచ్చెదను. (అని వెళ్ళుచున్నది.)

మోహి—(స్వగతము) ఈ చెలి నొక మిష పెట్టి పంపివైచితిఁగదా. రాజేంద్రుఁడు నాకొఱకై తననూఱ్వురుభార్యలఁ ద్యజించెనని యీ చెలివలన నెఱింగితి. ఈ చెలి వలన నా రాజేంద్రుని పటమొకటికూడ నాకుఁ జిక్కినది. అతఁ డిప్పు డిచటికే వచ్చుచున్నవాఁడు. రేపే యేకాదశి. కావున రేపటివ్రతముఁ జెఱచుటకై నే నిప్పు డేదైన నొక్క తంత్రముఁ గావింపవలసియున్నది. (అని మింటికై చూచుచు నాలోచించి) ఆఁ. మంచియోజన తోఁచినది. రాజేంద్రుఁ డిచటికి వచ్చునప్పటికి నేను శయ్యపైఁ జేరి యాతనిరాక నెఱుంగనట్లును, నాతని రాక యాలస్యమగు టంజేసి నేను విరహపరవశురాలనైనట్లును నటింపుచు నాతనికినాయందపరిమిత మోహ మూరించెద. ఇదియే ప్రథమకర్తవ్యము. (అని శయ్యపై కేగుచున్నది.)

(రుక్మాంగదుఁడు ప్రవేశించి ప్రక్కను నిలిచి తనలో)

రుక్మా—ఈ నా ప్రాణసఖి యంతఃపురంబున నొంటిగ నుండుటలే నేమిచేయు

చుండునో. (వినుటల్లనభినయించి) తనలో నేమో మాటలాడుకొనుచున్నది. అది యేమో యాలకించెద. (అని వినుచున్నాఁడు.)

మో—గీ. అక్కటా నాధ! నీ విట్లు ♦ లాలసించు
కారణం బేమొ నామదిఁ ♦ గానరాదు;
నీదు సతిసుతహితులెల్ల ♦ నీకు నేమి
బోధఁ జేసిరొ యేనెందుఁ ♦ బోవు దాన?.

రుక్మా—నేను నా భార్యాపుత్రుల బోధనలకు లోఁబడుదుననియే యీ కాంతామణి యింకనుఁ దలఁచుచున్నది. కానిమ్ము. ఇచటనే యుండి యింక నేమి జరుగునో చూచెద.

మోహి—అక్కటా. నాధా! యింకను రావైతి వేమి? నాయందు నీ వింతటి నిర్దయ నెట్లు వహింపఁగల్గితివి? ఇఁక నే నేమిచేయుదును? పోనిమ్ము. నీ యీ పటమును జూచుకొనియైనఁ గొంత తృప్తిఁ జెందెద. (అని పటమును జేతఁ దీసికొని యాశ్చర్యమభినయించుచు) ఆహా! ఏమి యీ సోయగంబు! భానుసమ తేజుండైన యీ రాజేంద్రుండు తన దివ్యతేజంబున నీ జగంబెల్ల వెల్గొందఁ జేయఁ జాలియున్నవాఁడు. ఈతఁడు సౌందర్యంబున శరీరధారియై భూస్థలి కరుదెంచిన కంతుఁడో లేక జయంతుఁడో యనఁదగియుండెఁగదా! వహవ్వా! సౌందర్యమన్న నిట్టు లుండవలయు?

చ. కిలకిలనవ్వు నెమ్మొగము, ♦ కెంపులఁ జిల్కెడు కావిమోవి, క్రొ
న్నెల నిరసించు నెన్నుదురు, ♦ నిక్కమ వీనులకంటు నేత్రముల్,
వలపులఁగుల్కు ఠీవి, వహ ♦ వా! జిగిదేఱెడు మేనిసొరునుఁ,
గలిగిన యీ నృపాలు బిగి ♦ కౌఁగిటి కన్నను స్వర్గ మెక్కడే?

సీ. నళినారి యీమోము ♦ నకు సాటి యనవచ్చు
క్షీణత్వ మాతఁడు ♦ చెందకున్న
దర్పణంబులు గండ ♦ తలముల సరియగు
కఱకు కోఁతలఁ బడి ♦ తఱుఁగకున్న

పద్మంబు లీమృదు ♦ పదసామ్యమునుబొందు
వాడిపోయెడి గోడు ♦ వడయకున్న
కనక మీ తనువున ♦ కెనయనఁ జెల్లును
కఱఁగి నీరైపోవు ♦ టెఱుఁగకున్న

గీ. నందఱకు నన్ని దోషంబు ♦ లంటి యుండెఁ
గాని జితమన్మథాకార ♦ కలితుఁ డితఁడు
అక్కటా నాదుకన్నుల ♦ కద్దు కొంచుఁ
బూజసల్పుదు నిమ్మహా ♦ పురుషు నెపుడు.

ఇట్టివానితోడఁ గలసి మెలసి వర్తింపుచుఁ జిరసౌఖ్య మనుభవింపఁ జాలకుండిన యీ జన్మంబేల?

రుక్మా—చిరసౌఖ్య మను మాట నామనంబున నొక్క వింత యానందమును గల్పించుచున్నది.

మోహి—ఔరా! అంతటిభాగ్యము నా కబ్బెడునా? వింతసుద్దులచేత నీతనిం దేల్చియొద్దఁజేరి ముద్దునెమ్మొగంబు నంది ముద్దుఁగొను భాగ్యము నాకింక లభించునా? చెంగటఁజేరి మడుపులిచ్చుచు నొక్కమడుపు నోటి కందీయఁబోయి నా నోట వైచికొని నాథా యోడితి రోడితిరని గేలిఁజేసి మెప్పించుట నాకుఁ గలుగునా?

రుక్మా—అక్కటా, యిప్పుడీ ముఖసౌందర్యముఁ జూచుటకు నాకు రెండుకన్నులు చాలకున్నవి. ఏమిచేయుదును? (అని కన్నులు నలుచుకొని మరలఁ జూచుచున్నాఁడు.)

మోహి—ప్రక్కనిలిచి నాథా యొక్క రహస్యం బెఱింగింతునని చెవిఁ జేరం జని మక్కువఁ జెక్కిలి చుఱుక్కున నొక్కి "యక్కటా, నాథా! యలసితివి కాఁబోలు, క్షమింపు" మని యాదరించు నెపంబునఁ గౌఁగిలించు భాగ్యంబు నా కబ్బెడునా?

రుక్మా—(సంతోషముతో) హా! హా! యిప్పుడుకదా నాజన్మ సఫలత్వఁ గాంచినది.

మోహి—హా! అంతటి భాగ్యం బెంతటి భాగ్యశాలురకో గద్దా. [25]

చ. కరమునఁబట్టి, యొక్కచవి ♦ గాఁ దరితీపులఁగుల్క పల్కులన్
మురిపెములొల్కనవ్వులను, ♦ మోహపుటట్టల,ముద్దుగుల్కులన్
గరము మదిం గరంచి, బిగి ♦ కౌఁగిటనుంచి, ముదంబు నించుబల్
సరసగుణాఢ్యు పాదజల ♦ జమ్ముల కేను నమస్కరించెదన్. 4

హా ప్రియా! హా మనోహరా! నిన్నింక నా కన్నులఁ నెన్నఁడయినఁ గాంతునా?

రుక్మా—అక్కటా యేమందు.

ఉ. బాపురె! యీమృగాక్షి మృదు ♦ భావము నాపయి నాటఁజేసి,తా
నాపఁగరానిమోహవిర ♦ హాంబుధి ముంచుచు మాటిమాటికిన్
హా ప్రియ!హామనోహర!మ ♦ హాకరుణానిధి!యంచునార్చు, నే
నీ ప్రియకాంత మోహమును ♦ మెట్టులు తీర్పఁగ నేర్తునో కటా!

మోహి—అట్టి భాగ్యశాలుర కొక్క నతిఁ గావించినను మేలగును.

చ. ఎదనెదహత్తి, కోర్కులిగు ♦ రెత్తఁగఁ గౌఁగిటనొత్తి; జిల్గుప
య్యెదఁ గడకొత్తి, కేళితమి ♦ హెచ్చిన కాముకవృత్తి, నెచ్చెలిన్
బదఁపడి మోహవార్ధి భుజ ♦ బంధననైపుణిఁ దేల్చి, యేలు బల్
సదయుని దివ్యపాదజల ♦ జమ్ముల కేను నమస్కరించెదన్. 6

రుక్మా—అక్కటా యి దేమివింత!

గీ. తరుణి విరహార్తిఁ దీర్పంగఁ ♦ దలఁచు చుండ
నాదు చిత్తంబె విరహార్తి ♦ నవయు చుండె;
కొండనాల్కకు మందీయఁ ♦ గోరు చుండ
నుండు నాల్కయె మొదలంట ♦ నూడి నట్లు. 7

(అని మోమువంకఁజూచి) అదిగో! మరల నేమో చెప్పఁబోవుచున్నది.

మోహి—హా! హా! వారలదే సౌఖ్యము.

చ. చెలిఁదలిరాకుపాన్పుపయిఁ ♦ జేర్చి, బరాబరిఁ జెంతఁజేరి, యో
యలికులవేణి!యో జలరు ♦ హానన!యోయమృతాధరోష్ఠి!యో

వలపులబొమ్మ! యంచు మృదు ♦ భాషల నెచ్చెలి గారవించు ని
శ్చలసుచరిత్రు పాదజల ♦ జమ్ముల కేను నమస్కరించెదన్. 8

రుక్మాం—అయ్యో! హృదయమా! నీవు కలవరమందె దేల!

పంచచామరము.

బళా! యిదేమి డెందమా? శు ♦ భప్రతీక నీదెగా?
హళాహళిం గృశించి యిట్టు ♦ లార్తిc జెందె దేటికే?
తలంచు నీవు పెట్టెలోన ♦ దాcచినట్టి సొమ్ముకై
కలంతc జెంద వెఱ్ఱి వండ్రు ♦ కాదె? సుంత తాళుమీ. 9

మోహి.—అక్కటా! నా ప్రాణవిభుc డింకను రాకయుండె. ఏమిచేయుదు? హా! మరుండు సుమశరుండై న న్నలయింపc జూచుచున్న వాcడు. ఔరా, మదనా! ఇది నీ కదనా? నీ వారికి నే నోర్చెదనా? పుష్పబాణుండవగు నీవు పుష్ప కోమలులమగు మ మ్మేcచcదగునా? శుకమా! నీవు క్రోధరసంబెల్ల ముక్కునం బెట్టుకొని యిట్టు లేటికి చెవులు చీదరవోవ వదరెదవు? కొమ్మలcజేరి ఫల భంగంబుc గావించు బుద్ధి నీ కీనాcడు పుట్టెనా? జన్మతోనే కలిగినది. ఇంక నీ వదరుడు చాలింపుము. పికమా గొంతుc జించుకొనుచు నేల యఱ్ఱెగిరి పడెదవు? నీవు పిన్ననాcటినుండి పలుగాకుల కూటమిం బెరుcగుట యెవ్వ రెఱుంగ రనుకొనకుము. భృంగమా! కొమ్మల తావు లపహరించి మదించి మరలc గొమ్మలపై దాడివెడలుచుంటివా? చాలుcజాలు.

అక్కటా! యీ తాపం బెంతయని భరింతును? నా ప్రాణవిభుండు, నా మనోనాయకుండు, నా తొలినోముఫలము, నా మనోభీష్టప్రదాత యింక నా కనుల కగపడు భాగ్యము నాకు లేదు కాcబోలు. హా, శంకరా! (అని మూర్ఛ నభినయించుచున్న ది.)

రుక్మాం—(త్వరపడుచుc దనలో) ఈ యువతి నాపై మోహాతిశయమున విరహా త్క్రాంతయై మూర్ఛనొందుచున్న ది. ఏ నింక నాలసింపc జనదు. (అని సమీ పించుచున్నాcడు.)

మోహి—(తన సంతాపంబును దాఁపనెంచి నట్టులు యత్నించుచు, నించుక సంతోషం బభినయించుచుఁ గూర్చున్నది.)

రుక్మా—తరుణీ! వసాంతరంబున స్వేచ్ఛావిహారంబుననుండు నీ కిచట నెట్టు లుండెనో. ఇచటి రత్నఖచిత సౌధంబులును, శుకశారికారవంబులఁ బ్రతిధ్వను లిచ్చు మదీయారామశ్రేష్ఠంబులును, నీ కేమైన సంతోషదాయకంబులుగ నున్నవా? నీ విచట సుఖంబుగ నుంటివికదె?

మోహి—ప్రాణేశ్వరా! నీ విటులు శంకింపనేల?

క. పరమకృపామయుఁడగు భూ
వరనాథుఁడు చెట్టఁబట్టి ♦ వాంఛలు తీర్పన్
సరసనె వసించి యుండఁగ
నురుతరసౌఖ్యంబు వేఱె ♦ యుండునె చెప్పుమా? 10

అఖండ భూమండలాధీశ్వరులగు దేవరవారి యనవరత సాన్నిధ్యమే నిఖిలకామితార్థదాయకంబై యుండ నే నింక వేఱుగఁ జెప్పనేల?

రుక్మా—ఔరా, యెట్టిమాటఁ బల్కితివి!

క. తరుణీరో నీ సాన్నిధ్యమె
మఱిమఱి వాంఛించు నట్టి ♦ మాబోంట్లకు నీ
దరి నివసించెడి భాగ్యం
బురుతర సామ్రాజ్యపదవి ♦ నొందుట కాదే? 11

మోహి—సరసాగ్రేసరులగు దేవరవారికి నేను విన్నవింపవలసిన దేమికల్గు? వినుము

సీ. అఖిలాండకోటి బ్ర ♦ హ్మాండనాయకుని ది
వ్యాంశ కేఘనుఁడు పు ♦ ణ్యాలయంబు
సకల దివ్యాంగనా ♦ చక్రంబునకు నే మ
హాత్ముని గృహసీమ ♦ యాటపట్టు
సంగీత సాహిత్య ♦ సరసకవిత్వ బో
ధలకే సుజను సేవ ♦ తల్లి దండ్రి

ధర్మసంస్థాపన ♦ తత్పరత్వమునకు
నే మహాజనుఁడు శ్రీ ♦ రామమూర్తి

గీ. ఏ సుజనుచెల్మి యింద్రలో ♦ కైక భోగ
మే సరసుకల్మి శ్రితచక్ర ♦ వాస భూమి
యట్టి మహనీయుఁడైన ధ ♦ రాధి నాథు
చెలిమి కల్గుట తొలిపుణ్య ♦ ఫలము కాదె? 12

ఇదంతయు దేవరయెఱుంగనిదికాదు. మనోహరా! యీ విడెంబుఁ గైకొనెదరా?

రుక్మా—మహాభాగ్యముకదా? కీరవాణీ! నీ వీ మడుపులిచ్చుతటి మనోహరంబగు నొక్క పాటఁ బాడవలయు.

మోహి—ఏపాటఁ బాడుదును ప్రాణేశ్వరా?

రుక్మా—అరణ్యమధ్యమ్మున నేను వేటాడి యలసి నిదురించియున్నతటి నా చేరువ సంపఁగివృక్షంబునీడను గూర్చుండి ధన్యునింగూర్చి నీవు పాడిన పాటను నా మనంబు మరలమరల వినఁగోరుచున్నది. దాని నొక్కతూరి పాడుము.

మోహి—చిత్తము ఆలాగే పాడెదను. (అని యిట్లు పాడుచున్నది.)

ద్విపద - ఖమాచిరాగము - ఏకతాళము - మిశ్రజాతి.

[16] అల్లరిమారుని ♦ యలయికలకును &c., &c., 11, 12, 13, 14,

రుక్మా—ఆహా! కీరవాణీ! ఏమి దీని మాధుర్యము! ఈపాటయే నాయదృష్టదేవతఁగా దలంచెద. ఏలయన, ఇట్లు నీ చెంతఁజేరి నీ శారీరసుఖంబు కొల్లలుగ ననుభవించు భాగ్యమును గలిగించి నన్ను ధన్యుని జేసినది యీ పాటయే. ప్రాణసఖీ! ఇప్పుడు నిశీధ సమయం బగుచున్నది. ఏను విశ్రమించెద.

మోహి—చిత్తము. ప్రాణేశ్వరా! ఇప్పుడు నాకును నిదుర కన్నులఁ గ్రమ్ముచున్నది. (అని యిద్దఱును శయనగృహంబున కరుగుచున్నారు.)

(తెరలోపల జాంఘికుఁడు.)

ఓహోయి, ఛమస్తమయినోరు యినండి. యినండి. తెల్లారు జాము అయ్యింది నాలుగు గెంట లయ్యింది. తెల్లారితే యాకాశి. అంత్యా నిద్దర లెగవాలిశింది.

యాకాశిరతం శెయ్యాల. అంతా లెగశి, మొగాలు కడుక్కొని, తానాలు శెయ్యాలిశిం దోహోయి.

రుక్మాం—(చాటింపు విని శయనగృహమునుండి వెలికి వచ్చి తనలో) అక్కటా! ఏమి యీ చిత్రంబు! రేపటి దినంబే యేకాదశి యఁట.

క. ఏకాదశి యేకాదశి
యేకాదశి యంచుఁ బలవ ♦ రించెడు నేనే
యీ కాలంబున నకటా!
యేకాదశియనెడు మాట ♦ యే మఱచితిఁగా! 13

ఇట్లగుట కామినీలోలుండ నగుటచేతనే కదా. కావుననే కామినీసంగమంబులు పుణ్యస్వర్గవిఘ్నకారణంబు లని పెద్దలు చెప్పుదురు.

మోహి—(నిదురలేచివచ్చి యా ప్రక్కను రాజున కగపడకుండునట్లు నిలిచి విని తనలో) ఔరా! కామినీసంగమంబులు పుణ్యస్వర్గవిఘ్నకారణంబులా! (అని రాజు నుద్దేశించి తనలో)

ఉ. కామినిలేకయే యిటు జ ♦ గంబులు కల్గెనె? భోగ మబ్బెనే?
నేమము నిష్ఠలుఁ జెలుపు ♦ నీవు జనించితె? పుత్రపౌత్రులం
చీ మహి నెల్లవారలు ర ♦ హిం గనుచుండిరె? నేఁటికి గతిఁ
గామిను లక్కటా దురిత ♦ కారిణులైరె? సెబాసు భూవరా! 14

రుక్మాం—అయ్యో! యిప్పటికే కాలహరణమయినది. వ్రతసమయం బాసన్నమగుచున్నది. నే నింక సత్వరంబునం జనవలయు. (అని నాలు గడుగులు నడచి) మోహినికిఁ జెప్పకయే పోవుదునా? చెప్పినఁ బోవనీయ దేమో! అయిన నిపుడు నిద్రించుచుండెఁగదా. మేల్కొన్న వెనుక నేను చెంగట లేకుంటఁ జూచి యెంతకోపగించునో! ఎన్నఁ డెడఁబాయనని మున్నే బాసఁజేసియుంటి. ఇట్టి సఖి నెట్టు లెడఁబాసి పోవుదు? (అని కోపముతో) ఛీ! ఏమి యీ సందియము! యౌవనమదాంధుఁడనై పువ్వుఁబోఁడుల కౌఁగిండ్లందగిలి తుచ్ఛంబులగు భోగంబు లనుభవించుచు, సర్వాభీష్టప్రదంబును, సమస్తకలుష నాశకంబును, శ్రీవిష్ణుప్రీతికరంబును నగు హరివాసరవ్రతం బాచరింపఁజనుటకు సంశయించు

చున్నవాఁడ. ఇది యెంతటి వెఱ్ఱితనము. (మెల్లఁగాఁ గొంచెము నడచి) పోవలె నన్నఁ గాళ్ళు రాకున్నవి. మోహిని కోపగించునేమో. వనంబుననుండి కొని వచ్చినదాదిగ నాయం దత్యంతానురాగంబున మెలఁగుచున్నది. ఒకప్పుడైన నా మనంబును నొప్పించి యెఱుంగదు. అట్టి ప్రియురాలికిఁ జెప్పక యే నెట్లు పోవనేర్తు?

మోహి—(హర్షముతోఁ దలయూఁచి తనలో) ఈపాటి మోహము నీ హృదయమం దుండిన, నా యుద్యమంబునకుఁ గొరంత కలుగనేరదు.

రుక్మాం—నిద్దురలేపి చెప్పి పోదునా? చెప్పినఁ బోవనీయదేమో. పోనీయకున్న వ్రతభంగం బగునుగదా. (రౌద్రముతో) ఆఁ! ఏమీ! వ్రతభంగమా? ఔరా! వ్రతభంగం బన్న నా మేను వడఁకుచున్నదే. ఇట్టి

ఉ. వేపురు కాంతలేని, పది ♦ వేల సుఖంబులునేని, శిష్ట సం
భావితమై, యజాదిసుర ♦ మానితమై, వరమానియోగి సం
సేవితమై, మహాసుజన ♦ చింతితమై, శతకోటిభక్తలో
కావనమైన యీ వ్రత శ ♦ తాంశమునైనను బోలనేర్చునే? 15

కావున నిప్పుడు సర్వవిధంబుల వ్రతం బాచరింపఁ జనుటయే కర్తవ్యంబని తోఁచుచున్నది. ఇప్పటికే కాలమతిక్రమించుచున్నది.హా! ఈశ్వరా! దీనబంధూ!

మ. దురహంకారుఁడ, దుష్టచిత్తుఁడను, మ ♦ త్తుండన్, నికృష్టుండ, నే
దరుణీలోలమనస్కుఁడౌచును భవ ♦ ద్భక్తిం బ్రవర్తింప నే
మరితిన్ నీ పద మాశ్రయింతు వరదా! ♦ మన్నింపవే తప్పులన్
గరుణాసాగర! దీనబాంధవ! జగ ♦ త్కల్యాణ! సర్వేశ్వరా! 16

(అని మోకాఁళ్ళపై నిలిచి మింటికై దృష్టినిగిడించి నమస్కరించుచుండఁగా)

మోహి—(తనలో) ఇప్పుడింక నూరకుండఁజనదు. (తటాలునవచ్చి చేయిపట్టుకొని) [26] ఇదేమి ప్రాణనాథా! నీవిచట నేమి చేయుచుంటివి? నన్నొంటిగ నింట విడిచి నీ విచట నొంటరితనంబున మింటికై చూచుచు నేమో గొణఁగుచుంటివి. అదియేమి? అలసి నిదురించుతటి నేమైనఁ బీడకలఁ గంటివా?

రుక్మా—తరుణీ! కాదు. నేఁ డేకాదశీవ్రతం బాచరింపవలసి యున్నది. దాని నింతదనుక మఱచితిఁగదా యని క్షమార్పణ పూర్వకంబుగ నా హరిని స్మరింపుచున్నవాఁడ.

మోహి—చాలుఁజాలు రాజేంద్రా! మన కేమి, వ్రతమేమి! అంతఃపురమునకుఁ బోవుదము రమ్ము.

రుక్మా—తరుణీ! యిట్లు పల్కఁ జనదు. ఈ హరివాసరవ్రతం బవశ్య కర్తవ్యంబు. ఈ దినంబున కామినీ సంగమంబులు కేవలదూష్యంబులు. నీవును నన్నుం జేరి వ్రతం బాచరింపుము. ఇది సర్వోత్కృష్టమైన వ్రతంబు. సమస్తకలుష నాశకంబు. శ్రీవిష్ణు ప్రీతికరంబు. దీనిచే నీకును శ్రేయంబగు.

మోహి—(పకపక నవ్వి) రాజేంద్రా! నేఁడేమో క్రొత్తవానివలెఁ బ్రసంగించుచుంటివే!

చ. వ్రతమఁట, మౌనివంద్యమఁట, ♦ పాపహరంబఁట, దానినిట్టి భూ
పతియఁట, యాచరించునఁట ♦ బాపురె! సజ్జనులార! వింటిరే?
అతులసుఖాబ్ధిఁ దేలుచు మ ♦ హావిభవంబున నోలలాడు భూ
పతులకు నిట్టి దుర్భ్రమలు ♦ పాడియె? లోకులు విన్న నవ్వరే?

ఇట్టి వ్రతంబును నేనుగూడ నాచరింపవలయునా!

ఉ. ఆరయ కుంటి, గ్రుడ్డి, వికఁ ♦ లాంగులు, వృద్ధులు, కుష్ఠరోగులున్
దారు జగాన నేరికి వృ ♦ థాయగుటం దమ ప్రొద్దుపోకకున్
సారెకుఁ గృష్ణ! కృష్ణ! హరి! ♦ శౌరి! ముకుంద! యటంచుఁ జప్పటల్
వారక దట్టుచున్ మది నె ♦ బాసనుకొంద్రు తమంతఁ దృప్తులై.

అట్టివారిం కఁ గొంచెము యుక్తిపరులును సమర్థులునుఁ గూడ నగు నెడ

ఆ. తమ్ముఁ జేరు వారిఁ ♦ దమబోంట్లఁగాఁ జేయ
బుద్ధిఁ గఱపి యిటులె ♦ బోధఁ జేసి
నరగ వ్రతము లంచు ♦ సంతర్పణము లంచు
వారి నెల్ల గతులఁ ♦ జూరఁ గొంద్రు.

ప్రాణనాథా! నీ కెచ్చటనో యిట్టివారి మోసములలోఁ దగిలినట్లు కనవచ్చుచున్నది. లేకున్న నిన్నటిదనుక నంతఃపురంబున కామోపభోగంబు లనుభవించుచు నన్నుంగూడి సరససల్లాపంబులచేతఁ గాలంబుపుచ్చుటయేడ! నేఁటిదినంబునఁ గృష్ణకృష్ణాయంచు, గోవిందగోవిందాయం చఱచుచు వెఱ్ఱివానిపగిది నానందించుట యేడ! ఇట్టిది చూడ నెవ్వరికైన నాశ్చర్యంబుగనుండదా? పరులు వినిన నవ్వరా? నాథా! ఇట్టి వెఱ్ఱితలంపులు విడిచిపెట్టుము. సంశయింపక యంతఃపురంబునకుఁ బోవుదము రమ్ము.

రుక్మా—తరుణీ! ఈ వ్రతంబు లాచరించుమనుట యంతయు వ్యర్థుల బోధయనియా పల్కుచుంటివి?

చ. భువి సకలార్థబోధన ల ♦ పూర్వగతిం దగఁ జేసినట్టి యా
ప్రవిమలమూర్తులా మను ప ♦ రాశరముఖ్యులె తెల్పలేదె యి
ట్లవసరబోధ లెల్ల? నస ♦ మర్థులె వార లఖండ ధర్మ శా
స్త్రవిరచనాధురీణులును ♦ సజ్జనమాన్యులు గారె? కోమలీ! 20

నీ వీ వ్రతమాహాత్మ్యం బెఱుంగక బేలవై యిట్లు తూలనాడితివి. ఇదిగాక

గీ. ధరణి సద్బ్రాహ్మణునకిచ్చు ♦ ద్రవ్యగరిమ
యార్తునకుఁ బ్రీతిఁ జేయు సా ♦ యంపు మహిమ
నెన్న నజునకు నానె? నీ ♦ వేల వెఱ్ఱి
మాట లాడెద వబల క్ర ♦ మంబుఁ దప్పి?. 21

ఈ హరివాసర వ్రతంబునుఁ బోలు వ్రతం బింకఁ గలదా? ఈ దినం బంతయు నుపవసించి విష్ణుకథాలాపంబులచేతనే కాలంబుఁ గడపవలయుఁ గాని యంతఃపురం బన్నమాటఁ దలఁపనైన రాదు. అంగనామణులఁ గన్నెత్తి చూడనైనఁ జనదు. కావునఁ గోమలాంగీ! నీ వింకఁ జనుము.

మోహి—(ఈసడించుచు) నీ విచటనుండ నేనెచటికరిగెద? నీవును వెడలిరమ్ము. ఉభయులము పోవుదము.

రుక్మా—తరుణీ! నేటిదినంబంతయు మాత్రము నన్ను విడువుము. పలుకరింపకుము. లేకున్న వ్రతంబున కాటంకంబగు.

మోహి.—రాజేంద్రా! ఏమి నీ వాక్యంబులు! ఏమోవ్రతంబఁట! అట్టి వ్రతంబున కాటంకంబఁట! వయసుచెల్లినవెనుక పండ్లూడి, కన్నులు కానరాక, చెవులు వినరాక, దేహేంద్రియములెల్ల శుష్కించి, యొరులు ముట్టుటకును జూచుటకును గూడఁ గొఱగాకయుండునట్టి వార్థకదశయం దిట్టివ్రతంబులు వేయి నోఁచినను నోఁచఁదగును. కాని యట్టి వృద్ధత్వంబున నీవు కావలయునని కోరినను ఇట్టి కామినీసౌఖ్యంబు లనుభవింప సమర్థుండవై యుండఁగలవా?

క. ఆఁకలి దప్పులఁ గనలుచుఁ
ప్రాకటమగు యౌవనంబుఁ ♦ బా డొనరింపన్
నీకెట్టులు మదిఁ దోఁచెను?
తోఁకకు కళ్లెంబు వెట్టు ♦ దురె యెవ్వరైనన్?. 22

సీ. నా ప్రాణనాయక ♦ నా మనోహర! యంచుఁ
జెక్కు నొక్కెడు సఖు ♦ లొక్క చోట
రాజ్యతంత్రము లోన ♦ రఁగఁ జెప్పి విసికించు
నురు పురోహిత మంత్రు ♦ లొక్క చోట
తాత తండ్రులనుండి ♦ జాతలు మీారంచు
మ్రొక్కి వేఁడెడు శ్రితు ♦ లొక్క చోట
వనమృగంబుల బారిఁ ♦ బడలేము రక్షించు
మో ప్రభూ! యను పౌరు ♦ లొక్క చోట

గీ. నెల్ల విధముల నిన్నల ♦ యించు చుండ
జపతపంబులు వ్రతములు ♦ జరగు టెట్లు?
గాసి నొందకు వ్యర్థోప ♦ వాసములను
జనదు జన దిట్టిరీతి యౌ ♦ వనము నందు. 23

యౌవనము ఝరీవేగతుల్యం బనుమాట నెఱుంగవా? ఇట్టియౌవనంబంతయు నీ యుపవాసంబులకును, నేమంబులకును నిష్ఠలకును ధారవోసి పిమ్మట వార్ధకంబున నీవు చేయునది యేమున్నది? కాలు కదల్పలేని కాలంబున కామినీ సౌఖ్యంబు లనుభవింపఁబోయెదవా?

క. తల నరసి యొడలు వడఁకుచుఁ
బలుకులు తడఁబడఁగ వయసు ♦ బాసిన వెనుకన్
లలనలు చెలియలు నేటికి?
చలిపోయిన వెనుక మంచి ♦ సాలుల కరణిన్ 24

అప్పుడు నీ యందలి యసమర్థతం జూచుకొని వృథా వగవఁ జొచ్చిన నేమి ప్రయోజనంబగు ? గతజలసేతుబంధనంబుగ నుండుఁగద. ఇంక నట్టి వార్ధకదశ నీ వ్రతంబుల కనుకూలంబుగ నుండును. సర్వవిధంబుల నదియే తగిన సమయము. ఎట్టులనిన:

ఉ. వ్యర్థమటంచు నష్టప్రియ ♦ భామలు పల్మరుఁ జేరరారు; నీ
యర్థము రాజ్యమున్ సుతున ♦ కర్పణసేయఁగనౌను; జన్మమున్
సార్థకమంచునెంచి యని ♦ శంబును నొక్కెడఁ గూరుచుండి, యా
వార్థకమందు నెన్నియుప ♦ వాసములైనను జేయఁగాఁదగున్.25

ఇంక నెన్ని వ్రతంబులనైన నాచరింపవచ్చును. ఎంతసేపైన గోవింద గోవిందా యని యఱచుచుఁ గూరుచుండవచ్చును. కాని యిప్పుడు వ్రతంబులేల నాథా? ఇట్టి వెఱ్ఱితలంపులెల్లఁ గట్టిపెట్టి యంతఃపురంబునకుఁ బోదమురమ్ము. కలిసి వచ్చు భోగంబును గాలఁ దన్నకుము.

రుక్మా—తరుణీ! నీ పల్కులును సత్యంబులే కాని యే నొక్క ధర్మసూక్ష్మం బెఱింగింతు వినుము.

ఉ. కన్నియ! యౌవనం బిహసు ♦ ఖంబులఁ జెందనెకాదు; చూడుమిం
దెన్నఁగ ధర్మరక్షణము, ♦ నీశ్వరసేవయు, సాధుమైత్రి, యా
పన్నజనావనంబు, గురు ♦ భక్తియు, సద్వ్రతముల్, జపంబు లి
ట్లెన్నియొ చేయఁగావలయు ♦ నిన్నిఁటి వీడి సుఖింపఁ బాడియే?

ఇదికాక

చ. ఇల జనియించు టేలయొకొ, ♦ యెచ్చటికేగుటొ, యేమిదిక్కొ, యా
వల గతియేమొ, కానకయె ♦ భామలకౌఁగిళులందుఁ జిక్కి హా

కలదిఁక యౌవనం బనుచుఁ ♦ గామసుఖంబులె కోరఁజెల్లునే?
కలిగెను నోరటం చిలను ♦ కట్టడి తప్పి భుజించు టొప్పునే? 27

ఈ వ్రతంబులు వార్ధకంబునఁ జేయఁదగుననియు, యౌవనము ఝరీవేగ తుల్యంబనియుం జెప్పితివి. కాని జీవనము బుద్బుదప్రాయం బను మాట మఱచితివి కాఁబోలు.

ఆ. మాయ బొమ్మ సుమ్ము ♦ మానిని! దేహమ్ము
క్షణము లోన నట్టె ♦ సమసి పోవు;
దీని సత్య మంచుఁ ♦ దెల్వి చాలక నమ్మి
మురియు చుంద్రు వెఱ్ఱి ♦ మూర్ఖు లతివ!. 28

ప్రపంచ మున్నంతకాలము బ్రతుకుదుమంచుఁ దలంచితివేమో. ఎప్పుడో కాలుఁడు మ్రింగఁగాచియున్నవాఁడు. శ్లో. నిత్యంసన్నిహితోమృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః అన్నట్లు మృత్యు వెల్లప్పుడు మన వెంట నంటియే తిరుగుచున్నది దేహేంద్రియాదులు బలవత్తమములై యుండునప్పుడే నరుండు హరిసేవాపరుం డై వర్తింప వలయు. కావున భాసురాంగీ! ఈ ప్రసంగంబులు చాలించుము. ఇష్ట ముండిన నీవును వ్రతం బాచరించుము. నీకు శ్రేయంబగును. లేకున్న నేఁటికిఁ జనుము. రేపటినుండి మన యిచ్చవచ్చిన ట్లుండవచ్చును.

మోహి—[27] సెబాస్, రాజేంద్రా! మంచి జ్ఞానోపదేశంబుఁ గావించితివి. మిగుల సంతసించితి. న న్నరణ్యంబునఁ గాంచి, మోహించి, వరించి, కొనితెచ్చినదెల్ల నిట్టి వ్రతంబు లాచరించుమనుటకేనా? ఇంక నీకుఁ జెప్పవలసిన దేమున్నది?

గీ. ఉండినట్టులె వనమున ♦ నుండ లేక
కుడిచి కూర్చుండి నిక్క జేరి ♦ గొప్ప తగులు
తెల్వి చాలక నీతోడఁ ♦ దెచ్చుకొంటి
కొఱవి తోడుతఁ దల గోఁకు ♦ కొన్న రీతి. 29

మత్తకోకిల—పూరికల్యాణి రాగము—త్రిపుట తాళము—త్రిశ్రజాతి.

పంకజాక్షునిఁ బార్వతీప్రియు ♦ భక్తినెప్పుడుఁ గొల్చునట్
శంక లేకయె దాసి బాసలొ ♦ సంగి నేఁడిటు చేసితొ

నింక నిన్నన నేల నీ విటు ♦ లెంతకైనను జాలవే?
చంకబిడ్డల జారఁదీసెదు ♦ జాణ వౌదువు భూవరా! 30

ఎన్నఁడు నిన్నెడఁబాసి యుండనంచుఁ బాసఁజేసి, కొనివచ్చి, యే నిప్పుడు మదనప్రేరితనై వేఁడుకొనఁగా నేకాదశియంచును బున్నమయంచును దినంబులు కడపఁ జొచ్చితివి. హా! ఏమి నీ సత్యవాక్యపరిపాలనాధురీణత్వంబు!

ఉ. సత్యవిహీనుఁడైన విర ♦ సంబుగఁ జూతురు సాటివార లే
భృత్యుఁడుగాని మాట చెవిఁ ♦ బెట్టఁడు, పెద్దలు చేరరారు, దాం
పత్యమునందుఁ గూడ నెడఁ ♦ బాపులు కల్గును; గాన భూవరా!
సత్యము లేకయున్న నరు ♦ జన్మమ దేటికి యీ జగంబునన్ 31

రుక్మా—కోమలాంగీ! ఇప్పు డసత్య మెవ్వరు పల్కిరి?

మోహి—ఎవ్వరుపల్కిరా! అవునవును. (అని తలయూఁచి) హా! ఎంతటి ద్రోహచిత్తుఁడవు!

రుక్మా—నేను గావించిన ద్రోహమేమి?

మోహి—ఒక్కటిరెండైనఁగదా లెక్కించి చెప్పనగును! శతాపరాధికి దోషనియమ మెట్లు? నీవు నిరపరాధి ననుకొను చుంటివి కాఁబోలు. ఇటు వినుము.

చ. అట నన్నుఁ జేరలేదె?

రుక్మా—నిజమే చేరితిని.

మో—విర ♦ హార్తుఁడ నంచును బల్కలేదె?

రుక్మా—పల్కినమాటయు నిజమే.

మో—ఏఁ। చుటయిది పాఁడికాదనుచుఁ ♦ జొక్కుచుసోలుచు వేఁడలేదె?

రుక్మా—ఇదియు సత్యమే.

మో—ఎ। ప్పటికిని నన్నుఁ బాయనని ♦ బాస లనేక మొనర్పలేదె?

రుక్మా—యథార్థమే.

మో—ఈ। యటమట లేల నేఁడు? నిజ ♦ మాడిననిష్ఠురమౌను భూవరా!

రుక్మా—ఇప్పుడుమాత్ర మేమి కల్గినది? నేఁ డొక్కదినమే కడ నిన్నెడఁబాయ

వలసి వచ్చినది.

మోహి— (ఆగ్రహముతో) హా! ముగ్ధాంగనాచిత్తచోరా! స్వకార్యనిర్వాహణ విచారా!

శా. ఏవేళన్ బరపూరుషున్ దలఁపకే ♦ యెంతో ముదంబంది స్వే
చ్ఛావృత్తిన్ విహరించునన్ గదిసి, యా♦సల్ గొల్పి, కన్యాత్వమున్
బోవన్ ద్రోచి సుమాస్త్రశాఁకకిటులన్ ♦ ద్రోయంగ నౌనే నృపా?
వేవే వృక్షము నెక్కు-మెక్కు-మని యీ ♦ వే నిచ్చెనన్ దీసెదే?

ఇట్టివాఁడ వొక్క-చోఁ గూరుచుండి నిష్కా-ముఁడవై తపంబాచరించుకొనఁ జాలక నన్నేల కొనితెచ్చితివి? ఇట్లిదివఱ కెందఱను మోసపుచ్చితివి? ఇంక నెందఱ మోసపుచ్చఁ దలఁచితివి? నీ నూర్వురు సతుల నిట్లే తెచ్చితివికాఁబోలు. ఇట్లు నిముసంబునకు నూఱబద్ధములాడు నీవంటి మోసగాండ్రకేనా కావలయు నీవ్రతంబులన్నియు! ఇట్టి వ్రతనిష్ఠలు కలవాఁడవు ముందే నాతో నేల చెప్పవైతివి?

రుక్మా—ఓ మత్తగజగామినీ! ఏల న న్నిట్లు తూలనాడెదవు?

ధ్రువకోకిల-త్రిపుట తాళము-త్రిశ్రజాతి.

పడఁతి! సిన్ననినంత మ ద్ప్రియ ♦ పత్ను లెల్లర నూర్వురన్
విడిచివైచితి నిన్నుఁ జేరితి ♦ వేవిధంబులఁ బొంగితిన్
అడుగు దాఁటక నీదు భృత్యుఁడ ♦ నౌచునుంటి సఖీ యెటో
కడపు నేఁటికి; రేపు నీమదిఁ ♦ గల్గురీతిఁగ నుండెదన్. 34

ఈ వ్రతకారణంబున నేకద నిన్నొక్కి-ంత యెడఁబాయవలసివచ్చె. వనంబున నిన్ను వరించుతఱి నేకాదశీవ్రతదినములయందుమాత్రము నీ చెంతకు రాఁజాల నని తెలుప మఱచితి. అందుకు మాత్రము క్షమించుము. ఇంక నీ మనంబున సంశయింపకుము. నేనెప్పటికి నీవాఁడననియే యెఱుంగుము.

మోహి—రాజా! నాముందరనా నీవగలు చూపవచ్చెదవు? (నిందాగర్భముగా) అరణ్యంబునందు నన్ను వరించుతఱి నేకాదసులమాటఁ దెలుప మఱచితివి. వట్టి ఁడవు.

ఉ. పాపము! చిన్నిపాపఁడవు ♦ ప్రాగ్గొనసైననుఁ జేతరా దదే
పాపమొకాని నాఁడు హరి ♦ వాసరవాక్యము వీడినావు; నేఁ
డీపని జ్ఞప్తికందినది; ♦ యే పని ♦ రేపిఁక జ్ఞప్తి కందునో
భూపతినంచు నిల్లు పలు ♦ పోకలుపోవ జగంబు మెచ్చునే?. 35

చెప్పెడివి శ్రీరంగనీతులు దూరెడివి దొమ్మరిగుడిసెలన్నట్లుగానే యున్నది.

రుక్మాం—[28] (ఒక్కింతకోపముతో) తరుణీ! ఏల యిట్లు వృథాప్రసంగంబులఁ గావించెదవు? మాటిమాటికి వ్రతంబు విడువుమంచుఁ బల్కెదవు. యజ్ఞయాగాది క్రతువులందైనను, వివాహోపనయనాది శుభకార్యంబులందైనను, జాతమృత సూతకంబులందైనను, రోగపీడితులైనను, పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, సకలజనులు నాచరింప వలసిన వ్రతమైయున్నది. ఇట్టివ్రతంబునుమాన నేర్తునా!

చ. క్షితి సకలంబు నిత్తు, గత ♦ శీలునకైనను కేలుమోడ్తు, నే
వెతలకునైన నోర్తు, మఱి ♦ వేయి సుఖంబుల నుజ్జగింతు, మ
త్సుతుని శిరంబునైన నిటఁ ♦ ద్రుంతునుగాని బళారె! యిట్టి స
ద్వ్రతమునుమానఁజాలఁ నిది ♦ తథ్యము తథ్యము తథ్యమంగనా!

నీ వృథాప్రసంగంబులు కట్టిపెట్టుము. నీవేకాదు. దేవేంద్రాదిదేవతలెల్లరును వచ్చి యడ్డగించినను మాన నని యెఱుంగుము.

మోహి—(తనలో) రాజేంద్రుఁడిట్లు శపథము చేయుచున్నవాఁడు. ఇఁక నీతండు వ్రతంబు మానుటెట్లు? అయిన నీతని నింతటితో విడువఁజనదు. (అని ప్రకాశముగా) రాజేంద్రా! నీవు సత్యవ్రతుండవు. నిజభక్తితో వ్రతంబాచరించుచున్నవాఁడవు. ఈవ్రతంబునకై "మత్సుతునిశిరంబునైననిట ద్రుంతు" నంచుఁబల్కితివి. సరే. అట్లేకావింపుము. నీకులేనివిచారము నాకేల? లేకున్న వ్రతంబువిడిచి లేచిరమ్ము.

రుక్మాం—(విస్మయమును దుఃఖమును బొందుచుఁదనలో) హా దైవమా! దీనబంధూ! ఆశ్రితకల్పభూరుహా! దేవా! నీమహిమం బగణ్యంబుకదా. అరణ్యంబున దుష్టమృగంబు లపారంబుగ జన్మించుట. సాధుసంరక్షణార్థంబుగ వానిని సంహరింప జన నిక్కాంత ప్రత్యక్షమగుట. అంత నేను మోహపరవశుండనై వరించుతఱి బాసలుచేయించుట. సర్వజనస్తవనీయమగు నీ వ్రతం బీమె కనిష్టంబగుట.

నేను వ్రతాపేక్షానూచకంబుగ సుతుఁడైన ఖండింతు ననినమాత్రంబున నట్లే ఖండించుమని యీమె బాధించుట. ఇది యంతయు నీవిలాసంబుకాకున్న నిట్టి విచిత్రం బుండునా? భక్తవత్సలుండవగు నీవే మమ్మిట్టి కఠినపరీక్షలఁ జిక్కించి యలయింపఁ జూచిన మా కింక దిక్కెవ్వరు? నిన్ను సేవించి సులభంబుగఁ గడతేర నెవరు సాహసింతురు?

ఉ. మేలగుసామివంచు, మిడి ♦ మేలపుకోల్విది కాదటంచు, నా
కేల భయం బిఁ కన్నిఁటికి ♦ నేలినవారిదె భారమంచుఁ, గా
ఖాలు గుణించినట్టి పసి ♦ కాలమునుండియు నేఁటిదాఁక నిఁ
జాలఁగ నమ్మియుంటి భవ ♦ నాశ ! శ్రితావన ! దీనరక్షకా! 37

ఆపద్బాంధవా! నేఁడు న న్నీవిధంబునఁ బరీక్షింపఁ దలఁచితివా? [29]
(తల వంచుకొని నిలుచున్నాఁడు).

మోహి—రాజేంద్రా! వ్యసనముగానుండెనా యేమి?

రుక్మా—(స్వగతము)

శా. ఔరా! యెంతటిద్రోహచిత్తలు సతుల్ ♦ హా! యెంతక్రూరాత్మ,లా
రౌరా! యేమనఁజెల్లుఁ గామినుల య ♦ త్యాశ్చర్యచారిత్రముల్
వే జేఁ దెల్పఁగనేల యింక నకటా ♦ వేయింటికైనన్ భువిన్
స్త్రీరూపంబునుఁగల్గు బొమ్మనయినన్ ♦ ఛీ! నమ్మఁగాఁ జెల్లునే?

చ. మగువల నమ్మరాదు; పలు ♦ మాయను జెంతకుఁజేర్చి ప్రేమలం
దగులఁగరాదు; నెయ్యము నె ♦ నర్పఁగరాదు; వరించివారి పె
న్వగలకుఁజిక్కరాదు; చిరు♦నవ్వులకున్ భ్రమఁజెందరాదు; దా
చఁగనిఁకనేల; చాలు వెయి ♦ జన్మలకైనను స్త్రీలనెయ్యముల్.

సీ. పరకాంతపై యాసఁ ♦ బడుట దీపపుకాంతుఁ
శలభంబు వడిచుట్లు ♦ నలయు రీతి
కులకాంత విడనాడి ♦ వెలకాంతఁ గూడుట
యోడ వీడి జలధి ♦ నుఱుకు రీతి

పడఁతిబోధలలోనఁ ♦ బడి నటించుట యెల్ల
గారడివాని మ ♦ ర్కటము రీతి
భామకౌఁగిలిఁ గోరి ♦ బాసఁ జేయుటఁ జూడ
కుంపటి మెడఁ గట్టు ♦ కొన్న రీతి
గీ. వనిత వలచుట యగ్గిలోఁ ♦ బడిన రీతి
కొమ్మ నెయ్యము గుఱ్ఱపు ♦ కొమ్ము రీతి
ఎట్టి శత్రునకైన హా ♦ యిట్టి వనిత
వలలఁ దగులుట హాఁసారి! ♦ వద్దు వద్దు. 40

(అని చెంపలు వేసికొనుచున్నాఁడు.)

మోహి—రాజేంద్రా! ఏల విచారించెదవు? పుత్రుని ఖండింతునంటివే. పోనిమ్ము. అతఃపురంబునకుఁ బోవుదమురమ్ము.

రుక్మా—ఏల తొందరనొందెదవు? ఒక్కింత తాళుము. ఎవఁడురా అక్కడ?

(దౌవారికుఁడు ప్రవేశించి)

దౌవా—దేవా! జయమగుగాక. సేవకుఁడు దేవరయాజ్ఞకై వేచియున్నవాఁడు.

రుక్మా—(వ్యసనముతోఁ బెదవులు తడుపుకొనుచు) మదీయపుత్రుండగు ధర్మాంగదుని బిలిచికొనిరమ్ము.

దౌవా—చిత్తము. దేవా. (అని వెళ్ళుచున్నాఁడు.)

రుక్మా—తరుణీ! ఈ వ్రతవిషయం బిట్టు లుండనిమ్ము. మన ప్రసంగవశంబున నా నిత్యకర్మానుష్ఠానసమయంబు వ్యత్యయంబయ్యె. గౌణకాలంబును నతిక్రమించుచున్నది. కావునఁ బుత్రుఁడు వచ్చునంతలో నేను శీఘ్రంబ చని తదనుష్ఠానవిధి నెఱవేర్చుకొనివచ్చెద.

మోహి—ఆఁ! ఏమీ! నిత్యకర్మానుష్ఠానవిధి నెఱవేర్చుకొనెదవా? అట్టులయిన నేనును నీతోడనే వచ్చెద. నీ వరుగుచుండ నిచట నేనేల?

రుక్మా—అట్లే రమ్ము. సందియమేమి? (మోహిని యాతని చెఱఁగుఁ బట్టుకొని వెంట నడచుచున్నది.) (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

# రుక్మాంగదనాటకము.



## షష్ఠాంకము.

రంగము—పుర వీధి.

ప్రవేశము—మాధవుఁడను విద్యార్థి.

మాధ—నా ప్రియమిత్రుఁడు గోపాలుఁ డింకను గానరాఁడయ్యె. కారణం బేమై యుండును? (అటు నిటు చూచి) ఈ వైపునుండి యెవ్వరో వచ్చుచున్నారు! గోపాలునివలెనే యున్నాఁడే!

(గోపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

గోపా—మాధవా! ఇచట నుంటివేమి? హరివాసర వ్రతార్థంబుగఁ బూజాద్రవ్య సంపాదనకై పోవుదమంటివే!

మాధ—అవును గోపాలా! పోవుదము. నీవు జాగుచేయుటచే నీ కొఱకై వెదకుచు వచ్చితిని.

గోపా—అవునవును. కొంచెము జాగైనది. నాకు మన యుపాధ్యాయులుగారు వ్రాసియిచ్చిన ఆటవిడుపుపద్యమును చదివి పెట్టుకొని వచ్చితిని.

మాధ—ఇప్పుడే చదువవలయునా? నా పద్యమును నేను రాత్రియే చదివితిని. నాకు మిక్కిలి మంచిపద్యమును వ్రాచియిచ్చిరిసుమా.

గోపా—అంతకంటె మంచిపద్యమును నాకు వ్రాసియిచ్చిరి.

మాధ—నీకు దేనినిగురించి వ్రాసియిచ్చిరి?

గోపా—పేదవిద్యార్థినిగూర్చి.

మాధ—అట్టి విద్యార్థి విద్యాగ్రహణకాంక్షచే నన్యదేశంబుల కేగ నుద్యమించు తటి నాతనికిఁ గల్గు పాటంకములంగూర్చి నాకు వ్రాసియిచ్చిరి.

గోపా—అట్టులయిన నీ రెండు పద్యములకు నన్యోన్య సంబంధము కలదే! ఏదీ నీ పద్యమును చదువుము.

మాధ—నీ పద్యమునే ముందు చదువుము.

గోపా—అలాగే చదివెదను.

సీ. ఇల్లు వాకిలిఁ బాసి ♦ యిష్టబంధుల రోసి
పొరుగూరు విద్యకై ♦ పోయి పోయి
శ్రద్ధతోఁ బాఠముల్ ♦ చదువలేదని కొట్టు
చదువ్రలయ్యకుఁ గేలు ♦ చాఁచి చాఁచి
కూడుగుడ్డలు లేక ♦ కొంప కొంపకుఁ బోయి
యయ్యలమ్మల బిచ్చ ♦ మడిగి యడిగి
రేపువచ్చుఁ బరీక్ష ♦ మాపు వచ్చునటంచు
నూరక యుష్విళ్లు ♦ లూరియూరి

గీ. పాఠములనెల్లఁ బాటలు ♦ పాడి పాడి
కడకు జయవార్త వినఁగను ♦ గాచి కాచి
సఫలతనుజెంది యావార్త ♦ చాటి చాటి
పూజ్యతను బొందు బాలుని ♦ బుద్ధి బుద్ధి

మాధవా! నాపద్యమును వింటివికదా. నీపద్యమును జదువుము.

మాధ—గోపాలా! ఇట్టివిద్యార్థి నూతనవిద్యాగ్రహణేచ్ఛచేఁ దనకుఁ బ్రేమాస్పదు లగు బంధుమిత్రాదుల నెడఁబాయుచున్నాఁడు. ఇది యెంత దుష్కరము!

సీ. నా ముద్దు బిడ్డఁడా? ♦ నా మేల్మి బంగార!
యనుచు ముద్దిడు తల్లి ♦ నట్టె విడిచి

యాడుకొందము రార ♦ యన్న న్న! యని పిల్చు
బుడుతలకెల్ల దో ♦ బూచి వెట్టి
యెడఁబాయఁజాలక ♦ తడఁబడు హితకోటి
కిదుగో వచ్చెద నంచు ♦ నెట్లొ చెప్పి
మహితవిద్యగడించు ♦ మాయసి దీవించు
పాత గురున కొక్క ♦ ప్రణతిఁ జేసి

గీ. చదువు సాధించు కోరిక ♦ సందడింపఁ
బురము వెలువడు ధృతిఁదూలి ♦ బుద్ధిశాలి
యకట! విద్యల కిటు లెన్ని ♦ యగ్లు తగులుఁ
గాన వీరికిఁ దోడ్పడు ♦ ఘనులె ఘనులు.

గోపా—మన పురమందలి పేదవిద్యార్థుల కెట్టిలోపంబులును గలుగక యుండు నట్లు మన ప్రభువువారు సమస్త సౌకర్యముల నమర్చియుండిరికదా.

(శంకరుఁడను మఱియొక విద్యార్థి ప్రవేశించి)

శంక—హా! రాకొమరున కెట్టి యిక్కట్టు రానున్నదోకదా. (అని యిటుచూచి) మాధవా! గోపాలా! మీ రిచట నేమిచేయుచుంటిరి?

మాధ—శంకరా! నేఁ డేకాదశి యని నీవు నెఱుఁగుదువుకదా. తద్వ్రతార్థము పూజాద్రవ్యసంపాదనకై పోవుచుంటిమి.

శంక—పూజాద్రవ్యములా? అక్కటా! పూజావిషయమే సందేహాస్పదమగు చున్నది. రాకొమరున కేమగునో. (అని భయము నభినయించుచున్నాడు.)

గోపా—మిత్రమా! అట్లనెద వేమి?

శంక—మిత్రులారా! సుకుమారుండగు రాకొమరుండు నేఁడు సెలవుదిన మగుటచే నాబోఁటి తోటివిద్యార్థులఁ గూడి యొక్కదివ్యభవనంబున ప్రహ్లాదుని చరితం బానందంబుగ నాలకించుచుండ నొక్క రాజభటుం డరుదెంచి సత్వరంబున నక్కుమారుని రాజసమ్ముఖంబునకుం గొంపోయె. దీనికిఁగతం బేమైయుండునో.

మాధ—అఁ, యేమైయుండును. ప్రభువులు నూతనప్రియులుకదా. ఏదేని నూతన

వస్తుసందర్శనార్థమై పిలిపించియుందురు.

శంక—కాదు కాదు. రాజేంద్రుఁడును, మోహినీదేవియు నేఁటి వ్రతముంగూర్చి వాదులాడుచుండిరనియు విని, పరితపించుచుంటిని.

గోపా—అయిన నేమి? ఆయన తండ్రికాఁడా! ఆమె తల్లికాదా? తలిదండ్రుల చెంతకుఁ బుత్రుఁ డేగుటయందుఁ బరితాపకారణం బేమికలదు?

శంక—కలదు. కలదు. రాజేంద్రునకును మోహినీదేవికిని ఒండొరులయెడఁ గల మెండు తమకంబెల్ల విరసంబై యిపుడు ప్రణయకలహంబుగాఁ బరిణమించె ననియు వింటిని.

మాధ—దానికేమిలెమ్ము. ఆలుమగల సందు జగడము అద్దమువీఁదఁ బెసరగింజ నిలుచునంత సేపు అని పారిజాతాపహరణగ్రంథమందు మున్నుఁ జదివియుండ లేదా? అంతమాత్రముచే రాకొమరునకుఁ గల్గు భయమేమి?

శంక—ఏమా? ఇట్టి ప్రణయకలహసమయంబునఁ బుత్రుఁడేటికి? తగవుఁ దీర్పనా?

గోపా—తగవుఁ దీర్చుటకుఁ గాకపోయినను, ఎట్టి సమయమందైన పుత్రసందర్శనంబు సంతోషదాయకంబే కదా.

శంక—ఇదెట్టిమాట? ఎట్టిసుఖంబైన దేశకాలానుగుణ్యంబై యుండుఁ. ఇదిగాక ముకుళితముఖుండైన యీ రాజభటుని ముఖవైఖరిం జూచినప్పటినుండియు నేను వేఱుగ శంకించుచున్నవాఁడ.

మాధ—ఏమని?

శంక—ఈ బాలుండా కలహఫలం బనుభవింపవలసినవాఁ డగునేమో యని.

గోపా—ఆఁ! ఆఁ! అలాగా? అట్లయిన మన కీ ముసుఁగులోగుద్దులాట యేల? అట్లుపోయి మఱికొంచెము విచారింతము రండు.

మాధ—అవునవును. పోవుదము రండు. (అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది విష్కంభము.



రంగము—మోహినీదేవి యంతఃపురాంగణప్రదేశము.

ప్రవేశము——మోహినీ రుక్మాంగదులు.

మోహి—రాజేంద్రా! పుత్రుని బిలిపింతునంటివే. ఏఁడీ? అబద్ధమే నా?

రుక్మా—అబద్ధ మేఁటికగును? పుత్రుం డీపాటికి వచ్చుచునే యుండును.

ప్రవేశము—దౌవారికుఁడు, ధర్మాంగదుఁడు.

దౌవా—దేవా! జయమగుఁగాక. అబ్బాయిగారు దయచేసినారండి. తోటిబాలుర తోడఁగూడి ప్రహ్లాదుని చరితంబును వినుచుండఁగాఁ బిలిచికొని వచ్చితిని. ఎందుకుఁబిలిచితిరోకదా యని పరుగెత్తుకొని వచ్చినారండి. (అని తనలో) వీ రుభయులును వివాదపడుట యింతదనుక నేను వినుచునే యుంటిని. ఆవులు పోరాడి లేఁగలకాళ్ళు విఱుఁగఁద్రొక్కినట్లు వీరీ ముద్దుబాలు నేమిచేయుదురోకదా. (అని యనుకొనుచు వెళ్ళుచున్నాఁడు.)

ధర్మా—(సమీపించి) జనకా? నమస్కారము.

రుక్మా—(చూచి వ్యసనముతోఁ బలుకక తలవంచుకొని నిలుచుచున్నాఁడు.)

ధర్మా—(ఆశ్చర్యముతో) జనకా! నేఁ డేల ఖిన్నవదనుండవై యున్నవాఁడవు?

గీ. నన్నుఁ జూచినతోనె యా ♦ నంద మంది
బిడ్డ! వచ్చితివా? యని ♦ ప్రేమ మీఱ
నట్టె కరములనెత్తి ము ♦ ద్దాడు నీవు
వెతల మున్గినరీతి నుం ♦ డితి విదేల?. 3

నేను నమస్కరించినను ఆశీర్వదింపనొల్లక చింతాక్రాంత మానసుండవై కన్పట్టుచున్నవాఁడవు. ఎట్టి యిక్కట్టులు కల్గినను గుట్టుచెడక దిట్టతనంబును బూని యుండు నీ కిట్టి విచారం బెట్టుకల్గె? జనకా! సత్వరంబున నెఱింగింపుము. నీ విట్టు లుండుటచేత నా గుండెలు కొట్టుకొనుచున్నవి.

రుక్మా—పుత్రకా! ఈ తరుణి బ్రహ్మమానసపుత్రి! పేరు మోహిని యఁట్రు. నే నరణ్యంబునకు వేఁటకుం జనినతఱి నీ యువతిం గాంచి, మోహించి, ఎన్నఁడుఁ దను నెడఁబాయక తన యాజ్ఞానువర్తినై యుందునని బాసఁజేయుమన నట్లొనర్చి

గాంధర్వవిధిం బరిణయమై కొనివచ్చితి. నేఁటిదినం బేకాదశియగుటం జేసి నేను వ్రతాచరణంబునకుఁ జనుచుండ నీ తరుణి యరుదెంచి వ్రతంబు విడువుమనియు నంతఃపురంబునకు రమ్మనియుఁ బరిపరివిధంబుల బాధింప నేమియుఁదోఁచక నేను

సీ. మీఱి నీ విటు లాడంగ ♦ మేర కాదు
పడఁతి! నా రాజ్యమైన న ♦ ర్పణ మొనర్తుఁ
గన్న సుతునైన ఖండింతుఁ ♦ గాని వ్రతముఁ
బాయఁజాల నటంచును ♦ బల్కి నాఁడ.

అంతట నికాంత "అట్లేసుతుని ఖండింపుము. లేకున్న వ్రతంబు విడిచి రమ్ము. ఈ రెంటిలో నేదైనం గానిమ్మ" అంచు మూర్ఖత్వమునఁ బలుకఁజొచ్చినది. కావున నిందుకు నా కేమియుం దోఁచక—.

ధర్మా—జనకా! తెలిసినది. తెలిసినది. దీని కింక సందియంబేల? ఈ కాంతామణి యభిమతంబు చొప్పున నన్ను ఖండించి నీ వ్రతం బీడేర్చుకొమ్మ. వ్రతంబునకన్న ప్రాణం బెక్కుడగునా? శ్లో. జాతస్య మరణం ధృవం అనునట్లు కాలుఁడెప్పుడో యే వేళనో యే నిమిషంబుననో యే విధంబుననో క్రమింగఁ గాచియున్నవాఁడు.

ఉ. ఎట్టినరుండుఁగాని, పృథి ♦ వీశ్వరనందనుఁడైనఁగాని, యిం
కెట్టిఘనుండుఁగాని, జగ ♦ దేకమహాబలశాలిగాని, తాఁ
బుట్టుటకల్గుతోనె మృతిఁ ♦ బొందుటయుక్ సతమాయెఁగాని, యే
పట్టుననైన దాని నెడఁ ♦ బాయఁగఁ జాలునె మానవేశ్వరా?. 5

చిరకాలము జీవించి, కడకు వార్ధకదశయందు బలశౌర్యంబు లుడిగి, దేహంబెల్లఁగృశించి, శీతశ్లేష్మ వాత పైత్యాది వ్యాధులచేతఁ బీడితుండై యొక్క కుక్కిమంచంబునం బడి, మలమూత్రాదులలోఁ గొట్టుకొనుచు సోదరదార పుత్రాది బంధుజనులెల్లరచే రోయఁబడి, యొక్క సారి యా పరాత్పరుని దివ్యమంగళస్వరూపంబుఁ దన మనస్సున నిల్పి ధ్యానింపలేనన్నఁ జిత్తచాపల్యంబుఁ గల్గి, తుదకు నశించి, అప్పుడు ఈ శరీరంబును వృథాగా మట్టిపాలుఁ గావించుటకన్న నిట్టి సమయంబున శ్రీవిష్ణుప్రీతికరంబగు నీ హరివాసర వ్రత నిర్వహణార్థము బలిఁగా నొసంగిన మేలు కాదా? కావున జనకా! నీవు సంశ

యింపక నా శరీరంబును బలియిచ్చి నీ వ్రతంబు నెఱవేర్చుకొమ్మా. నీ విందున కావంతయైన వంత నొందఁ దగదు. శీఘ్రం బట్లు కానిమ్మా.

రుక్మా—పుత్రా! ఏమిరా నీ వాక్యంబులు! మరణంబన్న నొక్కింతయు వెఱవక పెక్కు నీతులు బోధించుచు నాకెదురు ధైర్యంబుఁ జెప్పుచున్న వాఁడవు. బిడ్డా! శ్లో. అనిత్యాని శరీరాణి యనియు, శ్లో. జాతస్య మరణం ధ్రువ మ్మనియు శ్లో. ఋణానుబంధరూపేణ పశు పత్ని సు తాలయాః అనియు లెక్కకుమిక్కిలి యగు పెక్కునీతులు లోకులకు బోధింపవచ్చును గాని శ్లో. స్వస్వానుష్ఠాన వేళాయాం మునయోపి న పండితాః అనునట్లు తా మా ప్రకార మవలంబింపవలసి వచ్చునప్పుడు మునీంద్రులు లోనగువారుకూడ వ్యర్థులయి పోయిరని పెద్దలు మిక్కిలిగాఁ జాటి చెప్పుచున్నవారు. ఇట్టులుండ నీ విన్నినీతు లెట్లునేర్చితివి? నేర్చిన నేమాయె? చావున కెదురేగఁ జూచుచుంటివి. నీ మనం బెట్టులున్నను నేను

క. ఒక్కఁడ వంచును బుత్రక!
యక్కునఁ జేర్చుకొని పెంచి ♦ యానందము పెం
పెక్కఁగఁ బొంగితి; నేఁ డిటు
లక్కట నినుఁ ద్రుంప కరము ♦ లాడునె చెపుమా? 6

మోహి—అవును రాజేంద్రా! పుత్రుని కరములార నేల ఖండించెదవు? వ్రతంబు విడువుము. సుతుని బ్రదుకనిమ్మా. మన మతఃపురంబునకుఁ బోవుదము రమ్మా.

ధర్మా—జననీ! తాళుము. తాళుము. నీ యభీష్టం బిప్పుడే నెఱవేఱఁగలదు. జనకా! నామరణంబునకై నీ కింతవంతయేల? ఈతనువులు శాశ్వత బ్రహ్మకల్పంబులని నమ్మియుంటివే? తొంటి పెద్దలు

క. నవరంధ్రంబుల తిత్తియు
భువిఁ గ్రిమి కీటక పురీష ♦ మూత్రంబులలో
దవులుచు క్షణభంగురమై
యవిమ్మలమైనదియు ననుచు ♦ నాడరె తనువుః?. 7

ఇంతియకాని దీనియం దొక్కింతయైనఁగాంతు వహించియుండిరే? సమయము

తటస్థించినప్పుడెల్ల బుద్ధిపూర్వకముగ దీనిఁ ద్యజించుటకై సిద్ధపడి యుండ లేదే! శిబిచక్రవర్తి తన శరీరమునుండి పావురంబునకు సరితూగునంతటి మాంసంబును గోసియిచ్చె. కర్ణుండు తనశరీరమునకుఁ జర్మముగా నేర్పడియున్న యినుప కవచంబును దానమొసంగె. త్రిలోకకంటకుఁడగు వృత్రాసురసంహారణార్థంబుగ వజ్రాయుధంబు నిర్మించుటకై దేవేంద్రుఁడు ప్రచ్ఛన్నవేషంబునఁ బ్రార్థింప దధీచిమహాముని తన వెన్నెముక నొసంగియుండె. వీర లింతటి సాహసంబు నేల వహించిరి?

రుక్మా—నీ వాక్యంబు లన్నియు నిక్కంబులే. కాని యొక్కసుఖజీవిం బట్టుకొని యకారణంబుగ ఖండింపఁబూనుట యెంతయుఁ బరితాపకరంబుకదా. ఇట్టి కార్యం బే నెట్టులు చేయనోపుదును.

ధర్మా—అయిన జనకా! వార లెల్లరును సుఖముగాఁ బ్రతుకజాలకయా యిట్లొసంగిరి? వారికీర్తి యీ లోకంబున శాశ్వతంబై ప్రకాశించుచుండలేదా? నీ మనంబున యోచించి చూడుము.

చ. మలినము, రోగపూరితము, ♦ మాటికనిత్య మరోచకంబు, దు
ర్మల క్రిమిమూత్రశుక్లరుధి ♦ ర ప్రథితమ్మగు మేనిఁ బాయుటన్
సలలితమై త్రిలోకముల ♦ శాశ్వతసౌఖ్య మొసంగఁజాలు ని
ర్మలమగు కీర్తిఁగాంచుటది ♦ మానవనాథ! ఘనంబు కాదొకో? 8

ఇదియును గాక

గీ. శ్రీకరంబిది యేకాద ♦ శీవ్రతంబు
పేర్మి శ్రీరమా విభునకుఁ ♦ బ్రియతరంబు
ధర సుధర్మములకు నెల్ల ♦ దాపురంబు
భక్తవినుతంబు భవపాశ ♦ భంజనంబు. 9

క. వినుమా యీ సుదినంబున
ననువుగ నీ చేయు సద్వ్ర ♦ తార్థంబుగ నా
తనువు నొసంగిన స్వర్గం
బనఁగా నే దాఁచుకొనిన ♦ యరమ కాదే? 10

ప్రారబ్ధవశంబున సంభవించిన యీ శరీరంబు నింతకంటె సార్థకం బగునట్లెట్లు చేయఁగలను? కావున జనకా! నీ వింక సందియంబు విడిచి, పుత్రుండను భ్రాంతి దిగనాడి, న న్నీ క్షణంబున ఖండించి నీ వ్రతంబు నెఱవేర్చుకొమ్ము. ఈపాటి కార్యంబునకై వ్రతంబు విడువనేల?

రుక్మా—మంచిది పుత్రా! అట్లే యొనర్తును. (అని ఖడ్గము చేతఁబూని యాతని ఖండింపఁబోవుచున్నాఁడు.)

(దౌవారికుఁడు తెరలోపల బిగ్గరగా)

దౌవా—అమ్మగారూ! మన ధర్మాంగదమహారాజుగారిని అయ్యగారు కత్తితో నఱుకఁబోవుచున్నారండి.

సంధ్యా—ఎందుకో అఱు రా!

రుక్మా—(ఆలకించి) ఎవరో పట్టపు దేవితోఁ దెల్పుచున్నారు. (అని యింక నాలకించుచున్నాఁడు.) (మరల తెరలోపల)

దౌవా—మోహిని అమ్మగారున్ను అయ్యగారున్ను జగడమాడుకొనుచున్నారండి. ఆమె వ్రతము విడువుమనుచున్నది. ఈయన విడువననుచున్నారు. కుమారుని నామె చంపుమనుచున్నది. ఈయన చంపఁబోవుచున్నారండి. తమరు దయచేసి బిడ్డను బ్రతికించుకొనండి.

సంధ్యా—హా! దైవమా! ఎంతటి విపత్తు వాటిల్లఁజేసితివి! (అని యేడ్చుచుఁ బ్రవేశించి విభుని పాదములపైఁ బడి) నాథా! నాథా! శివశివా? పరమేశ్వరా! అక్కటా, నాథా! ముక్కుపచ్చ లారని ముద్దుబిడ్డను బట్టి కరవాలంబున ఖండింపబూనితివి. జనకుం డెట్టి కఠినుఁడైనను కన్నబిడ్డను కరములార ఖండింప నుంకించునే. అక్కటక్కటా! విధి కట్టడి నేమనవచ్చు? ఇంక నే నేమి చేయుదు! శివశివా పరమేశ్వరా!

ఉ. కానల కేగనేల? పర ♦ కాంతను గాంచి భ్రమింపనేల? యా
చానకుఁ జిక్కనేల? విర ♦ సంపు ప్రతిజ్ఞలు పల్కనేల? నా
ప్రాణపదంపుఁ బుత్రుని శి ♦ రంబును ద్రుంపనె వ్రాలు; నక్కటా
యేనిఁక నెందుఁజొత్తు? భువి ♦ నెట్టులుజీవముదాల్తునీశ్వరా?. 11

హా! పుత్రకా! నీ కిట్టి దురవస్థ సంభవించునని కలనైనఁ దలఁపనైతిఁగదరా. తండ్రీ! నీవు చిరకాలజీవివై వర్ధిల్లి యీ రాజ్యంబునకెల్లఁ బ్రభుఁడవై మాకు ముందు గతులు కల్పింపఁగల కర్తవగుదువంచు నెంచియుంటిఁ గాని నేఁ డిట్టు లీ తరుణీమణి కారణంబున నకాలమృత్యువునోటఁ జిక్కి మా కన్నులఁ గప్పి పోదువం చెఱుఁగనైతిగదరా! నీ విప్పు డీ జనకుని క్రేటున ఖండితుండవై నీ మేనెల్ల రక్తధారల మునుంగ నేను గన్నులఁ గాంచి యెట్లు మనియుండ నేర్తు? పుత్రకా శివశివా! పరమేశ్వరా!

ఉ. అక్కట దైవమా! వరద ♦ యానిధి! యార్తశరణ్య! రక్షకా!
యి క్కమనీయగాత్రుని న ♦ హీనచరిత్రునిఁ బుత్రు జేయఁ బెక్
రక్కసిఁబోలు పాతకి య ♦ నందగు నాదగు గర్భసీమ నీ
కెక్కడఁ జిక్కె? నింకఁ దెరు ♦ వెయ్యది? యే నెటు పొందు నీశ్వరా!

(అని దుఃఖమును గొంచె మడఁచుకొని) నాథా! నీ విప్పు డేమియు నెఱుంగని యీ పసిబాలుని ఖండింప నేల? వీనిపై నెట్లయినఁ గరుణించి విడిచి వీనికి బదులు నన్ను ఖండించి నీ వ్రతం బీడేర్చుకొమ్మా.

(అనఁగానే కుమారుఁడు తల్లిని కరంబులఁ బట్టి లేవనెత్తి)

ధర్మా—తల్లీ! తల్లీ! నీ కేటికమ్మా యీ ఖేదంబు? ఏ నెటఁగింతు నొక్కింత తాలిమి వహింపుము.

సంధ్యా—నాయనా! ఇది యంతయుఁ జూడ నాకు దుఃఖంబు గాక సంతోషం బెట్లు కలుగనేర్చు? (అని మోహినివంకఁ దిరిగి) అక్కా! మోహినీ!

చ. హృదయ మ దెంత దిట్టయిన, ♦ నీసుఁడు నెంతగఁ గారవించినన్
ముదితరో! చెంతఁ జేరిచి ప్ర ♦ మోదము నించిన, లోకనింద కా
స్పదమగులీల నిట్టి విర ♦ సంబగు కోరికఁ గోరఁ జెల్లునే?
పొదుఁగునఁ బాలు గోరుచును ♦ బొంగుచుఁ గోయుదురమ్మ కోమలీ?

నా బిడ్డయైన నొకటి నీ బిడ్డయైన మఱొకటి యగునా? బిడ్డలు కలవార లందఱు బిడ్డలఁ దమ బిడ్డలవలెనే చూచుకొందురు కాదఁటమ్మా? అక్కా! ఇఁక

నైన నీ పసిబిడ్డను మన్నించి కాపాడుమమ్మా. నీకుఁ బున్నెంబగునమ్మా.

మోహి—చాలుఁజాలు! అక్కాలక్కా యంచుఁ దగుదునని తలఁ ద్రిప్పుకొనుచుఁ జెప్పవచ్చితివిగదా! ఈ నీతులు నీవే నేర్చితివి కాఁబోలు! బిడ్డలు లేనిదాననంచు నన్నే మో దెప్పవచ్చెదవు. నీ వాక్యంబు లన్నియు బిడ్డలుకలవారు పల్కెడి వేకద?

గీ. ఒరుల బిడ్డలఁ గానల ♦ నొంటిపాటు
నందుఁ గాంచి, వరించి, కా ♦ ర్యంబుఁ గడపి,
నాఁటి మాటల వెల్లను ♦ నీటఁ గల్పి,
యోటుఁ బుచ్చఁగ నీమది ♦ యోర్చె నొక్కొ? 14

పొదుఁగుఁ గోసికొనియఁట! పాలు ద్రావుదురఁట! ఇట్టి వేయి దుష్కృతంబు లైన నొనర్ప నీ నాథుండే సమర్థుఁడు కాని నేను గాను. వ్రతంబు విడువుమని యెంత చెప్పినను వినక నాథుండే పుత్రు నిట్టులు చంప నంకించి యున్నవాఁడు. యౌవనధనరాజ్యమదాంధులగు వార లిట్టి ఘోర కృత్యంబుల నెన్నిటినైనఁ జేయ సమర్థులయియే యుందురు.

సంధ్యా—అక్కా! ప్రాణేశు నేల దూఱెదవమ్మా?

ఉ. అక్కరొ! యాగ్రహింపకు; ద ♦ యామతి నా పలు కాలకించు;
నే మ్రొక్కెదనమ్మ; బిడ్డ యసు ♦ రుల్ గొనకమ్మ; విభుండు ప్రే
మలం జిక్కెనటంచు నారసి మ ♦ నీషులసమ్మతిఁ జేయు సద్వ్రతం
బొక్క దినంపు భోగమున ♦ కూడ్పఁగ జూతురఁటమ్మ నెచ్చెలీ? 15

ఎట్టివ్రతంబయినఁ దన యిష్టముచొప్పున మాటిమాటికి మానుటయు మరల మరల నొనర్చుటయు నుండునా? కావున రాజేంద్రుని వ్రతంబు మాన్పింప మనకు సాధ్యంబగునా? మానకున్న నేమాయె? పుత్రుని జంపింపవలయునా? పుత్రుని జంపిన నేమగును? నీ కోర్కె తీరునా? వృథాగాఁ బుత్రు నేల చంపించెదవమ్మా? నేఁటికిమాత్ర మూరకుండి పిమ్మట నీ యిచ్చవచ్చినట్లు విభుంగూడి కేళీవిలాసంబులం దేలుచు నానందాబ్ధి నోలలాడుమమ్మా.

మోహి—అబ్బో! అలసిపోయితివి. నీ దీర్ఘోపన్యాసంబు లింకఁ గట్టిపెట్టుము.

క. ఆతండు వ్రతము విడఁడఁట;
యీతల్లికి సుతునిచావ ♦ నిష్టంబఁట; నే
నేతల్లిఁ గొల్తు? నీయను
చేతులు జాడించుకొనుచుఁ ♦ జెప్పెడు నకటా!

వ్రతము విడువరాదఁట; సుతునిఁ జంపవలదఁట; మాబోటి సతులతోఁ దొంగ బాసలుచేసి, కొనివచ్చి, వారి కన్నెఱికం జెల్లఁ గొల్లలాడి తుదకు వ్యర్థులం జేయఁ జూతురఁట. తగుదునంచుఁ దలఁ ద్రిప్పుకొనుచుఁ జెప్పవచ్చెదవు. మొగమునకు సిగ్గయినం దోఁపదే!

సంధ్యా—(ముక్కున వ్రేలు పెట్టుకొని) ఔరా! ఔరా! ఎంత యాశ్చర్యము.

మోహి—విభుఁ డరణ్యంబున బాసలుచేయునప్పుడు నీవైన నడ్డుపడకపోయితివా? "వ్రతంబు విడువమనఁదగునా" యని యిప్పుడు నాకు ధర్మోపదేశంబులు చేయ నరుదెంచితివి.

శా. దుర్మార్గంబని లేక, యన్యయువతిన్ ♦ దుర్బోధచేఁ గామ్యదు
ష్కర్మంబందునఁ జొన్పి, తుష్టతుద కా ♦ శాభంగముం జేయుటల్
ధర్మంబంచును దోఁచెనేమొ యిఁకనే ♦ లాతర్కముల్; పృథ్వినీ
ధర్మాధర్మవిచారణాచణత యే ♦ తన్మాత్రులం దుండునే?. 17

ఔరా! ఇట్టి యసత్యవ్రతుండగు రాజుచేతను, అధర్మబోధినియగు నీ రాణిచేతను పాలితంబగు నీరాజ్యమందలి ప్రజ లెట్టిసౌఖ్య మనుభవించుచుండిరో కదా. ఇంతయేల? నీకు సుతునిపై నంతటి ప్రేమయే యున్నయెడ, సుతుఁడు జీవింప వలయుననియే నీ యీప్సితం బగునెడ "వ్రతంబువిడిచి నా యిష్టము చొప్పున వర్తింపు" మని విభునకు బోధింపుము.

సంవాద ద్విపద.

సం—అక్కటా నాథ! యీ ♦ యన్యాయ మేమి?
యిక్కమలాక్షి నీ ♦ కేల ప్రాప్తించె!
హ—నాప్రాకృత ఫలంబొ ♦ నా పుణ్యబలమొ
యీ పడంతుక యాచు ♦ నిట్లు లభించె

ధ—జనక! యీ గతి నీకు ♦ సంతాపమేల?
తనయుడ నే నీదు ♦ దాని వసింప.

మో—నీ యింతియును నీవు ♦ నేఁడేల వగవ
హాయిగా శయ్యాగ్ర ♦ హాముజేర రమ్ము.

సం—తగుఁ దగు వ్రతము వ్య ♦ ర్థము చేయు మనెదె?
మగువరో! యిటులాడ ♦ మరియాద యౌనె?

రు—ఇదియేటి ధర్మమో ♦ యిది యేటి కృతియొ
మొదటినుండి వ్రతము ♦ ముంపఁ జూచెదును.

ధ—సూర్యచంద్రాదులు ♦ సుడిఁగొన్నఁగాని
ఁబు చెడకు వ్ర ♦ తంబును విడకు.

మో—వ్రతమునకై సుతుఁ ♦ బరిమార్తు నంటి
ప్రతిమాటలేల యీ ♦ ప్రతిన యే జరుపు.

సం—కటకటా యిదియేమి ♦ కఠినాత్మురాల
కుటిలతాపేటి! దు ♦ ర్గుణజాలవాటి!
క్రూరత సుతుగొంతు ♦ కోయుమటంచు
నీరీతిఁబల్కు నో ♦ రెట్లాడె నీకు?

మో—నీ ప్రాణనాథుండు ♦ నీ బంధుజనులు
నీ ప్రియ పుత్రుండు ♦ నీకుండవలయు,
"చిన్ని నాపొట్టకు ♦ శ్రీరామరక్ష
నన్ను తాంగిరో నీవు ♦ సాగిపో" మ్మనెదె? 18

సంధ్యా—(కొంతవిస్మయమును జూపి) ఆహా? ఈతరుణి కేవలమనుష్యమాత్రురాలై కానిపించుటలేదు! ఇట్టి ప్రసంగంబులు మన రాజగృహంబులయం దెన్నఁడైన వినియుంటిమా!

సు. చాన పల్కు నద్దియెల్ల ♦ సద్వ్రతంబు మాన్పనే
కాని యొండు కానరాదు ♦ కాంచ నేమి చిత్రమో

మానవాధినాథ! దేవ ♦ మానిచోదనంబునన్
బూనెనేమొకాని యిట్టి ♦ బుద్ధు లెందుఁ గల్గునే? 19

ఇట్టి కఠినహృదయం బెచ్చటనైనఁ గంటిమా?

మోహి—నీకంటెఁ గఠిను లెవ్వరును లేరు. అధికప్రసంగంబులు చాలించుము.

క. ఇట్టులధర్మపక్షంబుల
నెట్టయినం దెల్పుమంచు ♦ నెవ్వరు నిన్నుం
బొట్టనుఁ గాటుక వెట్టుచు
దిట్టా! రమ్మంచుఁ బిలిచి ♦ తెచ్చిరి చెపుమా? 20

సంధ్యా—(విచారముతో గుండె కొట్టుకొనుచు) పరమేశ్వరా! యింకేమిచేయుదు?

ధర్మా—[29] తల్లీ, ఏటికమ్మా నీ కీ ఖేదంబు? నీమనంబున వ్రతంబునకన్న నా ప్రాణంబెక్కుడుగఁదోఁచుచుండెనా? ఏ నొక్క రహస్యం బెఱింగింతు వినుము.

సీ. ప్రారబ్ధ మనునది ♦ పరికింప స్వకృతమె
కాని యన్యులు చేయఁ ♦ గలదికాదు
దాని నవలఁద్రోయఁ ♦ దల్లడిల్లుటెకాని
పచ్చికుండా? కాదు ♦ పగులఁ గొట్ట
బహుజన్మసంచిత ♦ ఫలమయి వెన్నంటి
తగులు సాలెపురువు ♦ తంతు భంగి
హరిహరబ్రహ్మాదు ♦ లైన దానినిఁ బాయ
నేర్చిరే? మనమిఁక ♦ నేర్చుటకును

గీ. తెలియవే? పంచముఖుఁడట్టి ♦ నలువ యయ్యె;
కనవె? శంకరుఁడే నీల ♦ కంఠుఁ డయ్యె;
వెన్నుఁడే కాఁడె? యలనాఁడు ♦ తన్ను వడియె;
ఘోర! ప్రారబ్ధమహిమ యే ♦ మనఁగవచ్చు. 21

ఇదిగాక, తల్లీ! మఱియొకటి వినుము. జీవుఁడు బహుజన్మసంచిత ప్రారబ్ధ

కర్మ వశంబున శరీరధారినై, మాతృగర్భంబు సొచ్చి, యచ్చట నవమాసంబులు పెరిఁగి, తత్కాలంబున నచ్చటి క్రిమి కీటక మూత్ర పురీషంబులలోఁ దగులు కొని పెక్కుడుములంబడి గర్భనరకం బెల్ల ననుభవించి పిమ్మట జననంబగును! తదాదిగ బాల్య యౌవన కౌమారాద్యవస్థలం దగిలి బాల్యంబెల్ల నాటపాటల యందును, యౌవనంబెల్ల నహంకారబద్ధుండై పువ్వుఁబోఁడులకౌఁగిండ్లయందును, వార్ధకంబెల్ల దారసుతాదుల ప్రేమలం దగిలి వారి యుదరపోషణార్థమై ధనార్జనము చేయుటయందును గడపుచు నిట్లు జనన మరణ తాపత్రయ ప్రవాహ రూపంబైన సంసారంబునందుఁ దగులుకొని కడు నిడుములంబడి నశించుచు, మరలమరలఁ బుట్టుచుఁ గిట్టుచు నిట్లు జన్మపరంపరలం బడి కొట్టుకొనుచుండు. ఈప్రకారంబుగ నేను బ్రహ్మసృష్టి మొదలు నేఁటివఱ కెన్ని జన్మంబు లెత్తితినో, యెందఱకుఁ బుత్రుండనైతినో, యెందఱకు భ్రాత్రుండనైతినో, మఱియెందఱకు జనకుండనైతినో యెఱుంగఁగలమే?

సంధ్యా—సత్యమే బిడ్డా నీ వాక్యంబు లన్నియు నిక్కంబులే.

ధర్మా—ఇప్పటి కీరీతి ఋణానుబంధకారణంబునఁ బుత్రరూపంబున నీ గర్భంబున జన్మించి నీ చెంగట మెలంగుచున్నవాఁడ. ఋణంబు తీరినతోడనే యీ శరీరంబు నిచ్చట దిగనాడి మఱి యెచ్చటికో పోవనున్నవాఁడ. కాని మనకుఁ గల యీ మాతాపుత్రసంబంధం బెంతమాత్రమును శాశ్వతంబని యెంచకుము. మఱియును

శా. మాతా! నాటకమందుఁ బాత్రలబలెన్ మాయాప్రపంచంబునన్
మాతాపుత్రపితాదివేషులగు నీ ♦ నానాస్వరూపాలతో
నీ తాత్కాలికబంధముల్ సతమటం ♦ చెంతే భ్రమం జెందుచున్
జేతో మోదముఁగాంచి బాయుటకునై ♦ భీగుందఁగాఁజెల్లునే? 22

ఉ. పొందుగ నాది నాది యని ♦ పుట్టినదాదిగఁ బాలు మీఁగడల్
విందులు భూషణంబులును ♦ వేడ్క నొసంగుచుఁ బెంచు దేహమే
యెందునొ వాసిపోవు; నిఁక ♦ నేటికి దుర్భ్రమ? యిట్టి దేహసం
బంధులు కూడవత్తురె భ్ర ♦ మంపడి యెంతగఁ బాలఁబెంచినన్?

కాఁబట్టి జననీ! ఇంకనైన నీవు నా వాక్యంబులందలి సారంబు గ్రహించి నేను నీ పుత్రుండ నను భ్రాంతి వదలి, ప్రేమానుబంధంబులనెల్లఁ దెగఁగోసి, యీమె యిష్టముచొప్పున నన్ను ఖండించి వ్రతంబు నెఱవేర్చుకొనునట్లు నాయనగారిని నీవుఁ బురికొల్పుము. దీనిచే నేను బవిత్రుండనై, శ్రీవిష్ణుపదకమల సమీపవర్తి నగుట కత్యంతార్హుండ నగుదు.

సంధ్యా—ఆహా బిడ్డా! యేమిరా నీ యమృతతుల్యవాక్యంబులు! ఇట్టివాక్యంబులు నే నిదివఱ కెవ్వరిపలనను అనుభవసిద్ధిగ వినియుండనైతి.

ఉత్సాహ వృత్తము

పరగ వేద నెనసి యనుము ♦ స్వర్ణమైన రీతిగన్
దురితభంజకంబు మఱియు ♦ దుఃఖనాశమైన నీ
పరమనిర్మ లాత్మబోధ ♦ వలన నాదు డెందమున్
సరగ పారిశుద్ధ్య మంది ♦ శాంతి నొందెఁ బుత్రకా! 24

బిడ్డా! నా హృదయంబను నడవియం దుత్పన్నములై బహుకాలంబునుండి పెరిఁగి పెద్దవియై యజ్ఞానంబను కాఱుచీఁకటిని గ్రమ్ముచున్న శోకమోహంబు లను రెండు ఘనవృక్షంబులను నీ వాక్యకుఠారములచేతఁ దుత్తునియలుచేసి మూలచ్ఛేదం బొనర్చితివికదరా పుత్రకా! ఇఁక నిన్నుం జంపవలదని యే నొక్కింతయైన నీ రాజేంద్రు నడ్డగింపఁజాల. ప్రాణనాథా!

గీ. పుట్టి బుద్ధియెఱింగి యె ♦ ప్పుడును వినని
నీతు లెన్నియొ బోధించి ♦ నిర్మ లాత్మ
నొసఁగె నీతఁడు సాధుజ ♦ నోత్తముండు
పుత్ర మాత్రుండు కాఁడు; ప ♦ విత్రుఁ డధిప! 25

కావున నీ వింక సంశయింపక వీనిని ఖండించి నీ వ్రతం బీడేర్చుకొమ్ము.

సంవాద మత్తేభము.

ధ—జనకా! కాల మతిక్రమింపదె?

సం— ... ... విభూ! ♦ జాగేల యేకాంతతో?

రు—వనితా! సత్యమె.

మో— ... సత్యమే జరగని.

రు— ... ... ... ♦ పద్మాక్షి శాంతించు.

మో—నీ! వినయాలాపములేల పుత్రుఁడునుమఱ?

రు— ... ... ... ♦ బింబోష్ఠిరో! త్రుంచెదఱ.

ధ—జనకా! వేగమె.

సం— ... నాధ! గ్రక్కున

రు— ... ... ఇదే ♦ శాతాసి చేఁ బూనితిఱ 25

పుత్రకా! నీ విచట నిలువుము. (అని ఖండింపఁ బోవఁగా)

మోహి—(తనలో) ఆహా! వీరు మువ్వురును జావునకు వెఱవకయే యున్నారు. ఈతని జంపినమాత్రంబున వీరికి వ్రతభంగం బెట్లగును! ఇపుడు నే నేమిచేయుదు? అయినను మఱియొక తంత్రముఁ బన్నిచూచెద. (అనిత్వరగా రాజునకడ్డముపోయి) రాజేంద్రా! ఒక్కింత తాళుము.

రుక్మా—నాకుఁ దడవగుచున్నది. నేనింకఁ దాళఁజాల. (అనిత్వరపడుచున్నాఁడు)

మోహి—(మరల నడ్డముపోయి చేయిపట్టుకొనుచు) [30]ఏమి యీ వెఱ్ఱితనము!

క. ఇది సత్య మిది యసత్య
మ్మిది శిష్టజనానుకూల ♦ మిది యగ్రాహ్య
మ్మిది ధర్మ మిది యధర్మ
మ్మిది గర్హిత మంచు నెఱుఁగ ♦ వేమందు నృపా! 26

రు-క. ధర్మాధర్మము లెఱుఁగక
దుర్మతినై యే నొనర్చు ♦ దుడుకుఁదనం బే
కర్మమునఁ గాంచి తక్కటా
మర్మ ముడిగి తెల్పు, వేఱు ♦ మాటలిఁ కేలా?.

మో-గీ. వ్రతమటంచును మఱియేమొ ♦ గతులటంచు
సుతునిఁ జంపఁగనౌనె యో ♦ శూరవర్య?

నూత బిడ్డను బడవైచి ♦ లోఁతు జూచు
రీతి నున్నవి నీ వెఱ్ఱి ♦ చేఁత లెల్ల.

రు-క. దుడుకున నొడలి నెఱుఁగక,
కడువడి వ్రతమనక, మఱి సు ♦ కర్మ మనకయే,
కుడుచుచు ముడుచుచుఁ గట్టుచుఁ
గడుపే కైలాసమంచుఁ ♦ గడపుఁ మనియెదే?

మోహి—స్వర్గాదిభోగములు నీవు కల్గుననుచుండ నే నేల లేదనవలెను?

ఉ. నీవనుమాటయే నిజము ♦ నిక్కము కల్గును స్వర్గభోగముల్;
పోవఁగనిమ్ము దాని నిఁకఁ ♦ బొల్పుగఁ దెల్పుమి దొక్కమాట; నీ
వీ వరపుత్రనాశమున ♦ నీశ్వరపూజ నొనర్పఁ బాడియే?
గోవులఁజంపి చెప్పులను ♦ గొల్లగ దానమొసంగు రీతిఁగన్. 30

రుక్మా—అబలవగు నీ విట్టి రహస్యంబు లెల్ల నెట్టు లెఱుంగఁగలవు?

ఆ. దేహి యైన సుతుఁడు ♦ తెగువాఁడె? శుద్ధాత్మ;
మలిన దేహ మెప్డు ♦ మట్టి పాలె;
సద్వ్రతార్థ మితఁడు ♦ చయ్యన మే నిచ్చి
పడయు గతులు యజ్ఞ ♦ పశువు మాడ్కి. 31

నాకు సుతుండై జన్మించినందుల కీ జీవునకు మద్వ్రతకారణంబున సద్గతుల గల్పింపుచుంటి. కాని గోవులఁజంపుట యనెడి దుష్కార్యంబొనర్చి, తద్దోష పరిహారార్థముగ దానిచర్మముతోఁ గుట్టిన చెప్పులను దానమిచ్చినట్టులు నే నొనర్చిన దుష్కార్యమే లేకయుండఁ దద్దోషపరిహారార్థము వ్రతం బొనర్చితి ననుట ధర్మమా?

మోహి—హాహాహా! ఇదియేమి! వెఱ్ఱివేదాంతంబు లేకరువుఁబెట్టుచుంటివి! ఇప్పటి నాగరికులెల్లరు నిట్టివేదాంతంబుల నే వెఱ్ఱివేదాంతంబు లందురు. కావు ననే నేఁటిదినంబున నీ వెచ్చటనో మూఢభక్తిపరాయణులగు పౌరాణికుల మాయలలోఁ దగిలితి వని ముందే మొఱవెట్టితిని. ఔరా! స్వర్గభోగాపేక్షులు

లోకంబున కెంత యపకారం బొనరించుచున్నవి! దేహి తెగునంట! దేహమే తెగునంట! ఆ దేహికి ప్రతకారణంబున సద్గతులు కల్గునంట! అట్టి గతుల నీతఁడు కల్పించు చుండెనంట!!! ఏటి కిట్టి యసందర్భ ప్రలాపంబులు?

రుక్మా—ముద్దగాలా! వేదంబు లప్రమాణంబు లనుచు, శాస్త్రంబు లప్రస్తుతోపయోగంబులనుచు, పురాణంబులు కల్పనాకథలనుచు, గురుకులవాసమన్న దెఱుంగక, చిరకాలాశ్రితమైన యాచారంబునందు విశ్వాసములేక, పెద్దలగు వారల పల్కులందు గౌరవమైనలేక, నోరికివచ్చినట్లు ప్రసంగించు నిరాధారములైన యాకాశపంచాంగ సిద్ధాంతములే ప్రమాణముగాఁగల నీ బోంట్లయొద్ద ఆత్మవిషయిక ప్రసంగంబు లసందర్భప్రలాపంబులుగాక మఱి యేమగును?

మోహి—ఒకవేళ గతులు గల్గు ననుకొన్నను

క. ఎండైన డెంద మమలతఁ
జెందిన గతికల్గుఁగాని ♦ సిగ్గఱి యకటా
తందాన తాన యనుచును
జిందులు త్రొక్కుటను ఫలముఁ ♦ జెందుదురె నృపా? 32

రుక్మా—ఏమేమీ? చిందులుత్రొక్కుటయా? ఇట్లనుటచేత నీ యభిప్రాయమేమి?

మోహి—రాజేంద్రా! అప్రత్యక్షంబును, ననుమానంబును నగు నాకలోకానుభవముంగూర్చి యీ మిథ్యావాదంబు లేల కావించెదవు? పోనిమ్ము. నీ విట్లొనర్చుట చేఁ గలుగబోవు ప్రత్యక్షానర్థంబులఁగూర్చియైన యోజింపరాదా?

రుక్మా—ప్రత్యక్షానర్థంబు లేమికలవు?

—* సంవాద సీసమాలిక. *—

మో—పుత్రశోకంబును ♦ మిత్రదూషణమును
నపకీర్తి వచ్చిని ♦ న్నలయు కొనవె?
రు—ఈశ్వరార్పణబుద్ధి ♦ నే నొనర్చినదాని
కపకీర్తి దుఃఖంబు ♦ లలయు టెట్లు?

మో—పరలోక మనియెదు ♦ వైకుంఠ మనియెదు
చొచ్చి నీ వెప్పుడైనఁ ♦ జూచియుంటె?
గు—చూడఁగోరినఘనుల్ ♦ సొంపు దీపింపఁగా
జ్ఞానదృక్కులచేతఁ ♦ గాంచలేదె?
మో—భావిసౌఖ్యము నమ్మి ♦ ప్రత్యక్షమున బాధఁ
బడఁగోరు టెంతైన ♦ భ్రాన్త్య మౌనె
గు—ప్రత్యక్ష మనునది ♦ భ్రమ కాదె? యంతలో
హరియించు నంచు నీ ♦ వరయవొక్కొ.
మో—కాసుచేయని హరి ♦ వాసరవ్రతకాంక్ష
బాలుని ఖండింపఁ ♦ బాడి యౌనె?
గు—హరివాసరమహత్వ ♦ మరయంగ మనబోఁటి
స్వల్పబుద్ధులకెల్ల ♦ సాధ్య మౌనె?
మో—గీ. భ్రూణ శిశుహత్య లివినీకు ♦ ముక్తిదములె?
గు- ముక్తి యన నెద్ది? రాగవి ♦ ముక్తి కాదె?
మో-ఎట్టి ఘనుఁడవు! హా స్వర్గ ♦ మెదుర వచ్చు!
గు- స్వామికృపకన్న మఱివేఱె ♦ స్వర్గ మేడ? 33

మోహి—(హాస్యముగా) అవునవును రాజా. స్వామి నీకుఁ బ్రత్యక్షము కాఁబోవుచున్నవాఁడు. ఇటువినుము.

సీ. తనను యోజనశాలి ♦ ననుకొను మానవుఁ
డొరుల మాటలఁ జెవి ♦ యొగ్గి వినఁడు
వినెనుపో దానిని ♦ వికటంబుఁగా నెన్ని
నెన్నెఁబో వారల ♦ హీనపఱుచు
పఱిచెబోఁ మరలఁ జె ♦ ప్పఁగఁబూను బుద్ధిని
జెప్పెఁబో వారలఁ ♦ జెనఁటు లనును.

పలుమాఱు నీ రీతిఁ ♦ బటువగార్ఖ్యవిస్ఫూర్తి
క్రీంపు మీఁ దరయక ♦ కెరలివడుచు

గీ. పనులు చెడిపోఁగ, నపకీర్తి ♦ పైకి రాఁగ,
ధైర్యముచు లోఁగ, వ్యథను చి ♦ త్తంబు వేఁగ,
చింత లాఁగి మూఁగ, వేడ్కలు ♦ చీఱి సాఁగ
సైవమును దూఱు కుజనుండు ♦ తవిలి తవిలి. 34

ఇట్టివారిని లోకములో నెందఱుఁ జూచుటలేదు రాజేంద్రా?

రుక్మా—నీ వొనర్చెడి సుబోధ నేను వినకుండినందులకా యిట్టు లాడుచుంటివి?

మోహి—సుబోధలని నన్నాక్షేపింపనేల? నీ వభిమానించెడి యా శాస్త్రాభిప్రాయములనయినఁ జక్కఁగా మన్నించితివా?

రుక్మా—మన్నింపక యేమొనర్చితి?

మోహి—ఏమొనర్చితివో నీ వెఱుఁగవా?

రుక్మా—అట్లనెదవేమి? నేను శాస్త్రవిరుద్ధముగఁ బ్రవర్తించుచుంటినా?

మోహి—నీ ప్రవర్తన శస్త్రసమ్మతమగుటచే శాస్త్రసమ్మతమని యనుకొనుచుంటివేమో.

చ. తనయుఁడితండు, రాజ్యపద ♦ దక్షుఁడు, కీర్తివిశాలుఁ డాపయిన్
జనకసుశాసనానుగ వి ♦ చారుఁడు, ధీరుఁడు, ముందుముందు మీ
కనువగు పుణ్యలోకఫల ♦ వాప్తినొసంగెడు దాత, యిట్టి మేల్
గొనములరాసి గూల్చి,యటఁ ♦ గూలెదె పున్నరకాగ్ని కీలలన్?

రుక్మా—అబలా! నీ వచనంబులు చూడ పిట్ట కొద్ది కూఁత ఘనమన్నట్లుగా నున్నవి. ఏమంటివి? పున్నరకాగ్ని కీలలా? ఏ నెఱింగింతు వినుము.

ఉ. మానసకాంత యల్ల పర ♦ మాత్మవిభుం గొని క్రీడసల్ప, వి
జ్ఞానసుతుండు పుట్టి, భవ ♦ నాశమొనర్చును గాని, యేటి య
జ్ఞానము? దేహపుత్త్రుఁడు బుు ♦ ణస్ఫుటవేషుఁడు మోక్షమిచ్చునే?
గ్రానిక వేషధారియగు ♦ భూపతి దేశము లేలఁ జాలునే? 36

మో—నీవంటివానికి హితోపదేశంబు చేయఁబూనిన లోపంబు నాదికాని నీదికాదు.

క. నీతి విడిచి సుతుఁ జంపుట
పాతక మని తెల్పు నాదు ♦ పల్కులు భూపా!
యీ తీరున నీ మనసను
రాతికి గిలిగింతవ్రాలి ♦ రంజిలె నకటా! 37

కానిమ్ము. రాజేంద్రా! నీయిష్టముచొప్పున నే కానిమ్ము. నీకు లేని ప్రేమాను బంధంబు నాకేల? (అని కొంచె మూరకుండి వారలు వినునట్లు తనలో) అయ్యో! ఊరకుండుమన్నను మన సొప్పదే! ఏమియు నెఱుంగని పసిపాపనిఁ బట్టి యన్యా యంబుగఁ జంప నుద్యమించియున్నవాఁడు. బిడ్డలుకలవా రెవ్వరైన నిట్టి కార్యం బొనర్తురా? (అని జనాంతికముగా ధర్మాంగదుని బిలిచి) నాయనా! బిడ్డా! ధర్మాంగదా! ఇటు రమ్ము. (అని చేరఁదీసికొని) నీ జనకుని వాక్యంబులు విను చుంటివికదా? నీవును చావున కేల సిద్ధమయ్యెదవు? అయ్యో బిడ్డా! నిన్నుఁ జూచిన నాకు ముద్దగుచున్నది. నిన్నుఁ జంపుదురన్న నా గుండెలు కొట్టుకొను చున్నవి. ఈ రాజేంద్రుఁడు లేనిపోనిపంతంబులు పూని నిష్కారణముగా నిన్ను జంప నుంకించుచున్నవాఁడు. వీరల జోలి నీ కేల? చిరంజీవివై నాయొద్ద సుఖంబుగ నుందువు రమ్ము. ఆవులు పోరాడి లేగలకాళ్ళు విఱుగఁ ద్రొక్కిన ట్లున్నది. తాను వ్రతముఁ విడఁవడఁట; దానికిబదులు నిన్నుఁ జంపెడునఁట! ఇట్టి యన్యాయ మెచ్చటనైన నుండునా?

గీ. రాచధర్మంబు న్యాయంబు ♦ రట్టు పాలు
చేయఁ జూచెడు నీ యయ్య ♦ చేతఁ జిక్కి
బాధ లిట్లేల పడియెదు? ♦ ప్రాణ మున్న
బలుసుకూరను దినియైన ♦ బ్రదుక లేవె? 38

ఇంతకుముందు స్వర్గమేమో కల్గునని చెప్పుచుంటివి. అయ్యో బిడ్డా? ఇది యెట్టి వెఱ్ఱితలంపు! మతిపోయిన పౌరాణికులు చెప్పెడి వచనంబు లేమైన విని యుంటివా? ఏమియు నెఱుంగని పసికూనకు నీ కీ గాథలన్నియు నేలీ నాయనా? జనకునితో 'నే నీ చావున కొప్పుకొనను' అని చెప్పుము. దానిపైజనకుం

దలుగునెడ నిన్ను నాయొద్దనే యుంచుకొనియెద. నీకుఁ గొదవేమి బిడ్డా? నా మాట వినుము.

ధర్మా—(స్వగతము) అయారే!

చ. అమలచరిత్రుఁడౌచు, సుజ ♦ నావళిచే నుతిఁగాంచు, మేటి నే
మమునవ్రతంబొనర్చు బుధ ♦ మానితుఁడౌ జనకుండు దుష్టస
త్తముఁడఁటక్రూరుఁడౌనఁట! వ్ర♦తంబులుకల్లఁట! యింతెకాక, యీ
యమననుఁగాచి పెంచునఁట! యారె! బళారె దయార్ద్ర వాక్యముల్

(మహాజనుల నుద్దేశించి) ఓ సుజనాగ్రగణ్యులారా!

చ. వ్రతము మహత్తరంబు, ఘన♦పాపహరంబు, సురార్చితంబు, నా
శ్రితజన కల్పకంబు, నల ♦ శ్రీశుప్రియంబు, శుభప్రదంబు, నీ
కృతికయి మేనిఁబాయుటది ♦ కీడఁట! గోడఁట! యిట్టి కాయమే
సతమఁట! వింటిరే జనని ♦ స్వార్థపరైకమహాప్రసంగముల్? 40

(ప్రకాశముగా) జననీ! [31]

సీ. తల్లిదండ్రులకన్న ♦ దైవమే లేఁడని
పలుమారుపెద్దలు ♦ పల్కుచుండ,
నక్కటా వారల ♦ యభిమతంబునకు నే
ననుకూలుఁడనుగాక ♦ యదరిబెదరి,
నీతంత్రవాక్యముల్ ♦ నిజమని మదినిడి
యిప్పటి ముప్పును ♦ దప్పకొనిన
క్షణభంగురమగు నీ ♦ కాయంబు నెన్నాళ్లు
భద్రంబొనర్చి కా ♦ పాడఁగలము?

గీ. నీవు, నేనున్ను, మఱిఁగల్గు ♦ నిఖిల జనులు
నెప్పుడో, యెట్టివేళనో ♦ యెట్టిగతినో
ఏ రుజలఁ జిక్కువడియొ యా ♦ మృత్యువాతఁ
బడుదుమేకాని యది తప్పి ♦ బ్రదుకఁ గలమె? 41

అట్లు వ్యర్థంబుగ మృతినొందుటకన్న నేనీ హరివాసరదినంబున వ్రతనిర్వాహణార్థంబుగ మేనిఁ బాయుట మేలుకాదే? జననీ! ఇట్టి పల్కులు చాలింపుము.

మోహి.—ఓయబ్బ! యీనీతులన్నియు నెప్పుడు నేర్చితివోయి! ఇవి యన్నియు జావఁబోయెడువాని కుండునీతులే. ఔను. పైత్యరోగికిఁ బంచదార విషమగునట్లును దివాంధమునకుఁ బగలు సరిపడనియట్లును, యువతీలోలునకు హరికథాలాపం బనిష్టమగునట్లును నా వచనంబులు నీకుఁ జేదగుచున్నవి కాఁబోలు. అవునవును.

ఉ. అంబరవీథి నేగుచు, ర ♦ యంబున భూమినిగల్గు మాంస ఖం
డంబును గాంచఁగల్గెడి దృ ♦ ఢంబగు దృక్కులుగల్గు పక్షు లు
గ్రంబగు మృత్యువాతఁ బడు ♦ కాలము డాసిన యట్టివేళ పా
దంబులముందుగల్గు నురి ♦ త్రాళ్ళను గానఁగఁజాలవక్కటా 42

అట్లేనీకును జావుసమీపించుటచేతనే నావచనంబులుకర్ణశూలంబులగుచున్నవి పోనిమ్ము. నీకు లేని బాధ నాకేల? ఎద్దునకులేని బెదరు గానుఁగ కుండునా?

ధర్మా.—జనకా! ఈ నారీమణితో నిట్లు వృథాప్రసంగంబులఁ గాలంబుఁగడుప నేల? సత్వరంబున నన్ను ఖండించి నీ వ్రతంబు నెఱవేర్చుకొమ్ము. తడవగుచున్నది.

రుక్మా.—అట్లే యొనర్తు పుత్రకా! (అని మోహినిం జూచి) తరుణీ! నీవు కోరిన ట్లీ పుత్త్రు నిప్పుడే ఖండించి నావ్రతంబును సాగించుకొనఁ బోవుచున్నవాఁడ.

మోహి.—రాజేంద్రా! నన్ను బెదరించెదవా?

క. కొడుకును జంపెద ననుచును
బుడబుడలాడెదవు; చంపు; ♦ పో; నాకేలా?
గుడినుండు గంట పోయిన
నడుమ నచటి నంబి కేమి ♦ నష్టము చెపుమా? 43

వ్రతంబు విడువుమని యెంతచెప్పినను వినక పుత్రునే ఖండింతు ననుచుంటివి. నీకులేని దయారసంబు నాకేల? నీ యిష్టముచొప్పుననే కానిమ్ము. (అని తనలో) ఈతండు నిక్కంబుగ సంహరించునేమో. సంహరించిన ఫల మేమి? ఇచటకర్తవ్యాంశంబు పుత్రవినాశంబు కాదుకదా. కాని యీషణత్రయంబునఁ

జూడ పుత్త్రైషణం బత్యధిక బాధకంబని మహావిరాగులగు తత్త్వజ్ఞులుకూడ నడలుచుందురు. ఈతఁ డూరక బింకంబు లాడుచుండెఁ గాని కదిసి వధింపఁబోవ నీతని హృదయం బదరకయుండునా! ఒకవేళ దిట్టరియై కట్టితనంబునఁ బట్టి వధించునేమో. ఈ శిశుహత్యాపాతకంబు నా కేల? అయినను దేవతాప్రేరణంబునఁగదా యే నిట్లు పూనితి. వా రిట్టి దురంతంబుం జూచి సహింతురా? ఈ సచ్చరిత్రు నిట్టి యకారణదుఃఖంబున ముంతురా? తగిన వెలి వొక్కటి యోజింపక విరమింతురా? కానిమ్ము. ఏమగునో చూచెద.

రుక్మాం—పుత్త్రకా నీ వీ బల్లపైఁ బరుండుము.

ధర్మాం—చిత్తము. అట్లే చేయుదును. (అని పడుకొనుచున్నాఁడు.)

రుక్మాం—(ఖడ్గంబు చేతఁ బుచ్చుకొని యొద్దనిలిచి) ఆహా! ఖండింపఁబోవ దేహము కంపమొందుచున్నదే!

తురంగప్రయాతము.

ఔర, యెంత కార్య మయ్యో! ♦ నాత్మజుఁ వధించు నీ
క్రూర కర్మ మెట్లొ నర్తు ♦ గోపికా మనోహరా?
చేరి వీనిఁ ద్రుంపఁ బోవఁ ♦ జేతు లాడ వక్కటా
యూరకున్న సద్వ్రతం బ ♦ హో! వృథా యగుం గదా.

ఆఁ! ఏమీ! ఏనిప్పుడు పుత్త్రైషణా ప్రతిబంధంబున వ్రతం బుజ్జగింతునా? కటకటా చిత్తమా! నీ కీ భ్రాంతి యేల?

ఉ. పుత్త్రుఁడప పుత్త్రుఁడంచకట ♦ పొక్కెదు నీవిటుమాటిమాటికిన్
పుత్త్రుఁడు నీవు నొక్కతటిఁ ♦ బుట్టిరె? యొక్కటఁ జావఁబోదురే
పుత్త్రుఁడెవండొ నీవెవరొ ♦ పుట్టకపూర్వ, మొకింత నేఁడు నీ
పుత్త్రుఁడనంగనే భ్రమసి ♦ మున్గెదె మోహమహాంబురాశిలో?

ఉ. ఎందఱుఁ పుట్ట రీ జగతి? ♦ నెందఱు కల్గరు? మున్ను పుత్త్రులం
చెందఱు భ్రాంతిఁ జెందరు? గ ♦ ణింపుము వారలు చావకుండిరే

వందలు సేయు వస్తుధన ♦ వాహనముల్ వెనువెంటఁ బోయెనే?
కొందలమందెదేల వినఁ ♦ గూడని కల్లజగంబు నమ్మిచుకా 46

క వి రా జ వి రా జి త ము.

సతిసుతసోదర బంధుహితాదుల ♦ సంఘమునందలి భ్రాంతిని నీ
గతి వెతనొందుట మౌఢ్యమనందగుఁ♦గాదె? వివేకుల కార్యమె, హా
హితవుగఁ దెల్పిన సద్గురుబోధ యె ♦ కింతయు నెప్పుడు నీడకు వే
సుతుని వధింపవె; శోకమడంప ♦ వె; చూటి పరాత్పరునం దిడవే.

మోహి—(తనలో) ఔరా! యీతని వైరాగ్యం బెంతయుఁ గొనియాడఁ దగి యున్నది. నాయత్నం బిప్పటికి వ్యర్థమైనట్టులే యున్నది.

నక్షత్ర—పుత్రికా! యిఁక సిద్ధంబుగ నుండుము.

ఉ. హా పరమాత్మ! యాశ్రితజ ♦ నావన! యచ్యుత! దీనవత్సలా!
యీ పసికూన దోషమొక ♦ యింతయెఱుంగదు; మద్వ్రతార్థమై
యీ పరమేష్ఠిపుత్రి వధి ♦ యింపుమటన్నను నిట్లు పూనితిక్
పాపవిదూర! వీనిఁ గృ ♦ పామతి నీ దరిఁజేర్చి కావవే. 48

(అని మొక్కి వ్రేటు వేయఁగా కంఠమున కేమాత్రము బాధఁ గలిగింపకయే ఖడ్గము విఱిగిపోవుచున్నది. దీనిచేత రాజు విస్మయంబంది తనలో)

అక్కటా యిదియేమి యాశ్చర్యము! రణరంగమందనేకులగు శత్రురాజుల శిరంబులెల్ల ఖండతుండంబులుగ నఱికి వన్నెకెక్కిన యీ యాయుధం బిట్టి లీ పసిబాలుని కంఠముపై వేసినమాత్రంబున విఱిగిపోయెనే? ఇందు కేమనవచ్చు? (అని దానిం జేతఁగొని) అక్కటా ఖడ్గమా! యిట్లు తునియలైతివా?

చ. సమరమునందు శత్రువుల ♦ సత్యవిదూరులఁ గ్రూరకర్ములక్
గుమతులనెల్లఁ ద్రుంచి నుతిఁ ♦ గొన్న నినుంగొని నిర్మలాత్ము నీ
సుమసమదేహుఁ ద్రుంపఁగను♦జూచితినం చిరువయ్యలైతె? న్యా
యమ ఇంది? సద్వ్రతార్థ మక ♦ టా కరుణించి క్షమించు ఖడ్గమా!

( అని ఖడ్గమునకు మ్రొక్కుచున్నాఁడు. )

మోహి—అవునవును. ఆ ఖడ్గము ముందే క్షమించినది యీ బాలుని. భూపాలా! నీ విచ్చట నొక్క ధర్మం బెఱుఁగవలసియున్నది. ఏమన:—లోకంబున నేరస్థుఁ డగువాఁ డురిఁదీయఁబడునపు డాతఁ డేకారణంబుననేని మృతుండు గాని యెడ నాతండు నిజంబున నిర్దోషియనియు, నాతఁడు శిక్షింపఁబడుట సర్వసాక్షియగు పరమేశ్వరుని సంకల్పము కాదనియుఁ, దలఁచి యాతని నిర్దోషిగా నిశ్చయించి మరల నురితీయక విడుతురు. ఇది రాజనియతి. ఇట్టి ధర్మానుసరణంబుగ నీ ధర్మాంగదుం డిపుడు రక్షార్హుండు. కావున నీతని విడువుము. వ్రతం బటుంచి మన మంతఃపురంబునకుఁ బోవుదము రమ్ము.

రుక్మా—ముద్దరాలా! ఈ ధర్మాంగదుండు దోషియని శిక్షింపుచుంటినా? ఇపుడు నిర్దోషియని రక్షింపనుంటినా? మద్వ్రతనిర్వహణార్థంబుగ నీతని యనుమతి చొప్పున నిట్లొనర్చుచుంటి. ఇందు నీ ధర్మోపదేశంబు లేల? చాలింపుము. (అని విఱిగిన యాయుధము నావలఁ బడవైచి) సేవకా! విల్లునమ్ములు గొనిరమ్ము. (అని యాతఁడు తెచ్చి యొసంగఁగా దీసికొని) హృదయమా! నీవు కలవర మందకుము.

ఉత్సాహావృత్తము

శ్రీధరుండు భక్తవరుల ♦ చిత్తవృత్తు లెప్పుడున్
శోధనం బొనర్చి పిదప ♦ సుఖము లిచ్చుఁ గావునన్
బాధ కాదు నేఁ డిదెల్లఁ ♦ బంకజాక్షు కృపకు సత్
సాధనం బటంచు నీవు ♦ ధైర్య మొందు డెందమా! 50

హస్తమా! నీ పరాక్రమము చూపుట కిదియే సమయము.

లయగ్రాహి

హుమ్మనుచు శత్రునిచ ♦ యమ్ము నెగ జిమ్మి సమ
రమ్మున జయమ్ము వెద ♦ చిమ్ముమును కరమా!
ముమ్మరపు మోహామక ♦ రమ్ము వడి మానస గ
జమ్ము నిహసౌఖ్య సలి ♦ లమ్ము

జమ్మనుచు జ్ఞాననిక ♦ రమ్మను సుదర్శనవ
రమ్మన రణమ్మన జ ♦ య మ్మిపుడు కొమ్మా
అ మ్మకరముల్ దునిమి ♦ నెమ్మదికి శాశ్వత సు
ఖ మ్మొసఁగు నీకిది ఘ ♦ నమ్మగు కరమ్మా! 51

పుత్రికా! నీ విచట నిలువుము.

ధర్మా—చిత్తము. ఆలాగే చేయుచున్నాను.

రుక్మా—(శరము నుద్దేశించి) అక్కటా శరమా! నీవేమిచేసెదోకదా.

మ. పరమాహ్లాదముతోడ నిన్ సుహృదుగాఁ♦బ్రాణాప్తుఁగా భ్రాతఁగా
జిరకాలంబు వహించితిన్ మఱియు నా ♦ జీవంబుగా నెంచితిన్
శరమా! నాపయి నాగ్రహింపక మదిన్ ♦ సంకోచముల్ లేక నీ
చిరసౌహార్దవిశేషతన్ సుతుశిర ♦ చ్ఛేదంబుఁ గావింపుమా 52

హా! జగద్రక్షకా! (అని శరంబును వాలుని కంఠముపైఁ బ్రయోగింప
గా నది పుష్పహారమై వాని కంఠంబునుఁజుట్టుకొనుచున్నది. అదిచూచి)ఔరా!
యిది యెంతచిత్రము! ఈ శరంబయిన వీనికంఠంబును దునుమక పైమిక్కిలి తా
నొక పుష్పహారమై వీని కంఠంబునుఁ జుట్టుకొనుచున్నదే! అక్కటా శరమా!

చ. ప్రియసఖి వాదులాడుటలు, ♦ పెల్లుగఁ బట్టపుదేవి నొచ్చుటల్,
నయరతుఁ బుత్రుఁజంపఁగఘ ♦ నంబుగ నిన్గొని వేఁడికో, లయో
మయతను వించు, నిందులకు♦మానస మొప్పమి, నార యిట్టులో
నే? యనుచుసౌమనస్యమువ♦హించియ యోమయుననొన్నెనర్చితే?

ఇప్పుడు నే నేమి చేయుదును? (అని తనలో)

తరలివృత్తము

తల్లి, సుతుఁడు, తండ్రి మఱియు ♦ ధాత్రుసుతయు నొక్కటన్
వల్లె యనుచుఁ బుత్రుఁ దునుమ ♦ వాంఛఁజేసి యుండఁగా
నెల్లనిగతి నమ్ములకట ♦ యూఱకయె తలంగెడున్.
నల్లదొర వరమ్మొసఁగిన ♦ నంబివరము కానటుల్. 54

మ. కలకాలంబు భరించినన్ బెనిచినన్ ♦ గష్టంబులన్ గాచినన్
జెడుకాలంబు తటస్థమైనయెడ ని♦ స్సీ యంచు సౌమ్యాత్మకుల్
చెలికాండ్రాప్తులు బంధులున్ విడుచుటల్ ♦ సిద్ధంబె యౌఁగాని యీ
పలుకన్ లేని యచేతనంపు శరమున్ ♦ బాసెంగదా దైవమా!

నే నొనర్చు వ్రతమునం దేమైన దోషంబు కలిగియుండునా? అట్టిదేమియుఁ గానరాదే. హా పరమాత్మా! ఆపద్బాంధవా! దీనశరణ్యా! నే నెవ్వగవాఁడ నగుదు? నేఁడు న న్నిట్టు లేల యలయింపఁ జొచ్చితివి? నన్నుఁ బరిశోధింపఁ దలఁచియే యిట్టి యిక్కట్టులఁ బెట్టి గట్టువడం జేయుచుంటివా? వీని శిరం బెంతయు ఖండింప శక్యంబుగాకయుండె. ఖండించినగాని నా వ్రతంబు నెఱవేఱదయ్యె. ఇట్టిసమయంబున నీ దీనుని మొఱాలకించి దీనవత్సలుండను బిరుదు నిలుపుకొమ్ము.

ఉ. హా! విధినేమియందు? మది ♦ నారటమెట్టులు డిందు? నింక నా
యీవెత కేదిమందు? మఱి ♦ యెవ్వరితో మొఱవెట్టుకొందు? నీ
వీవగ నూరకుందు విది ♦ యేటి తమాష బలే పసందు? దా
సావనుఁడన్న నీదు బిరు ♦ దాంకము భద్రము! దీనరక్షకా! 56

(అని మఱియొక ఖడ్గముం గైకొనుచున్నాఁడు.)

మోహి—కటకటా, కఠినహృదయా! వేఱొక ఖడ్గముం గొని ఖండింపఁబోవుచుంటివా? ఆ యచేతనంబగు శరంబునకైనఁ గనికరము వుట్టెఁ గాని నీహృదయపాషాణంబు కరఁగదాయె! ఈఘోరకృత్యం బీశ్వరప్రీతికరంబగునేని యాశరం బట్లు పువ్వుహారమై వీని మెడం జుట్టుకొనునా? నీ విందు కేమనియెదవు?

రుక్మా—ఏమందునా? నీవు కేవల మనుష్యమాత్రురాలవు కావనియు, మాయాస్వరూపిణివనియు, నిదియెల్ల నీ మాయావిశేషంబనియు ననెద. (రౌద్రముతో) నీవింక నన్ను సమీపించి యడ్డదిడ్డంబు లాడకుము. నాచేతిలోని యిది ఖడ్గంబని యెఱుంగుము. బాపురే! నిర్మలచిత్తంబున మాయారహితుండగు బరాత్పరు నెప్పు డారాధించు నే నీ తుచ్ఛమాయావిచేష్టితంబులకు వెఱతునా? హా గజరాజవరదా!

ఉ. ఏనె ప్రభుండనేని, భువి ♦ నెన్నఁడసత్యముఁ బల్కనేని, యేఁ
బూనిన యీ వ్రతంబు సుర ♦ పూజ్యము విష్ణుప్రియంబు నేనియున్
మానుగ వేదవాక్కులు ప్ర ♦ మాణములేనియు, మద్వ్రతార్థమై
నీనిశిరంబు నేఁడిట భు ♦ విన్ బడకుండునె యొక్క వ్రేటునన్

(అని ఖడ్గమెత్తి వ్రేయఁబోవఁగా శ్రీ విష్ణుమూర్తి శంఖచక్రకిరీటధారియై ప్రత్యక్షుండగుచు రుక్మాంగదుం డెత్తిన ఖడ్గంబుఁ బట్టుకొని)

ఉ. తాళుము తాళు భూప యిఁకఁ ♦ దత్తర మొందకు; నీదు భక్తికిన్
జాలఁగ మెచ్చినాఁడ; మది ♦ సంతసమందెను; నీ సుతుండు నీ
యాలును మేటిభక్తిఁ దన ♦ రారినవారలు; మీరు మువ్వురుం
బాలును నీరు శర్కరల ♦ మాడ్కిని గూడినవార లిచ్చటన్ 58

రుక్మా— సంధ్యా— ధర్మా— మోహి—
గజరాజవరదా! ఆపద్బాంధవా! నమస్కారము.

## దండకము.

శ్రీమన్మహాదేవ యీశా! లసచ్చిత్ప్రకాశా! మహాఘోర పాపప్రణాశా! పరేశా! భవద్దివ్యసందర్శనానందకాంక్షన్ దివిన్ దేవముఖ్యుల్, భువిన్ మానవేంద్రుల్, వనిన్ మౌనివర్యుల్, మహాభక్తివారాశిపారంగతజ్ఞానసంపన్నులై యొప్పు వ్యాసాంబరీషాది భక్తాగ్రగణ్యుల్సదా నీదు పాదార్చనధ్యాన సంకీర్తనంబుల్ కడుంబ్రీతి గావించి సంతృప్తులై పొంగుచుందుర్ గదే భక్తహృత్పావనా! * దేవ నీరూపుఁ గన్గొన్న మాత్రాన నీనామమున్ విన్నమాత్రంబునన్ శాకినీ, ఢాకినీ, కామినీ ముఖ్య దుష్టగ్రహంబుల్, మహాభూతప్రేతంబులున్, బల్ పిశాచంబులున్, గాలిదయ్యంబులున్, గూలిపోవుం

గచే; దుష్టనాశా! విరాట్పురుషా! విశ్వరూపా! జగద్రక్షకా! వేదవేదాంతవేద్యా! పరంధామ! జ్యోతిస్వరూపా! * జగంబెల్లఁ బుట్టింపఁగాఁ బెంపఁగా ద్రుంపఁగా నీవకావే?జగన్నాయకా! యార్త రక్షామణీ! కామితార్థప్రదా! యిట్టి లోకాధినాథుండవైయొప్పు నీ దివ్యరూపంబు మాపూర్వపుణ్యంబునం జేసి నేఁడిందు మా కన్నులారంగఁ గన్గొంటిమయ్యా! దయం జూడుమయ్యా దరిం జూపుమయ్యా మముం గావుమయ్యా * కృపాసాగరా! దాసహృద్గేహవర్తీ!! జగద్గీతకీర్తీ! నమోదీనబంధూ! నమోజ్ఞానసింధూ! నమోభక్తనేతా! నమోముక్తిదాతానమోఽసచ్చిదానందమూర్తీ! నమస్తే నమస్తేనమః.

విష్ణు—రుక్మాంగద భూపాలా!

ఉ. మెచ్చితి నీదు వర్తనకు ♦ మెచ్చితి నీదగు సాధువృత్తికిన్
మెచ్చితి నీదు యోగ్యతకు ♦ మెచ్చితి నీ సుజనానురక్తికిన్
మెచ్చితి నీ వ్రతంబునకు మెచ్చితి భక్తికి; మెచ్చి సద్వరం
బిచ్చితి; మీరలెల్ల సుఖ ♦ యింపుచు రాజ్యసుఖంబులందుఁడీ. 6!

రుక్మా—మహాప్రసాదము, ఆశ్రితవత్సలా!

విష్ణు—రాజేంద్రా! ఏనొక్క రహస్యంబు నెఱిఁగింతు వినుము.

—* మా ని నీ వృ త్త ము *—

నీ నిజభక్తిని నీదు సువర్తన ♦ నీ వ్రతనిష్ఠఁ గనుంగొనఁగన్
మానినిమోహిని బ్రహ్మసృజించి క్ర ♦ మంబుగనీదరికిన్ బనుపన్
గానివిధంబులఁ గాఁజేయ వెట్టి య ♦ ఖండ శ్రమంబుల నిగ్గలచెన్
గానియమాయికురాలిదిమోహిని ♦ కంటకురాలనియెంచకుమీ

ఈ యువతి నిర్దోషి. నీ సంధ్యావళ్యాది నూర్వురుభార్యల మరలఁ జేకొని తొల్లిఁటియట్ల గౌరవించి యేలుకొమ్ము. మఱియును

వె. స్రష్ట నిన్నుఁ గూర్చి ♦ సృష్టించె నిక్కాంతఁ
గాన యొరుల సొత్తు ♦ కాదు సుమ్ము

అఖిల ధర్మవేత్త ♦ యనుపమ నుతశీల
నీకుఁ దగిన కాంత ♦ నిర్మలాత్మ! 62

కావున నీ తరుణీమణిని నీ పట్టమహిషియగు సంధ్యావళితో సమగౌరవంబున నేలుకొమ్ము.

రుక్మా—చిత్తముమహానుభావా! దేవరయాజ్ఞ శిరసావహించి యట్లే యొనర్చువాఁడ.

విష్ణు—విధి[వ్రా]లుచొప్పునమీరీలోకంబుననుండువఱకును రాజ్యసుఖంబులనుభవింపుచుండి యంతంబున నాసన్నిధినిఁ జేరఁగలరు. మీర లింక నేమైన వరంబులఁ వేఁడవలతురేని యడుఁగుఁడు. ఒసంగ నిచ్ఛవహించియున్న వాఁడ.

రుక్మా—మహానుభావా! ఆశ్రితకల్పభూజా! నాకు వేఱువరంబులేల?

—* మానినీవృత్తము. *—

నాప్రియపత్నులు నావరపుత్రుఁడు♦నాహితబంధులు నేను బ్రజల్
శ్రీపతి! నీ పదచింతన వీడక ♦ చిత్తము లెప్పుడు నీకడనే
కాపురముంచి, దృఢంబగుభక్తిన ♦ఖండసుఖాప్తిని గాంచునటుల్
పాపవినాశ! మహేశ! పరేశ! కృ ♦పన్ దయసేయవె లోకపితా!

విష్ణు—సంధ్యావళీ! నీ వేమి కోరెదవు?

సంధ్యా—భక్తజనార్తిహరణా! రమారమణా!

మ. తరుణుల్ విద్యలనేర్చి, వేత్తలయి, మ ♦ ద్రాజ్యంబునందెప్డు స
చ్చరితంబుల్ బఱిఁబంపుచున్ విభులకున్ ♦సంతోషముంగూర్చుచు
స్వరపూజానిపుణైకచిత్తలయి స ♦ ద్వ్యాపారపారీణలై
యిరవొందన్ వరమీఁగదే గుణనిధీ ♦ యీశా! జగన్నాయకా!

విష్ణు—బాలకా! ధర్మాంగదా? నీ వేమైనఁ గోరెదవా?

ధర్మా—భక్తవత్సలా? కరుణాకలాపా! నా కేమి కావలయును?

---

127 పుటలోని దండకము పైనలువురిలో వరుసగా నొక్కొక్కరు
* ఈ గుర్తువఱకుమాత్రము చదివిన బాగుగ నుండును.

ఉ. పిల్లలు తల్లిదండ్రులను ♦ బేర్మిని దైవములంచు నెంచి, తా
మెల్లెడ వారిచిత్తముల ♦ కెక్క నటింపుచు, మత్పురంబునన్
సల్లలిత ప్రచారులయి ♦ శాశ్వతసౌఖ్యము లందునట్టులు
త్ఫుల్లసరోజనేత్ర! సుర ♦ పూజితగాత్ర! యనుగ్రహింపవే. 65

విష్ణు—విధితనయా! మోహినీ! నీయభీష్టం బెట్టులుండె?

మోహి—కపటనాటకసూత్రధారీ! కలుషభయవిదారీ!

ఉ. ఆ విధియాజ్ఞచొప్పున ధ ♦ రాధిపుచెంగట నే నటించి న
ట్లీ విపరీతభంగి భువి ♦ నేసతియుం గొనకుండుమాడ్కి నీ
భూవర సత్కథాశ్రవణ ♦ పూతమనస్కులు క్రూరచిత్తయం
చో వరదాత! నన్ దలఁప ♦ కుండెడుమాడ్కి ననుగ్రహింపవే.

విష్ణు—ఔరా! మీరుకోరినవరంబులు మిగుల శ్లాఘనీయంబులు. అట్లేయొసంగితి. రాజచంద్రమా! మరియొక విశేషం బెఱింగింతువినుము. నీ విప్పుడీ హరివాసర వ్రత మాహాత్మ్యంబున సర్వజనమాన్యచరిత్రుఁడ వయితివి. కావున

చ. బుధజనవంద్యమై సుజన ♦ పూజితమై తగు నీచరిత్రమున్
బదఁపడి యెవ్వరేనియు న ♦ వారణభక్తివిశుద్ధచిత్తులై
చదివిన వ్రాసినన్ వినినఁ ♦ జాలగ వారలుభోగభాగ్య సం
పదలఁ జిరాయువున్ గలిగి ♦ వర్ధిలుచుండెద రెప్డు మత్కృపన్.

నేను పోయివచ్చెద. మీరు సుఖంబున నుండుఁడు.

(అందఱు నమస్కరించుచున్నారు. విష్ణుమూర్తి యంతర్ధానుం డగుచున్నాఁడు.)

రుక్మాం—సఖులారా! పరమేశ్వరానుగ్రహంబున మనమిప్పటికి ధన్యుల మయితిమి. నేను బహుకాలం బీ రాజ్యంబెల్ల వహించి యలసియుంటి. కావున నిపు డీ పుత్రుని యువరాజ్య పట్టాభిషిక్తునిఁ గావించి యే నీశ్వరధ్యానైకరతుండనై యుండఁ గుతూహలంబు గలుగుచున్నది. ఇందుకు మీ యభిమతం బేమి?

సంధ్యా—ప్రాణేశ్వరా! అట్లే కానిండు.

మోహి—నేను దేవర చిత్తానుసరణంబుగ వర్తించుదానఁ గాని వేఱుకాదు. అట్లే యొనర్పఁడు.

రుక్మా—పుత్రా! నీ యభీష్టం బెట్టిలుండె?

ధర్మా—జనకా! నాకు నీ యాజ్ఞాపరిపాలనంబునకన్న భాగ్యం బేమికల్గు? దేవర చిత్తానుసరణంబుగ నొనర్పఁడు.

రుక్మా—అట్టులైన నిపుడే చని యువరాజ్యపట్టాభిషేకోత్సవము గావింతము రండు.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)



ప్రవేశము—రుక్మాంగదుఁడు, గుణనిధి, సంధ్యావళి, మోహిని, చకోరాక్షి, పద్మగంధి ధర్మాంగదుఁడు, బ్రాహ్మణులు మొదలగువారు.

అందఱు—(ధర్మాంగదునిఁ బీఠముపైఁ గూర్చుండఁబెట్టి)

ధర్మపరిపాలనశీలా! ధర్మాంగద భూపాలా!

చ. ధరకు ముదమ్ముఁగూర్చి, విబు ♦ ధ వ్రజముఁ సుఖులంబొనర్చి,స
త్పురుషులనాదరించి ముని ♦ ముఖ్యులపూజలొనర్చి యార్తులఁ
గరుణనుబ్రోచి నిన్నుఁ గల♦కాలము నెల్లరుమెచ్చఁ బృథ్వి నీ
శ్వరకృప నేలుమయ్య వర ♦ పాలక! సజ్జనగణ్య! బాలకా. 68

క. శ్రీరమణీ ప్రియరమణా!
సారసదళనయన! మోక్ష ♦ సాధననిపుణా!
సారాశ్రితభవతరణా!
యారీకృతభువనభరణ ♦ యురగపశయనా. 69

మాలిని.

శ్రితజనపరిపోషా ♦ సిద్ధచేతోవిశేషా
పతితజనవిశోషా ♦ భాస్వరద్దివ్యవేషా
అతులిత మృదుభాషా ♦ యార్యహృత్కంజ పూషా
కృతమహివరభూషా ♦ కీర్తితాపారతోషా. 70

( [32] అందఱును ధర్మాంగదుని పైఁ బుష్పములు చల్లుచున్నారు.)

గద్య.

శ్రీమ దుమారమణ కరుణా కటాక్ష పాత్ర శ్రీవత్సగోత్ర బేతపూడి
వంశ క్షీరపారావార రాకాసుధాకర మల్లేశ్వరామాత్యపౌత్ర,
నిరంతర శివారాధనపరాయణ లక్ష్మీనారాయణామాత్య
చతుర్థపుత్ర, గుణకదంబ లక్ష్మాంబాగర్భ సంభూత,
సుజనవిధేయ, భగవంతాభిధేయ ప్రణీతం
బైన రుక్మాంగద నాటకంబున నిది
షష్ఠాంకము.

సంపూర్ణము.





# పీఠిక.

రంగస్థలమం దచ్చటచ్చటఁ బాత్రములు పాడుట కనుకూలించునట్లు కథాసంబంధముఁ గల కొన్ని పాటల నిచట వ్రాసియుంటిని. ఇందు మొదటి మూఁడుపాటలలో ఒకటిగాని రెండుగాని నాటకారంభమందు సూత్రధారుఁడు పాడఁదగును. రంగస్థలమం దే కారణముననైన విరామముగలప్పుడు స్వప్రయోజకత్వ ప్రకట నార్థముగను, సభ్యహృదయ రంజనార్థముగను సూత్రధారుఁడు నేపథ్యమందుఁ బాడుట కనుకూలపడునట్లు నం. 33 మొ 36 గుల వఱకుగల పాటలను వ్రాసియుంటిని వీనిలో నొకటి రెంటిని మాత్రము పాత్రలకొఱకై సూచించితిఁ గాని యిట్టివి పాడుటకుఁ దగిన వేషధారులు దొరకుటయరిది. వీనియందు ఆవర్తనియమమును, మాత్రాకాలంబును లఘుద్రుతసహితంబుగఁ దెలియఁబఱిచియుంటిని. వీనియందు దీర్ఘాక్షరముల చెంత (,) ఈ గుర్తులెన్నియుండిన నన్ని మాత్రల కాలమని గ్రహింపవలయును. దీర్ఘాక్షరములమధ్య ఘాత వచ్చినప్పుడు దానిని హ్రస్వముగ వ్రాసి ఘాతపడవలయుచోట పై గురుతును వ్రాసి యుంటిని. స్వరములపై ‾‾‾‾ యీ గుర్తులు గలప్పు డవి పైకాలస్వరములని తెలియవలెను. ఈ 36 పాటలుగాక, పాటలుగాఁ బాడఁదగిన 30 వృత్తములు గ్రంథమందు వ్రాసియుంటిని. గుణగ్రహణపారీణులును, గానవిద్యా విశారదులును అగు విద్వాంసు లెల్లరు నిందలి లోపంబుల మన్నింప వేఁడుచున్నాఁడ.

బెజవాడ,
8—3—1916.

ఇట్లు బుధజన విధేయుఁడు,
చేతపూడి భగవంతరావు.

అనుబంధము.

# పాటలు.

ఘట్ట. పాట.

1 [1] సూత్రధారుఁడు. —*కన్నడరాగము—ఆదితాళము*—

ఆనందమయ్యెరా। ఆనందమయుని కరుణారసభరమున. నా.

దాన ధర్మములకువన్నె కెక్కి-ని-దానమూర్తులనఁగఁ బేరుఁగాంచి మాననీయులైన సరసగుణప్ర-ధానులిటకు దయతో విచ్చేసిరి। ఆనం.

1 శక్తికల్గినందులకుఁ బరేశుని - భక్తికన్న నితర మెల్లమనుచును। రక్తి నతనిఁబాడి పాడి జీవ - న్ముక్తులైనభక్తులిచటఁజేరిరి। యానంద.

2 ముద్దులొల్కు-పదములతో రవపాడి - యద్దినటులు పద్దెములను గూర్చుచుఁ। బెద్దలైన కవివతంసులెందఱో - యిద్దినమున సభనలంకరించిరి। యానంద.

3 ఎంతకార్యమైన భరమనక గో - రంతలోనె తీర్పనేర్పరౌ భగవంతుఁడే సానుగ్రహుఁడై మా-యంత రంగ వర్తియౌచు నిలిచెను। ఆ

[2] సూత్రధారుఁడు. —*హనుమతోడిరాగము—ఆదితాళము*—

పరాత్పరా! బ్రోవరా। కని। కరానను సిరిదొరా!.

బిరాన, కని, కరానమా। వరాలి-డరార -వరాల-దొరా! వే. ప

1 ఏలఁ గరుణా జాల! నిను నే-వేళ నమ్మినామురా। బాలకావళి పల్కులెల్లను - మేలు మేలనఁజేయరా। పూలతోడఁ - బూజసేతుము చాల నిన్నే-స్మరణచేతుము। జాలమింక చేయకయ్య వరదా! బాలగోపాల! గోపాలపాల! పరా.

[3] సూత్రధారుఁడు—*సింహేంద్రమధ్యమరాగము—ఆదితాళము*—

శంకర! భక్తవ- శంకర! శ్రీకర! శంకర! భవనా - శంకర! దేవా.

1 పంకజ చరణా - భవభయ నాశనా-సంకట హరణా - స్వామి దయాళూ! శంకర.

2 దానవభంజనా-దీనజనావన। మానినుపోషణా-మానితసుగుణా!శం
3 ఈశ। శ్రీభగవంత-దాససుపోషా। వాసవనుత! స-ర్వేశపరేశ!.శం.
(సూత్రధారుని పాటలకు సూచన లీయఁబడలేదు. కోరిక పాడుఁడు.)

7 [4] రుక్మాంగదుఁడు —*బేహాగ్ రాగము—ఆదితాళము*—

అందంబైనది సుమము। యే। మందును దీని సగసము
డెందంబున నా - నందంబును జెం - పొందఁజేయు నిది నిజము.
1 అందంబగు సగలందు-తళుకు్క - మ-సందగి యున్నది సుమము।
సుందరయువతి యా-సందగు సతిశిర -మందిది నిల్చిన ఘనము. అం.

10 [5] —*ఖరహరప్రియ రాగము—ఏకతాళము-త్రిశ్రజాతి.*—

(రుక్మాంగదుఁడు, సంధ్యావళి, సాహిత్యముమాత్రమే పాడవలెను.)

పాపపా - ధసా - నిదపా - మగా, - మగరీ,,,,.
శ్రీకరా - శుభా - కఅరా - నమో,, - నఅమో,,,,.
1 దామ దామ దామ దా - ధసా - సగరిసా। సాస సరిస -
సేరమే రబ్రోవ రా -కృపా- అఅకరా। ధీర యఘువి -
నీని నిసని - దాద దనిదపా। సా నీ దా నిదపా
మార నిగమ - సార గఅవరా। మారా కా అఅరా -
సా నీ దా నిదపా - సాస మగరిసా.
సా రా చా అఅరా - రార సుఖకరా.
2 పంత మింత సేయ మేర గాదురా। ఎంతయును భ-జింతుము
భగ - వంత దాసనుత। శాంతా కారా - చింత దీర్చి - సం
తస మిడరా. శ్రీకరా.

(ఇష్టమైనవార లీ యింగ్లీషుపాటను పైమట్టు ప్రకారమే పాడుకొనవచ్చును.)

సూత్ర— Bless our Society God! Creator!.
For your beloved look we always look -
clear the faults and-give us free thoughts in -
all that we enact- Almighty! and- Omnipresent!
all is this, we all now meant-make us all pleasant.
Bless.

11 [6] శుకయోగి. —*మాయామాళవగౌళరాగము—ఏకతాళము*—

నారాయణా నారాయణా - నారాయణ శ్రీమన్నారాయణా.

1 ధనధాన్యంబులను - మఱి - దారసుతాదులను । ఘనసుఖంబు
గల్గినను - నిను - ననుదినమును మది నిల్పినఁ జాలును, నారాయణా

16 [7] శుకయోగి. (పైపాటలోని పరణములే.)

నారాయణా నారాయణా - నారాయణ శ్రీమన్నారాయణా.

2 ఇడుమలు కల్గనెడఁ - అవియుఁ బ - రీక్షకై యనుచు నెఱిఁ
గడునిశ్చలత గుఱిఁ - దొలఁగక - కార్యసిద్ధినొందఁగా మేలగుఁ

3 ఎంతటి ఘనుఁడైనఁ - ధర - నీశ్వరుఁడే యైనఁ
వంతలు తప్పవిలఁ - భగ - వంతుని దలఁచిన శాంతి లభించును. నా.

28 [8] నారదుఁడు.—*హనుమతోడిరాగము—ఏకతాళము-చతురశ్ర జాతి*—

శంకరా - రిపు - జాలభయంకరా.

పంకజాక్ష! భవ - పాశనా శంకరా. శంకరా.

1 సుజన వినుత పద - సూరిజనాభయద । త్రిజగదభీష్టప్రదా -
శుభదా. శంకరా.

2 మదన దమన ఘనా-మానిత సుగుణా । మదగజ రిపుధృత నా -
రమణా. శంకరా.

33 [9] నారదుఁడు. —*ధన్యాసిరాగము—ఆదితాళము*—

సర్వవ్యాపకుఁడైన యీశ్వరా - శరణు శరణు దేవా!
సర్వాధారుఁడు సర్వేశ్వరుఁడును - సర్వశక్తుఁడగుదు వీవె తండ్రీ. స.

1 తనదైవంబని పరదైవంబని - తగువులాట తగునే?
కనుగొన సర్వవ్యాపకుఁ డొక్కని -కంటె నుండనగునే? యీశా. స।

34 [10] యముఁడు. —*ముఖారిరాగము—ఆదితాళము*—

ఔరా! యెంతవచ్చె । నా । యాశలెల్లఁ బోఁజొచ్చె. ఔర.

ఆ రాజేంద్రుని వ్రత మహిమను - నా రాజ్యంబిట్లు కాఁగెన్నెను,
తెరా? నాకొక దరిఁజూపఁగ - ధీరాగ్రగణ్యులెవ్వరిలలో. ఔర.

1 అన్నా! యిచ్చటివారలె చను - చున్నా రిట్టివింత కల్లుట ।
యెన్నఁ డైన మీరలిలలో-కన్నారే? విన్నారె? తెల్పరే?. ఔరా.

36 [11] *a* —*ఖరహరప్రియరాగము—ఏకతాళము*—

యమ—సెభాసు! ధాత!చాలయా-మంచిఁ-జేసినాఁడ వింక నన్నుఁ
బంపుమీ । దొడ్డ । ప్రభునిగఁ నన్నొనర్చినాఁడ వహహా. సెభా.
బ్రహ్మ—ఆహా! యిదేమిశమనా?-యింత యారటంబుఁ జెందనీకుఁ
దగునా? ఔర । సాహసంబు లిట్టు నీవు చేయనగునా? ఆహా.
యమ—ఆతఁ డిట్లు వ్రత మొనర్చుటేమి? - దీని - చేతనాదు లోక
మిట్టు లౌటయేమీ?. సెభాసు.
బ్రహ్మ—(తలయూఁచి యూరకున్నాఁడు.)
యమ—చేతకాని వానిఁ బోలియుండవనా? - దీని - చేతనాదు లోక
మింక నిల్వఁగల్గునా?. సెభాసు.
బ్రహ్మ—కీడు మేలు లేరికైనఁ గల్గవే? - వాని - కోడి యిట్లు బేలలగు
చుంటతగవే. ఆహా.

36 [11] *b* యముఁడు. -*మాళవగౌళరాగము—ఏకతాళము-చతురశ్రజాతి*-

ఏమియిట్టి రాజునుంచి ఫలము?-నా-కేమితోఁచదయ్యో దీనిగుణము ।
నీమనంబునందు దీని-కేమి యెంచినావో కాని । రామరామ నేను
వట్టి - రట్టుపాలు గాగనయ్యె. నేమి.
1 ఆతఁడిట్లు వ్రతమొనర్చుటేమి?-దీని-చేతనాదు లోకమిట్టు లేమి?।
చేత కానివానిఁబోలి- చేతులొగ్గి యుండఁజాల । ధాతనన్నుఁ బంపు
నీకుఁ- దండమయ్య చాలుఁజాలు. నేమి.

(ఈ 11 *a b* లలో నొకటిమాత్రము పాడినఁ జాలును.)

39 [12] యముఁడు.—*కాఫీరాగము — ఏకతాళము - చతురశ్రజాతి*—

1 ముల్లోకములకెల్ల-మూలమైనధాత । యల్లభూపుణ్ సాధింపఁడే?
నా-యాసలెల్లఁ దీర్పఁడే?.
^ 2 ఈతనిమాయచే-నాతండేరానిమ్మ ! పాతాళ మంటఁద్రొక్క-నే-
^ బహు - బాధలను బెట్టనే?.

3 కటకట యతఁడు నా - కంటనే పడనిమ్ము । పెటపెటమనఁ
బేల్చనా? - మఱి - పెక్కు వెతలఁ బెట్టనా?

41 [13] మోహిని. —*ఖమాచిరాగము—ఏకతాళము-త్రిశ్రజాతి*—

బళిబళి సుచరిత్రముల్-నీ-పలుకు లతి విచిత్రముల్ । ఇలనృపతు
లనంగనె మా-నీంద్రులె జనకా? బళి.

1 పొంగఁడే? కలంగఁడే? రు-క్మాంగదుఁడనఁ ధీరుఁడే? అంగనల
నెఱుంగని ఋష్య-శృంగుఁడె జనకా? బళి.

2 తుంటవిల్తుఁడల్పుఁడే? వే-న్నంటిగేలి సల్పుఁడే । నాకంటఁబడిన
యంత వీని - గర్వము౯ వదల్పుఁడే? బళి.

44 [14] కాఁపులు—*నాథనామక్రియరాగము—ఏకతాళము-త్రిశ్రజాతి*—

మా పాలియంకన్న శరణు । ఏ । పాప మెఱుఁగమిలను. మా.

1 కొబ్బరి కాయలు-కొల్లగ నీకిచ్చి గొబ్బున నెప్పుడు కొల్తుము
దేవా । దబ్బునరమ్ము-దరిజేర్చ మమ్ము-నిబ్బర మిమ్ము-నీదే భారమ్ము. మా.
2 యేడు కొండలమీఁద-యెలసినదేవా । తోడు నీడ మాకు-దొర
వీవ కావా । నేడిటు రావా? నెమ్మది నీవా? గోడు బాపవా?
కోర్కె లీవా?. మా.

53 [15] మోహిని —*బేహాగ్ రాగము—త్రిపుటతాళము-చతురశ్రజాతి*—

ఎంతో సొంపైయున్నది - మది - కెంతో యింపైయున్నది.
వసంత మనంత లతాంత సంతతుల. నెంతో.

1 చల్లగాలి వేగ - నల్లుకొని రాగ । ఉల్లముప్పొంగ జల్ ఝల్లు
మనంగ హా. యెంతో.

2 కమ్మతేనె మెక్కి - నెమ్మిబాగ రెక్కి । తుమ్మెదల ఱేఁడు
ఝుం - ఝుమ్మనఁగ నేఁడు హా. యెంతో.

3 సంతసించి శుకము - పంతగించి పికము । కంతుఁడే యీడ భ
గ - వంతుఁడని పాడ హా. యెంతో.

54 [16] మోహిని —*సురటరాగము—ఆదితాళము.*—

ధన్యుఁడనఁగ నతఁడే—జగంబున.
అన్యమెఱుంగక - యల యువతీజన । మాన్యుఁడైన గుణ - మహిం
తుఁ డొక్కరుఁడె. ధన్యు.

1 అల్లరిమారుని - యాలయికలకుఁబడి - నెల్లవఁకైమై - జల్లనంగ ।
పల్లడిఁగొనియెడు _పల్లవపాణికిఁ । గిళ్ళలొనసఁగిసుఖింప లభించిన.

2 మక్కువఁగలచెలి - మడుపులందిచ్చుచుఁ - బ్రక్కఁజేరియొకస
క్కమాడఁగా । గ్రక్కునఁబైకొని - కాఁగిటనలవి యా - చక్కని
మోవి చు - రుక్కున నొక్కిన. ధన్యు.

3 చెంతనిలుచుప్రియ - కాంతలఁజక్కలి । గింతలవింతల నెంతోతే
ల్చి । కంతురాజ్యమ - ల్లంతఁజూరఁగొను కాంతుఁడనఁగ భగ -
వంతుఁడె యనఁదగు. ధన్యు.

| | | |
|---|---|---|
| సా, ని ద ప - మపధపా - మగప మరి | రీ, సా, - నిస | రి మప- రీ, మ ప ని |
| కూ, టముల -సురటియే - బలుసొగస | టం,చుక - మది | దెలిసి - ప్రే, మఁగొని |
| సా, రి రి స- ని రిసని ద ప- మ ప ని స | రి సాని దప - ధప | ,మగ రి -పమ రీ - |
| పా, టలను- మదిగఱచెడి- యువతుల | ముదంబెసగ -నెదం | ,గదియు-సదయా- |

రి స.
త్ముఁడె. ధన్యుఁడ.

56 [17] —*శంకరాభరణరాగము—ఆదితాళము.*—

రుక్మా—మానిని యెవ్వరవే? గుణ - మండిత! పేరెదియే? యీ -
కానలఁబడి యను - మానములేక ప్ర - యాణమిదెచ్చటికే?

మోహి—ఎవ్వరైన నేల? పే - రెద్దియో నీకేల? - యివ్వనభూమిఁ
జ - రింపఁగఁదగదె యిఁ - కెవ్వరు నెవ్వళ?

రుక్మా—వనితరో! పతియెవరే? నీ - జనకుండేఘనుఁడే? విన వేడుక
క - గ్గెను దెల్పుమ సా - మనవిని విని వేగ.

(ఈపాటకొఱకుప్రసంగములో * ఈగుర్తువఱకునువిడిచివేయవలెను)

మోహి—జనకుఁడేల విధాత; నిజేచ్ఛం - జనుదు నవివాహిత; ఆ విధి - మనమునఁబుట్టి మోహినియనఁబడితి; ఏ-మనినీ కేల యిట?

58 [18] మోహిని. —*ధీరశంకరాభరణము— (ఫారసీమట్టు) ఆదితాళము*—

వింతవింత లాడితి - సంతసంబుఁ జూపితి। చెంతసట్టె చేరితి - చేయి బట్టవచ్చితి। తగుర! - తగుర? - పదులు - నగర? - జోరా కన్ను లుకానవా? । ఇనకులజుఁడవా? - యిచటఁబ్రభుఁడవా? - యింతటి వాఁడవా? - మతిమఱచితివా? - మాతో నిటుఁ దగువా? - చాల్ చాల్ పో.

(తెనుఁగుపాటల నియమములు ఇట్టి ఫారసీమట్లయందుండవు.)

59 [19] —*ధీరశంకరాభరణరాగము—ఏకతాళము—త్రిశ్రజాతి*—

మోహి—చాలయ్య రాజేంద్ర చాలు - నీకథ - చాల్చాలుపోపోన య్య। మేలయ్య! నీవెఱ్ఱి - మేలము లిట నిం - కేల చేసెద య్య?। యీ లీల వీడు మయ్య. చాలయ్య.

రుక్మా—అక్కట కోమలి యేలనన్నిటు - లాడఁజూచెదే? । ఎక్క డో మరువారిఁజొక్కితినీకేలఁ - జిక్కితిఁగావఁగదే। నీకే। ద క్కితి నేలఁగదే. అక్కట.

మోహి—నా కేలఁజిక్కఁగ - నీ కేలయీ వెఱ్ఱి-పోకలు మానుమయ్య। జోకతో నీకెల్ల - సుఖములొసంగన - నేకులు లేరఁటయ్య?। యి ట్టి। సోకులు చెల్లునయ్య? చాలయ్య.

రుక్మా—కొమ్మరో! నిన్నెద - నమ్మితినీకు మే - నమ్మితిఁగావఁ గదే। నమ్మనేనీవాఁడ - సుమ్మిఁకనన్నేలు - కొమ్మసమయ మ్మిదే। కారు। ణ్యమ్మునఁజూపఁగదే. అక్కట.

62 [20] రుక్మాంగదుఁడు. —*బేహాగ్ రాగము—ఏకతాళము*—

తలోదరి! యిటు వినుమా - ననుదయఁ గనుమా - యనుమా - సము విడుమా.

1 (మిశ్రగతి) వేఁడి - వేఁడి - యోడి - నాఁడ - మోడి - చే

యం - జూడకే - (చతురశ్రగతి) వడిగా - మదిగా - గడుఁదయని
డుచుగా - జూడఁగదవే - శుభం బగుగా. తలో.

68 [21] —*ధీరశంకరాభరణరాగము—ఏకతాళము—చతురశ్రజాతి.*—

సాని - సగ్గామపా । మా । పాదాద్ద - పామాప - గమగరిసా. పా
పాప - దాదాద - నీనీని - సాసాస - నీనీద - పాదా - నిసానీదా
పా । పాదాద్ద - పామాప - గమగరిసా. సాని - సగామపా.

పద్మ—అయ్యో । దయాళుఁడే

చక్రో— ... ... ... కాఁ డబద్ధ మబద్ధ మబద్ధమే,

1 పద్మా—ఆనాఁడు - మనల - మన్నింపఁ - గాలేదె? ।

చక్రో— ... ... ... ...ఆనాఁ డిట్టినాతి లేదయ్యోఁగా

పద్మా—హా! నాథుఁ డన్యుఁడె?

చక్రో— ... ... ... నమ్మఁదగదే. అయ్యో.

2 పద్మా—లాలించి - బేలించి - పాలించఁ - గాలేదె?

చక్రో— ... ... ...మేలెంచి - కావె కాఁ - గిలించనే ।

పద్మా—అలించు నా మొఱ

చక్రో— ... ... వినఁ దగదే. అయ్యో.

70 [22] పద్మగంధి. —*అసావేరి—ఏకతాళము=మిశ్రజాతి*—

ప్రాణేశుఁ డొల్లని - బ్రతుకేల జగమెల్ల। బహు దుఃఖాకరమేనమ్మా.
1 మానినికిని భువి - మానఘనములకు। ప్రాణేశు సేవయే - పరమార్థ
మమ్మా. ప్రాణేశుఁ.

73 [23] పద్మగంధి. —కాఫీరాగము—ఏకతాళము—చతురశ్రగతి—

ఎటులు సహింతునో - యీశా యీ దుర్దశ? ।
ఎటులు సహింతు - నే - నెటులు భరింతు. ఎటులు.

1 కటకట విభుఁడు పర - కాంత పాలగుట । నెటులు నే విం
దుః భువి - నెట్లు మనియుందు? ఎటులు.

74 [24] సంధ్యావళి. —కన్నడరాగము—ఆదితాళము.—

వినుఁడీ, యింకేమి జరుగునో - కనుఁడీ - వేగిరపాటుమాని. విను.

1 వినుఁడీ - యొక్కింత శాంతిఁ గొనుఁడీ - సాత్త్వులగుచు నూరక కనుఁడీ - మనగతి కొరులు కర్త - లనుటయెల్లఁ గల్లయని తెలియుఁడీ. వినుఁడీ.

81 [25] మోహిని. —*తోడిరాగము—ఏకతాళము—మిశ్రగతి.*—

పావనహృదయా నా - ప్రాణేశ నిన్నను - భాగ్య మెన్నటికైనఁగాంతునా? పావన.

1 మల్లెలు మొల్లలు చేర్తునా? - మంచిగమాలలు కూర్తునా?కొల్లగ నీమెడ నుంతునా? మోవి - కొసరి కొసరి సొక్కింతునా. పావన?

2 కోరినిన్ గౌఁగిట నుంతునా? - కొదమగుబ్బలచే హత్తింతునా? నేరమాయంచుఁ బ్రార్థింతునా? నీ - నెనరున, బడిసుఖియింతునా?

3 వగలఁదేల్చి మెప్పింతునా? ని - ర్వచనీయ గతులసోలింతునా? పగలు రేలిటులు సేవింతునా?నీవె- భగవంతుఁడంచునుతింతునా? పా.

87 [26] —*ఫరజు రాగము—త్రిపుటతాళము—చతురశ్రజాతి.*—

మోహి— రాజేంద్రా! యీవిధితగునా? । యీ । యోజన న్వీడనాడ నగునా? అహా. రాజేంద్రా.

రుక్మాం— రాజాననా! నిన్ విడిచెదనా? । వి । భ్రాజితమదగజగమనా! యుడు. రాజాననా.

మోహి— ఒంటిగ నన్విడిచి యొంటరివై నిలిచి । మింటికై చూచెదవే! అహా. రాజేంద్రా.

రుక్మాం— హరివాసరవ్రతము మఱచితిఁగావున । హరికరుణను వేడితి । యుడు. రాజాననా.

---

ఈ 17 పాటను పంచమాంకములోని 4, 6, 8, పద్యముల ప్రారంభముందు వరుసగా ఒక్కొక్క చరణము చొప్పునఁ బాడవలయును.

92 [27] మోహిని. —*ఫరజు రాగము=ఏక తాళము—చతురశ్రజాతి*—

నాఁటిమాటలు మఱపాయె నా? నేఁటికవెల్ల వెగటాయె నా? యల. నా.

వాటముగా స - య్యాటలనాడిన । మాటలెల్లఘూటా లాయె నా? యల. నాఁటి.

1 పాయనె చెలివల - పాయెనె నిన్నేఁడ । బాయుననుటయెల్ల పోయెనా? యల. నాఁటి.

2 పలుకుపలుకునఁ దేనె - లొలుకునెనెడినాదు । పలుకులు ములుకులై సోఁకెనా? యల. నాఁటి.

3 సంతసముగ భగ - వంతుని కథ లివు । డంత వీనులవిందులాయె నా? యల. నాఁటి.

95 [28] *a* —*అఠాణ రాగము—ఏక తాళము—మిశ్రజాతి*—

రుక్మా—ఎంతగఁబల్కితివి - కాంతరో! వింతలాయెనే. ఎంత.

1 కంతుసుఖమేకోరి యొ - క్కింతయు యోచింపకయే । పంతగించి నీవిటులు - వింత వింతలాడుచు నేఁ. ఎంత.

మోహి—ఎంతటిఘనుఁడవు - రాజా! రవితేజా! నీ. వెంత.

1 కంతుబారి కోర్వనంట - యింతి? నినుఁ బాయనంట । యంతయుఁ గలసెమింట - వింతలాయె నేనిట్లుంటి; నీ. వెంతటి.

రుక్మా—2 ఆఁడవారి మాటలకు - నోడివ్యర్థులైనవార । లేరు లోకములలోన - నేఁడు నే నాఁడుఁగలరె. యెంతగ.

మోహి—2 ఆఁడవారితోడఁగల్ల - లాడినారిఁగూడి యిట్లు మోడి సేయువాఁడే నాఁడు - లేఁడా? యోరేఁడా! తగునీ.

రుక్మా—3 కల్లలేమికాదు ని - న్నొల్లననుటయు లేదు । అల్లనాఁడు వ్రతము విడ - నొల్ల నంటమఱచితి నేఁ. ఎంతగ.

మోహి—3 మఱచుటలు నీకే కాదు - మర్యాదయె మీయింటను ; దొరలకును మఱియు స్వార్థ - పరులకుఁ బామరులకును నీ. వెం

(ఈ 28 *a b* లలో నొకటి మాత్రము పాడిన చాలును.)

95 [28] b రుక్మాంగదుఁడు. —*సురటరాగము—ఆదితాళము*—

హా మగువయిటు - లగడు పలుకులను - మిగిలి పలికెదవె - వహ్వాహ్వ!
ఈ మహిని భామ లిటు వ్రతములు-నోములను మాపగను జూతుగదా. హా.
1 బాలురను వృద్ధులనురోగులుభోగులును సుంతయును దొలఁగక-
చాలగను సల్పఁదగు వ్రతమిది - యేలయని చాలునని తెగడెదు. హా.

111 [29] ధర్మాంగదుఁడు. —*కాఫీరాగము—ఏకతాళము—మిశ్రజాతి*—

జననీ! యీ వగపేల? । సతంబే యీ - జగంబెల్ల? ।
కనుమీ దృశ్యమిదెల్ల । వినుమీ - నిల్చుటకల్ల. జననీ.
1 మున్ని జగతి - నెన్నో యుగముల్ । చన్నవనుచు - జననీ! విన
వే? । ఎన్నవార - లెల్లనేఁడు - నున్నారమ్మ? - యూహింపుమా. జ.

114 [30] —*కమాచిరాగము—ఏకతాళము—చతురశ్రజాతి*—

మోహి—తాళు తాళు రాజా!
రుక్మా—తాళజాలనే.
మోహి—తాళు తాళు రాజా! యిది తగవా?
రుక్మా—తాళనేటికె యింకనో మగువా?
మోహి—బిగువా? క్షణమైన నిల్వలేవా?
రుక్మా—నగవా - రడిగాదె యో మగువా?
మోహి—బాలునిటు చంపకు.
రుక్మా—వ్రతము విడు మనకు.
మోహి—సెబాస్!
రుక్మా—పో.

120 [31]. ధర్మాంగదుఁడు. —*సురటరాగము—ఏకతాళము—చతురశ్రజాతి*—

ఏల పల్కెద వీలీల? జననీ! నీ. వేల.
చాలుచాలు నిఁక వినఁ - జాల నిట్టి పల్కులు, నీ. వేల.
1 సామి నేమఱచి - సకలముఁ జెఱచి, మా । నీమమునిప్డిలివెల్ల -
నీటఁ గల్పమనెదె? నీ. వేల.
2 యుక్తులు తెల్పి, దు - రుక్తులుపల్కి, మా । భక్తి ముక్తి యెల్ల
నేఁడు - పాడొనర్పమనెదె? నీ. వేల.

132 [32] అందఱు. —*సురటరాగము—ఏకతాళము*—

మంగళము భూవరా - రుక్మాంగద మకుటధరా! అంగజజనకుని కృపఁగొని యాచం - ద్రార్క మైన కీర్తిగొనుమి జయజయ. మంగళము

1 ధరకు ముదముఁ గూర్చి, విబు - ధాళి నాదరించి, స - త్పురుషులఁ బోషించి, ముని - ముఖ్యులఁ బూజించి, మించి - సరసు లెల్లరును సత్ప్రభుఁ డితఁడని - సకలగతుల నిన్ను మెచ్చునట్లుగ - నరసి ప్రజల నేలుమయ్య శ్రీ ధ - ర్మాంగదావనీశ నీకు జయజయ. మంగళము.

[33] —*హనుమతోడిరాగము—రూపకతాళము—చతురశ్రజాతి*—

దీనపోషకా! భక్తా - ధీనరక్షకా! । దానగుణ ని - ధానమోక్ష సం - ధాన గావరా.

మానక నీ స్మరణమె యిమ్ప - మానరహిత మనుచుఁ దెలిసి- మాన సమునఁ నిల్పితి నీక - మాన మాననీయచరిత. దీన.

దశవద - నవిదళ - ననిపుణ. దీన.

పరాక? మను - పరాద యుఁక. దీన.

కా - మితఫలద - శుభద. దీన.

1 రారారణ - శూరాశ్రితి - సారాసువి - చారావర.

2 ఆ పదల - బా పఁగల - ప్రాపనుచు - నీ పదము । దాపు - జేర । పా - పచయము - ఉడుపవె? దీన.

3 రాపేల? గోపాల - నీపాలఁబడి తి ర । కోపమేల? - గోపీలో ల । కాపాడర కరుణాకర - తాపసార్చితాంఘ్రియుగళ. దీన.

4 దాసహృన్ని - వాసనన్ని - దోషపుంజములనిడవు । మోసఁగాం ద్ర వలలఁ దగిలి । యాసలఁబడి - వేసరివడి - నీ సముఖము - డా సితినిర. దీన.

5 పంత మేల చేసెదు? భగ - వంత దాసపోషా । యావంతయైనఁ గరుణ లేదె? - సంతతాశ్రితావనచణ. దీన.

33. స్వరజతి—మలయమారుత రాగము—త్రిపుటతాళ చతురశ్రజాతి.

| | | |
|---|---|---|
| సా, రీ, గా,, పా, - దనిద | పా,, - ,, ద ని | సని ద ప - గరిసని. |
| కో, రీ, యు,, న్నా, - రవిట | రా,, - ,, యుడ | సదయుడ - పనిని నె. |
| సా, రీగ - రీ, గాప - గా పద | నీ, దాప - దని | దథప - ని దపగరి. నా. |
| రా, వేల - భూ, పాల - యోపర | నీ, పాల - బడి | తినిర - విపువనుర. కో. |
| ౧ గా,,,, - పగగరి - రిగరి స - సరి | గా,,,, - గప | ద నిద ప - గ రి స రి |
| గా,,,, - నరసిక - నినుగని - సరి | గా,,,, - సర | సుడనప్పు - దనుచును |
| గా,,,, - రీ, సానిద పగరి | గా,,,,, - రి | సనిదప - ద ని స రి |
| గా,,,, - టం, బైనసుమశరు | గా,,,,, - సి | నిదగిలి - సమయము |
| గా, - పదపగరి - గా, - నిదపగ రి | గా, - దని దథప | గా, - రి సనిసరి |
| గా, - నకపగచ - గా, - విధివశము | గా, - నిదియొతజి | గా, - దొరకితివి |
| గా, - పగరిగా, - ప ద ప గా, - ని | దపగా, - రిగా | , - పగా, - షగ రి. సా. |
| గా. - దనకగా, - ప్రమటుగా, - క | విడగా, - జగా | , - నగా, - దనరె. కో. |
| ౨ పా,,,, - ద ని - సనిథప - గ రి స రి | గా,,,, - సరి | గ రి - రిగరి - సరిగ |
| పా,,,, - దము - లబడితి - రమలయ | మా,,,, - రుత | మున - కదరి - బెదరి |
| పా, - దనిదపా, - నిద నిపా, - ద | ని సపా, - దనిస | రీ, - గారి - స ని |
| పా, - డెదరపా, - టలనుపా, - వ | నకృపా, - మతిని | ప్రా, - ణేశ - నిను |

| | | |
|---|---|---|
| డా,- ని దని -పని ద- ప దప -గప గ -రి | గరి - స రి స ని ద ప | ద ని స రి - ప గగరి |
| బా,-యనుర సదయ-హృదయ-గదియ-గ | దర - యిదెసమయము | ముదమున - మదవతి |
| గా పదాప - నీద - సా రిస నిదప | పా ని దాప - గప | ద నిదప - గ రిసని. సా. |
| ప్రా పు వేడ - పీడ - కూ డదుగదర | యాప రాని - వల | పునబడి - వినెమది. కో. |
| 3 స్తా, - స రి స స నిదా, - ద నిదధ ప | గా, - ప గప - రీ | , - గ రిగసా - ని స |
| క, - మ్మవి ఖతుడు ర, - మ్మనసుపదు | న, - మ్ములను - జి | , - మ్మగనువె - న్నెల |
| రీ గా,, - గపగరి రి గ - స రి గ రి | గాపా,, - గా | ప నిద ప - గారి గ |
| గాయ,, - శుకపికములు - బలురొద | సేయ,, - తు | మ్మెదగమి - జుమ్మని |
| పా, దా, - దానిసరి స స ని - దని | సా స - రీ స - గా | రి - గాప - గారిస |
| మ్రో, య, - కోరికలొసగుదు - వని | డాయ - వేఱు - జే | య - మేర - గాదుర |
| రీ, - సని సదా, - నిద ని - ప గపధ | గా, - పగప రీ | , గ ధ పగ రిసని. సా. |
| సం, - తతమ సం, - తసము - ననుభగ | వం, - తునిగనెం | , తయుమది దెలిసి. కో. |

34.—*స్వరజతి—చక్రవాక రాగము—ఆదితాళః.*—

| | | |
|---|---|---|
| సా, నీ, డా, - నిదధప - పమగ | రీ, సా, రీ | , గామా ప ద ని. సా. |
| సా, మా, నా, - మనవిని - విన వ | దే, మా, జా | , లం బే మిఝటు. సా. |
| సా, రి స ని - ద ని సనిద - దని ద పమ | గా, రీ, గా | , సరిగమ ప ద ని. సా. |
| సా, మియని - యనుదినము - నినెగొలువ | గా, వే, గా | , రవమున మనుప. సా. |



| | | |
|---|---|---|
| దా, - దని దధప - మా, పధప పమ | గా, మపమమగ | రీ,- గమపదని. సా. |
| దా, - నవహారణ - మా, నితసుగుణ | గా, వ గ డె శ బ | రీ,- ప్రణుతపద. సా. |
| పా,,,, - ద ని దపమా,, - ప ద | పమగా,, - మప | మగరీ,, - గమ |
| పా,,,, - పహారణమా,, - మొజ | వి నిగా,, - వ గ | నెవరీ,, - భువి |
| గరిసా - స రిసనిదా - ద నిసరిగా | నిసరిగమా - గమ | పా - మగమప దని. సా. |
| నికసా - మజవరదా - యనిసరిగా | దలచితిమా - మక | ప్రా- ర్థనగొనెదని. సా. |
| 3 సా రిగరిస - ని రిసాని - ద నిపదని | సా, ని ద ప - మప | ద నిదప - మ ధ ప మ |
| కామితవర - దుడపేవె - యనిమదిని | నా, మికృప - ని డి | కడువడి - యఘుచయ |
| గా, రిరిస - ని రిసాని - దని స ి గ | మా, - ప దనిద ప | మా, - ప సనిద ప |
| గా, ధలను - దెగటార్చి - ననునునుపు | మా, - మదినిలుపు | మా, - కృపసలుపు |
| మాంప ద - నిని దధప మ -పమగ మపద | నీ - దనిసా - ని స | రీ - సరి ససాని |
| మాయని -యనుదినమును -తవమృదుపద | నీ - రజసే - వయె | శ్రీ - కరమటంచు |
| ద ని సరిగా,, - రిస ని సరీ,, | స ని ద నిసా ని ద | పమ - గమపా దని. సా. |
| మొులిడగా,, - విన వెహారీ,, | యిటుమనసామజ | నగ - భగవంతుడ. నా. |

## 35 తానవర్ణము—ముఖారిరాగము—ఆదితాళము.

ప్ర. శ్రీవిజయవాడపురాధీశా! (అను.) భగవంతదాసపోష! చ. పాపవినాశా! పరమేశ.

| | | |
|---|---|---|
| ప. సెసానిదప - సని దప - మపమగరిస | రీ,, - ,, రిమ | పనిద - పదమపద |
| శ్రీఈఇవిఇ - జఅంయఅ - వఅఅఅఅఅ | డ,, - ,, అఅ | అఅఅ - అఅఅఅఅ |
| నిదాప - మపధస - నిదాప - మగరిస | ధసా - దసరిగరి | మగరి - సరిమపద |
| పుఊఉ - ఉఉఉఉ - రఅఅ - అఅఅఅ | ధిఈ - ఇఇఇఇఇ | శఅఅ - అఅఅఅఅ |
| అ. పా, - మపధ - మపధప - మపమగరిస | దా, - సరిస - ధస | సరి రిమ మప పద |
| భ, - అఅఅ - గఅఅ ఎ - వ ం ం ంంం | త, - అఅఅ - దఅ | అఅఅఅ అఅ అస |
| పా, - ధస రిగరి - మ రి - పమగరిస | రి రీ సనిద - సని | దప - మగ రిమపద. |
| పో, - ఒఒఒఒఒ - షఽ అ - అఅఅఅఅ | శ్రీఈ ఇఇఇ - నఅ | అఅ - గఅ రెవ ఎశ. |
| సానిదా, - స ని దా మపధ - మపమ | ధా, పా, - మని | దప - మప మగ రి స |
| శ్రీరమా, - హితమా నితమ - హితసు | ధా, మా, - నను | గృప - గ ని మనుపుమ |
| మా, గ రి స - పా, ఎ గ రి - రిమపధ | పా, పాధ - మా | , పా ధ - పనిద స |
| మా, నుపుమ - బా, ములను - శ్రితజన | సం, తాన - సీ | , ధ్యాన - పటిమను |
| నీ, దాస - గా, రీస - నీ, ద | , ప - గా, రీస | రీమపా - ధ సరి |
| సం, ధించు - గా, రీశ మా, ని | , శ - వా, ణీశ | సేవితా - దురిత |

| | | | |
|---|---|---|---|
| | మగారి - సరిపమాగరిస - సనిధప | రిసానిదప - ధప | , మగ - రీమపద. స. |
| | వినాశ - నినువి నాగతిని - గసనుర | ధరాస్థలిని దొర | , విను - రాజధర. శ్రీ. |
| చ. | పా, ద - మప - నిని దధ పప మమ గరి | సా,, - దా, స | ,, - రీ, మామ. పా. |
| | పా, వ - వి ఇ - ఇఇ ఇఇ ఇఇ ఇ ఇ నల | శా,, - ష, ర | ,, - అ, మే శ. పా. |
| ౧ | పా, మా, - నీ,, - పా, ప - ధరి | సా, - నీ, దా | , పామాగ - రిమ. పా. |
| | ఈ, శా, - కై,, - లా, స - గిరి | శా, - వి, శ్వే | , శాపాహి - నమ. పా. |
| ౨ | స రిమ - రిమప - మపద - పధస - ప దస రి | మ. గరి - సనిధ - సని | ధప - పమగరి - రిమ. పా. |
| | సుగుణా - ధరణా - భరణా - నిపుణా - భవభయ | హరణా - చరణా - నుత | గుణా - వితరణా - చణా. పా. |
| ౩ | పా, - పమ గరి మపా, - రిమస రి మ | పా, - ధ పధపమ | పా, - నిద నిపధ |
| | పా, - పభయమునుపా, - ఉదరుమును | పా, - యామనితవ | పా, - దభజనమ |
| | పా, నిదపదసపా, - ధ రి స నిద | పా, - గరిస నిద | పా, - పదసరిమ. పా. |
| | పా, రగతిసురపా, - లముఖశ్రిత | పా, - శిసలుపరె | పా, - వనచరిత. పా. |
| ౪ | నీ, దా, పా, మాప - మాపమ | నీ, దా, మా | , పా ధ - మపధస |
| | పా, లా, రా, వేల - శాలవి | పా, లా, చి | , ద్యుతి - విలసిత |
| | నీ, దా, - గా, రీస - సరి ధరి | నీ, దా, - మ | , గరిస - రిమపధ |
| | పా, లా, - మాం, పాహి - శ్రితపరి | పా, లా, - వ | , మ్మితిర - ప్రణమిత |

గీ. శ్రీశుకృపఁగాంచి యీ కృతి • సిరుల మించి
సకల జనముల మెప్పించి • చవుల నించి
బుధజనాశీస్సుల గడించి • పొలుపుగాంచి
ధరణి వెలయుత మా చంద్ర • తారకముగ.

సమాప్తము.

M. Kumaran



# గానసారము. రు 1-0-0.

ఈ గ్రంథము నిష్కళంకమగు సంగీతవిద్యా జ్ఞానమును గలిగించును. గురుబోధ అక్కఱలేకయే ఎల్లరకుఁ దెలియును.

గ్రంథకర్త:--చేతపూడి భగవంతరావు, బెజవాడ.

——(o)——

## పండితాభిప్రాయములు.

1. శ్రీమాన్ తచ్చూరి శింగరాచార్యులుగారు, చెన్నపట్టణము.

ఈ గ్రంథము ఎల్లరయొద్ద నుండదగినది. మిక్కిలి ఉపకారి.

2. మ. రా. గరికిపర్తి కోటయ్యదేవరగారు, మచిలీపట్టణము.

ఇది ప్రతి సంగీతవిద్యార్థియు పాఠమువలె జదువదగియున్నది. విద్యాధికుల విషయమై నేను వచింప నక్కఱయుండదు.

3. బ్రహ్మశ్రీ తిరువత్తూరు త్యాగయ్యగారు, ముత్యాలపేట, మదరాసు.

ఇటీవల గొందఱు బుద్ధిశాలులు సంగీతమందు గొన్ని గ్రంథముల బ్రచురించుచువచ్చిరి గాని వానిలో దేనియందును సంగీతశాస్త్రవిషయము లింత స్పష్టముగను సుబోధముగను వ్రాయబడ లేదని నా నమ్మకము.

4. Dr. D. S. RAMACHENDRA RAO GARU,
*M.A., M.B., Ch.B., (Edinburgh).*

By educating the musical tastes of the people, particularly of those who are educated, he [the author] hopes to bring force on the musicians till they be obliged to respond to the public demand. --- I am of hope that the Ganasaram will surely find a wide reading public.

5. మ. రా. రెంటాల వేంకటసుబ్బారావు పంతులుగారు,
హైకోర్టువకీలు, మదరాసు.

Ganasaram is quite a novel work bristling with original ideas. I with you God-speed in your great undertaking.

6. శ్రీమాన్ పండిత డి. గోపాలాచార్యులుగారు, A. V. S, మదరాసు

ఈ గ్రంథ ప్రకటనముచే సంగీత సాహిత్య విద్యాసంఘము రెంటిని జేర్ప యత్నించుచున్న తమ మహోద్యమంబునకు దోడ్పా వెనుదీయువార లుండ రని నా నమ్మకము.

7. మ. రా. పెద్దిభొట్ల వీరయ్యపంతులుగారు, బి.ఏ., బి.యల్., బెజవాడ.

If public (music) entertainments are to be modelle on the lines suggested by Mr. Bhagavanta Rao, I am su there will be greater attraction for them and music wi have its proper place in *reforming our society.*

8. R. WILLIAMS Esquire, B.A., Bezwada.

He [the author] is engaged in the great work of reviving the A and Science of Music.

9. మ. రా. వేమవరపు రామదాసుపంతులుగారు, హైకోర్టు వకీలు, మదరా

One peculiar feature of the lectures is that they are so thorough popular that every layman can understand them in all their detail.

C. S. NARAINA RAO GARU, SHIRASTADAR, Dt. COURT, Masulipata

I agree with Mr. Bhagavantarao in this view as in all others affirm that it is impossible for a human being not to be touched with mus properly sung, as he puts it.

11. మ. రా. ధార్వాడ వేంకటకృష్ణారావు పంతులుగారు,
హైకోర్టు వకీలు, రాజమండ్రి.

I think Mr. Bhagavanta Rao is the first to lodge protest against the defects of the present day Hindu Mu

12. శ్రీమాన్ యం. నరసింహాచార్యులుగారు, బి.ఏ., బి.యల్., నెల్లూరు.

It is impossible for one not to know what music after once hearing Mr. Bhagavanta Rao's lectures. H lectures are printed (in Ganasaram) and every true lover music ought to possess a copy of the same.

13. మ. రా. పి. సుబ్బయ్యపంతులుగారు, బి.ఏ.,
శ్రీకృష్ణ గానసమాజకార్యదర్శి, వేంకటగిరి.

The lectures of Mr. B. Bhagavanta Rao are ver instructive and full of popular and interesting illustrations He received from the Raja of Venkatagiri and his relatives R, 200. as presents for his all-round intelligence and versatility.

14. మ. రా. బి. వేంకటపతిరాజుగారు, హైకోర్టువకీలు, విశాఖపట్టణము.

Mr. Bhagavanta Rao may be said to be the poineer of music reform in our parts. All those who have *country's interest* at heart will encourage this gentleman.

15. మ. రా. వి. రామలింగస్వామిగారు, బి.ఎ.,
మహారాజాస్ హైస్కూల్ హెడ్ మాస్టర్, బొబ్బిలి.

The necessity of reform in music and of change in the attitude of the generality of our countrymen towards music was excellently brought home to the hearts of all (by Mr. Bhagavanta Rao.)

16. బొబ్బిలిసంస్థానాస్థాన సంగీతవిద్వాంసు లగు బ్రహ్మశ్రీ వాసా సాంబయ్యగారు, వాసా కృష్ణమూర్తిగారు, వాసా వేంకటరామయ్యగారు.

శ్రీభగవంతరావుగారు చెప్పెడి గాయకసంఘసంస్కరణములు మిక్కిలి యథార్థములును అందఱును ఒప్పుకొనదగినవియు నయి యున్నవి.

—o—

## పత్రికాభిప్రాయములు.

### 1. శశిలేఖ, 19-3-1909.

సంగీత విషయములనే బొత్తిగ నెఱుగని సాహిత్యవిద్యాధికులకు గురుసాహాయ్యాపేక్షలేకయే సులభగ్రాహ్యముగునట్లు లిది (గానసారము) బోధనక్రమంబున నారంభవిషయములనుండియు వ్రాయబడినది. ఇందు శ్రుతిలక్షణము, రాగప్రస్తారము, స్వరప్రకరణము, పల్లవిపాట, పరీక్షావిధానము, పదిఅవధానములు, సంగీతకవిత్వము మొదలగు విషయంబులు సుబోధంబుగ దెలుపబడినవి. చదివినకొలదిని రుచి పుట్టును.

### 2. రవిపత్రిక, కాకినాడ.

వీరికి సంగీతసాహిత్యములు రెంటియందు ను సమగ్రత యుండుటచేత వీరి యుపన్యాసములు సుబోధకములుగనే గాక శ్రావ్యములుగ గూడ నున్నవి.

### 3. దేశాభిమాని, 23-5-10.

ప్రతి యాంధ్రునకును సంగీతవిద్యాజ్ఞానమును గలిగించుటకు ఈ 'గానసారము'. ఈ గ్రంథము నూతనముగ బ్రచురింపబడినది. సంగీతమును మొదలే యెఱుగనివారికెల్లర కిది మిక్కిలి మంచి సమయము. ఇందు గానవిద్య పసిపిల్లలకు బోధించినట్లు నేర్పబడినది. దీనియందు వారు గ్రహింపజాలని పంక్తి యొక్కటి యైన నుండదు.

4. హిందూపత్రిక, **Monday July 1909.**

Mr. Bhagavanta Rao's mission is to impress on the public at large the importance of music in literature. What Mr. Rao wants to do is to cultivate a taste for music in every home as it is the case in European homes. With this object in view he has written a book Ganasaram. The book cannot be too widely read as it treats of a subject so vitally concerning the aesthetic part of our nature.

### 5. సత్యదూత.

ఈ గానసారగ్రంథ సాహాయ్యంబున సులభసాధ్యంబగు సంగీతవిద్యాపరిజ్ఞానంబును సాహిత్యపరులెల్లరును సంపాదించుట యనునది వీరు పూనిన గాయకసంఘసంస్కరణకార్యమునకు ప్రథమసోపానంబును, ప్రధానసాధనంబును గూడ నగుచున్నది. కావున విద్యార్థులు, ఉద్యోగస్థులు, వ్యాపారులు లోనగు సాహిత్యపరులెల్లరును ఈ గానసారగ్రంథమును జదివి మేలొంది శ్రీ భగవంతరావుగారుపూనిన గాయకసంఘసంస్కరణకార్యమునకు దోడ్పడుదురుగాక యని మిక్కిలిగా కోరుచున్నాము.

### 6. అభినవసరస్వతి, జనేవరి, 1912.

వీరు ముందు నాటకరచనయందారితేరిన వారగుటచేత నీ గ్రంథమును జదువరులకు విసువు గలిగింపనట్లును, రసజనకంబుగ నుండునట్లును రచించిరి. ఈ గ్రంథము మన సంగీతసాహిత్యసంఘములు రెండింటికి నుపయోగకరమైనది. కావున గాయకులును, గానమెఱుగని కేవల సాహిత్యపరులును గూడ దీనిం జదివి మేలుపడయుటయేగాక దేశోపకారులును అగుదు రని కోరుచున్నాము.

---o---

## మంచి నాటకములు.

1. రుక్మాంగద (డ్రామా) రు 1—0—0.

నీతులకు పెన్నిధి. నవ్వులతో కడుపుబ్బును.
స్త్రీలకు పరమగురువు. భక్తులకు మోదదాయకము.

2. మనుసంభవము (డ్రామా) రు 1—0—

1912 సం॥ బి. యే. తరగతి పరీక్షగ్రంథము.
దీనిని ప్రదర్శనమందు చూచి తీరవలయును.

*Apply to the author* చేతపూడి భగవంతరావు, బెజవాడ.

"Cinema" Educational Press, Bezwada. 56-12.